శ్రీ రస్తు.

# జాతకఫలచింతామణి

## ఆంధ్రతాత్పర్య సహితము.

రెండవ భాగము.

ఇది

వెల్లాల. సీతారామయ్యగారిచే
వ్రాయబడినది.



చెన్నపురి: ప్రాత చాకలపేటయందుండు
షణ్ము-త్యాగరాయసెట్టిగారిచే
స్వకీయ
శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రకటింపఁబడినది.

1930 3-౦-౦.

# ప్రకటన.

ఇవి మొదలైన సంస్కృతాంధ్ర గ్రంథములు వలయు వారలు ఈదిగువ కనఁబఱచియుండు పైవిలాసదార్లకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఈ రెండవ భాగము. వెల.

| | |
|---|---|
| గ్లేజు కాలికోబైండు | రూ. 2—8—0 |
| రఫ్ కాలికోబైండు | రూ. 2—0—0 |

☞ పమ్మి - త్యాగరాయసెట్టి అండు సన్సు.

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ప్రెస్.

చాకలపేట—మద్రాస్.

# పీఠిక.

జాతకములయందలి శుభాశుభ ఫలములను తెలియుట కొఱకై ముఖ్యముగా గ్రహములయొక్క శుభత్వ పాపత్వములను స్థానాది షడ్బల సాధనములచేత స్పష్టముగా పరిశోధించి దానింబట్టి గ్రహము శుభుడో లేక పాపుడో, బలవంతుడో, లేక దుర్బలుడో యని ఏర్పఱచుకొని, అటుపిమ్మట ఆధిపత్య, స్థితి, సాహచర్య, వీక్షణాదులవల్ల గ్రహము శుభుడుగా నుండెనేని శుభఫలమును, పాపుడుగా నుండెనేని పాపఫలమును యూహించి చెప్పవలెయును. అట్లే మహాదశానాథుడున్నరాశిని లగ్నముగా భావించి యట్టి లగ్నమునకును, అంతర్దశానాథుడు మొదలగు భుక్తి నాథులకును గల పరస్పర మిత్రుత్వ శత్రుత్వములను గాక, ఇతరవిధములగు బలాబలములను సహితము యోచించి ఫలములను చెప్పిన సరిగానుండును. ఈప్రకారముగా ఫలములను తెలియుటకొఱకై ఫలసంబంధములగు అనేక జ్యోతిషగ్రంథముల యందలి ముఖ్యసారాంశములను క్రోడీకరించి ఈగ్రంథముయొక్క "మొదటిభాగము" నందు వివరముగా వ్రాయబడి యున్నది గదా!

అయితే ఆయాదశాదులవల్ల కలిగిన యనిష్టములకు శాస్త్రోక్త ప్రకారము యథావిధిగా శాంతులు చేయుటవల్ల ననిష్ట పరిహారమై జాతకుడు అభీష్టసిద్ధిని, సుఖమును, పొందును గావున ఈ "రెండవభాగము" నందు అట్టి శాంతివిధులను విశదముగను, సంపూర్ణముగను నవగ్రహములకును ప్రత్యేకముగా వ్రాయబడియున్నది. ఇటువంటిగ్రంథము తెనుగు భాషయందు లేనందున గ్రంథ ప్రచారకుల యొక్క ప్రేరణ చేత దీనిని ఆంధ్రీకరించి యున్నాను.

మఱియు స్థూలఫలములు మాత్రముగాక, అతి సూక్ష్మ ఫలములను కూడ కల్పించుట. కవకాశము కలుగుటకొఱకై అత్యావశ్యకమగు, దశ, అంతర్దశ, విదశ, సూక్ష్మదశ. ప్రాణ దశ మొదలగు 66, 429 విభాగములను చూపునట్టి నవగ్రహ దశావిభాగ పదకము కూడ ఇందుతో చేర్చబడినది. ఈపదక ము ప్రతి యొక్క జ్యోతిష్యునకును విశేషసహాకారిగానుండు ననుటకు సందేహము లేదు. గనుక ఈగ్రంథమునకు జ్యోతిషా భిమానులందరును తగు ప్రోత్సాహ మిత్తురని కోరెదు,

వెల్లాల. సీతారామయ్యా

గ్రంథకర్త.

ఇది రవ్యాది నవగ్రహముల యొక్క దశలు, అంతర్దశలు, విదశలు, సూక్ష్మదశలు, ప్రాణదశలు చూపెడి పదకము. ఇందు నవగ్రహములయొక్క దశలను అధ్యాయములుగను, అంతర్దశ, విదశ, సూక్ష్మదశలను, భాగములుగను వ్రాయబడి యున్నది. అదెట్లనిన:—సూర్యదశలో రాహుభుక్తియొక్క అంతర్దశలు మొదలగునవి. తెలియవలసిన యెడల, మొదటి అధ్యాయము, 4-వభాగము చూడవలెయును. కేతుదశయందలి అంతర్దశలు, విదశలు, సూక్ష్మదశలు, ప్రాణదశలు, కుజదశవలెనే తెలియుదగినది.

చంద్ర మహర్దశలో కుజాంతరములో రాహువిదశలో కుజ సూక్ష్మదశ రో 1 ఘ 50 వి 15-కి ప్రాణదశలు. తెలియవలసినచో రెండవ అధ్యాయము. 2-వభాగము 21 వ పదకము చూడవలెయును. ఇది అదేభాగము 4-వ పదకమువలెనే గ్రహించ దగినది.

శ్రీరస్తు.

# జాతకఫలచింతామణి.

## రెండవభాగము.

## విషయసూచిక.

విషయము. పుటసంఖ్య.

| విషయము. | పుట. |
|---|---|

| విషయము. | | | | పుట. |
|---|---|---|---|---|
| సూర్యదశలో | చంద్రభుక్తియందు గోదానము. | | | 53 |
| ,, | కుజ | ,, | అనడ్వాహదానము. | 56 |
| ,, | రాహు | ,, | మహిషీదానము. | 60 |
| ,, | గురు | ,, | స్వర్ణదానము. | 64 |
| ,, | శని | ,, | ఛాగదానము. | 67 |
| ,, | బుధ | ,, | రజితదానము. | 70 |
| ,, | కేతు | ,, | ఛాగదానము. | 72 |
| ,, | శుక్ర | ,, | శ్వేతధేనుదానము. | ,, |
| చంద్రదశలో | చంద్రప్రీతికర రజితవస్త్రదానము. | | | 73 |
| ,, | చంద్రభుక్తియందు శ్వేతగోదానము. | | | 75 |
| ,, | కుజ | ,, | నాగదానము. | 76 |
| ,, | రాహు | ,, | ఛాగదానము. | 80 |
| ,, | గురు | ,, | దుర్గాదానము. | 81 |
| ,, | శని | ,, | మహిషీదానము. | 84 |
| ,, | బుధ | ,, | లక్ష్మీనారాయణదానము. | 85 |
| ,, | కేతు | ,, | ఛాగదానము. | 88 |
| ,, | శుక్ర | ,, | మహిషీదానము. | ,, |
| ,, | సూర్య | ,, | దుర్గాదానము. | 89 |
| కుజదశలో | కుజప్రీతికరంబగు తాంబ్రవస్త్రదానము. | | | 90 |
| ,, | కుజ భుక్తియందు అనడ్వాహదానము. | | | 92 |
| ,, | రాహు | ,, | మహిషీదానము. కృష్ణధేనుదానము. } | 93 |
| ,, | గురు | ,, | స్వర్ణదానము, | 94 |

గ్రహారతూ విధిః.

దశ, అంతర్దశ, విదశ, సూక్ష్మదశ, ప్రాణదశ మొదలగు 66,429 విభాగములను చూపునట్టి నవగ్రహ దశా విభాగ పదకము. 1-వ-పేజీమొదలు 240 పేజీవరకు ముద్రింపంబడియున్నవి.

| | |
|---|---|
| కృష్ణవాస్తు. | 0-6-0 |
| మయవాస్తు. | 0-3-0 |
| జాతకాలంకారము. | 0-6-0 |
| గృహవాస్తు. | 0-2-0 |
| ఆర్తవచంద్రిక. | 0-5-0 |
| జలార్గళశాస్త్ర సంగ్రహము. | 0-3-0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము. | 0-5-0 |
| ఛప్పన్నము ప్రశ్నశాస్త్రము. తా. | 0-6-0 |
| జ్యోతిషఫలబాలబోధామృతము. | 0-4-0 |
| ముహూర్త ప్రదర్శిని. | 1-0-0 |
| ప్రశ్నదర్శిని అను ఆరూఢ ప్రశ్నశాస్త్రము తాత్పర్యసహితం. | 0-6-0 |
| జాతకఫలచింతామణి ఆంధ్రతాత్పర్య సహితము.—ఇందు ఆయా దశలలో ఆయాభుక్తులకుతగినఫలములను దృష్టాంత పూర్వకముగ తేట తెనుగు మాటలతో ముద్రించినవి. కాలికోబైండు. | 2-0-0 |
| జాతకఫలచింతామణి, రెండవభాగము—ఇందు ఆయాగ్రహక్రూరములకు తగిన శాంతులు. శ్లోకతాత్పర్యసహితమున్ను, మరియు ఆయాదశలకు నవగ్రహములకు అంతర్దశలు, విదశలు, సూక్ష్మదశలు ప్రాణదశలు బహువిమర్శగా లెక్క వేయకనే గ్రంథమును చూచి చెప్పునట్లు ముద్రింపం బడియున్నవి. | 2-0-0 |
| దైవజ్ఞసంపూర్ణచంద్రిక. | 0-6-0 |
| సాముద్రికము, సటీక. | 0-2-0 |
| నవగ్రహప్రదర్శిని. | 0-2-0 |
| వాస్తుదర్పణము—వాస్తుదీపిక. | 0-8-0 |
| వాక్యప్రశ్నసారము. | 0-3-0 |
| ముహూర్తచింతామణిజ్యోతిషగ్రంథము తాత్పర్యసహితము. | 1-4-0 |
| కాలామృతము. రవ్. 0-12-0 గ్లేజు. | 1-0-0 |
| కేరళప్రశ్న. | 0-1-6 |

ముహూర్తదర్పణము సాధారణప్రతి. 0-6-0

డిటో తిక్కు కాకితాలుగలది. 0-8-0

బృహజ్జాతకము సాధారణప్రతి. 1-8-0

డిటో గ్లేజు కాలికోబైండు. 2-0-0

గోచారదర్శిని ప్రథమభాగం. 1-0-0

ద్వితీయభాగము. 1-0-0

జినేంద్రమాల. తా॥ 0-10-0

ముహూర్తచంద్రిక. తా॥ 0-8-0

జాతకచంద్రిక. గోపాలరత్నాకరము. 0-2-0

ముహూర్తసంగ్రహం. 0-2-0

వాస్తుఫలసంగ్రహం. 0-1-0

జాతకభావరత్నాకరము తాత్పర్యము. 0-8-0

స్త్రీజాతకము తాత్పర్యము. 0-8-0 గ్లేసు కాలికోబైండు 0-12-0

రెట్టమతశాస్త్రము. తెనుగు తాత్పర్య సహితము. 0-12-0

దైవజ్ఞశిఖామణి అను జ్యోతిష గ్రంథరత్నము.— ఇది పరమేశ్వరునిచే పార్వతీదేవి కుపదేశింపబడినది. సకల జ్యోతిష విషయములు సులువుగా దెలుసుకొనందగిన గ్రంథము. శ్లో॥ తా. 1-8-0

జ్యోతిషామృతసారము. శ్లోకం తాత్పర్యము. 0-8-0

లఘుజాతకము జ్యోతిషము. 0-12-0

చమత్కారచింతామణి జ్యోతిషము. 0-8-0

జాతకపారిజాతము తాత్పర్యసహితము 2-0-0

సర్వార్థచింతామణి తాత్పర్యసహితము [illegible]-0-0

దశాభుక్తినిర్ణయము ,, 1-8-0

ఉత్తరకాలామృతము ,, 1-8-0

హోరావళి ,, 3-0-0

జ్యోతిషార్ణవ నవనీతము ,, 1-8-0 డిటో క్యాలికో 2-0-0

స్వప్నచింతామణి తాత్పర్యము. 0-6-0

పష్మి - త్యాగరాయసెట్టి అండు సన్సు. చాకలపేట. చెన్నపట్టణము.

| | |
|---|---|
| బాలరామాయణము. సటీక | 0-2-0 |
| డిటో మూలము, పెద్దచ్చు. | 0-1-0 |
| శ్రీమద్రామాయణము శ్లోక తాత్పర్యము 7 సంపుటములు. | 18-0-0 |
| శ్రీమహాభారతము. గద్యవ్యాఖ్యానము 3 సంపుటములు. | 30-0-0 |
| శ్రీమద్భాగవతము. శ్రీధరీయ వ్యాఖ్యానసహితము. | 10-0-0 |
| పద్మపురాణాంతర్గతమాఘపురాణము ఆంధ్రతాత్పర్యసహితం | 2-0-0 |
| శ్రీమద్రామాయణము మూలము. | 3-8-0 |
| ,, మేలుప్రతి, రెండువాల్యములు. | 6-0-0 |
| ,, సుందరకాండము, చిన్నసైజు. | 1-0-0 |
| ,, ఉత్తరకాండము, మేలుప్రతి. | 1-4-0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యాన చతుష్టయ విశిష్టము 2 సంపుటములు, చిన్నసైజున చక్కగ ముద్రింపఁబడినది. | 15-0-0 |
| అమావాస్యతర్పణము. | 0-1-0 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | 0-2-0 |
| ఋగ్వేదసంధ్యావందనము. సటీక చిన్నసైజు. | 0-2-0 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము సస్వరము. | 0-12-0 |
| ఉత్తరకాండము శ్లో॥ తా॥ | 2-8-0 |
| మంత్రపుష్పము, సటీక. | 0-1-0 |
| రుద్రం, నమకం, చమకం, సస్వరం చిన్నసైజు. | 0-2-0 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు. | 0-1-0 |
| టీకా, అమరము. | 0-14-0 |
| డిటో గ్లేసు కాలికోబైండు. | 1-12-0 |
| సుందరకాండము ఒకవైపు శ్లోకము రెండవవైపు తాత్పర్యము. గలది పారాయణగ్రంథము గ్లేజు ప్రతి. | 2-0-0 |
| డిటో రఫ్ ప్రతి. | 1-8-0 |
| కర్మవిపాకము తాత్పర్యము. | 1-0-0 |
| దత్తకమీమాంస దత్తకచంద్రిక. | 0-12-0 |

సుందరకాండము వాల్మీకీయము ప్రతిపద ఆంధ్రటీకాతాత్పర్య విశేషార్థ పారాయణఫల పారాయణక్రమాది సహితము సంపూర్ణ గ్రంథము. 5-0-0

శ్రీరుద్రాధ్యాయము.— ఇందు రుద్రము, నమకము, చమకము, అను రెండు పన్నములును, స్వరయుక్తము రుద్రము భాష్యాంధ్ర వివరణమను పేర టీకతో ముద్రింపఁబడినది. 1-4-0

ఆరుద్రవతములు. 0-3-0

వ్రతరత్నావళియను ౨౧ వ్రతకల్పము తెనుగు కథాసహితము. 0-8-0

దక్షిణామూర్తిస్తోత్రము. 0-4-0

పురాణోక్త కర్మప్రకాశిక. 1-4-0

పురాణోక్త అపరకర్మప్రకాశిక. 1-4-0

మత్స్యపురాణము 6-0-0

ఆగ్నేయపురాణం 6-0-0

సంధ్యా మంత్రార్థ బోధిని టీకా తాత్పర్యసహితము 0-4-0

యాజుషశ్రౌత స్మార్తానుక్రమణిక నాలుగు భాగములుగలది. 4-0-0

యాజుషా అపర ప్రయోగానుక్రమణిక సస్వరం ధర్మశాస్త్రం. 2-0-0

నిర్ణయసింధువు. 2-0-0

యాజుషస్మార్త మంత్రపాఠము, సస్వరము, ప్రథమభాగము. 3-0-0

యాజుషస్మార్త మంత్రపాఠము, సస్వరము, ద్వితీయభాగము. 1-8-0

శూద్రకమలాకరస్మృతి పూర్వప్రయోగము. 1-4-0

యల్లాజీయము, తాత్పర్యము. 2-0-0

డిటో మూలము. 1-0-0

తులసీప్రతిష్ఠ 0-2-0

స్వరశాస్త్రము సూర్యచంద్రనాడీఫలములను దెలుపును 1-8-0

అప్పకవీయం శుద్ధప్రతి గ్లేజుకాగితములు, కాలికోబైండు. 1-8-0

డిటో రఫు అట్టబైండు. 0-14-0

ఆంధ్రనిఘంటుత్రయము. 0-12-0



శ్రీ ర స్తు.

శ్రీ మహాగణపతయే నమః.

# జాతకఫలచింతామణి

ఆంధ్ర తాత్పర్య సహితము.

నానావిధమారక దశాంతర్దశా నిర్ణయోనామ

ఏకాదశ ప్రకరణ ప్రారభ్యతే.

శ్లో॥ కృష్ణం పరమకళ్యాణం సచ్చిదానంద విగ్రహం ।
ధ్యాయేత్తం రుక్మిణీనాథం సత్యయా సహితంహరిం॥ 1

తా. రుక్మిణీపతియును, సత్యభామాసమేతుడును, పాపరహితుడును, సచ్చిదానంద స్వరూపుడును, పరమ మంగళుడును యగు శ్రీకృష్ణపరమాత్ముని ధ్యానించవలయును.

శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి దశాంతర్భుక్తి భేదతః ।
మరణందృష్టి యోగాభ్యాం ఖేటానాంమానుషేష్వహం॥

తా. అటుపిమ్మట దశాంతర్భుక్తి భేదములవల్లను, గ్రహములయొక్క దృష్టి యోగములవల్లను మనుష్యులకు సంభవించెడు మరణ కాలమును చెప్పుచున్నాడు.

జాతకచంద్రికాయాం.

శ్లో॥ అష్టమం హ్యాయుషస్థాన మష్టమాదష్టమంచతత్ ।
తయోరపి వ్యయస్థానం మారక స్థానముచ్యతే ।
తత్రాప్యాద్య వ్యయస్థానా దుత్తరం బలవత్తరం ।
తదీశతు స్తత్రగతాః పాపిన స్తేన సంయుతాః ।
తేషాందశా విపాకేషు సంభవే న్నిధనంనృణాం ।
తేషాచ సంభవేసాత్తు ద్వ్యయాధీశ దశాస్వపి ।
అలాభేపున రేతేషాం సంమంధేన వ్యయేశతుః ।
క్వచిచ్ఛుభానాంచ దశాస్వష్టమేశ దశాసుచ ।
కేవలానాంచ పాపానాం దశాను నిధనం క్వచిత్ ।
కల్పనీయం బుధైర్నౄణాం మారకా నామదర్శనే ।
మారకై స్సహానం మంధా న్నిహంతా పాపకృచ్ఛనిః ।
అతిక్రమ్యేతరాన్ సర్వాన్ భవత్యేవ నసంశయః॥ 3

తా. లగ్నమున కెనిమిదవయిల్లు, మూడవయిల్లు ఆయుస్థానములు, ఎనిమిదవయింటికి వ్యయస్థానమైనందున సప్తమము మారకస్థానము. అదే ప్రకారముగా మూడవయింటికి వ్యయస్థానమైనందున ద్వితీయరాశియు మారకస్థానము. సప్తమ మారకస్థానముకంటె ద్వితీయ మారకస్థానము బలవంతమైనది. ఆసప్తమ ద్వితీయాధిపతులకంటె సప్తమ ద్వితీయస్థానముల యందున్న గ్రహములును వారితోడ కలిసిన గ్రహములును మారకము చేయుటయందు బలమైన పాపాత్ములగుదురు. సప్తమ ద్వితీయ స్థానములయందున్న గ్రహములు. సప్తమ ద్వితీయాధిపతులతో సంబంధించిన గ్రహములు వారివారి దశాభుక్తులు వచ్చినపుడు మారకమునిత్తురు. వారు చేయని పక్షమందు సప్తమ ద్వితీయాధిపతుల దశాభుక్తులయం దీపాపగ్ర

హములు మనుష్యులకు మరణమునిత్తురు. ద్వితీయ సప్తమముల యందున్న గ్రహములు మనుష్యులకు మరణము సేయని పక్షము నందు తృతీయ అష్టమాధిపతులే మారకముచేయుదురు. పాప గ్రహముల దశలుగలసినపుడు మారకాధిపతుల దశలు రాకపో యినప్పటికిన్ని ఈ పాపగ్రహములు మనుష్యులకు మారకమును చేయుదురు. మారకగ్రహ సంబంధమువలన పాపగ్రహమైన శని మారకగ్రహముల నతిక్రమించి తానే మారకము చేయు చున్నాడు.

ఉడుదశాప్రదీపికాయాం.

శ్లో॥ మారకస్థానప దశానరాణాం మృత్యుదాభవేత్ ।
త్రిషడాయాధిప దశాతదా కష్టాంతరాన్స్మృతాః ।
రాహుకేతు ర్దశాకష్టా తథామాంద్యం శపస్యచ ।
విపత్ప్రత్యర తారేశ దశాదేహ వినాశనీ ।
వధభేశదశాకష్ట ఖరద్రేక్కాణపస్యచ ।
ఏతేఖగేంద్రామై దృష్ట్వా తేషా మంతర్దశానుచ ।
మారకేశాది పాపానాం దశాయాం నిధనంభవేత్ ।
అథవాంత్యత్రి మేణైవ మరణంసంభవేన్నృణాం ।
అష్టమేశదశాయాంచ సంస్థితోదయపస్యచ ।
పాభుక్తిర్మరణందద్యా దథవాషష్టపస్యచ ।
యద్భావేశారిష్ఫషష్ఠాయ నాథై ।
ర్యుక్తామృత్యుర్భ్రత్రుపా భ్యాంచతేషాం ।
అంతర్భుక్తిం మృత్యుదాం ప్రాహురార్యా ।
స్తత్కాలజ్ఞో వృత్రిమేణ థవాపి ।
షష్ఠాష్టమవ్యయేశానా మంతర్భావోమృతిప్రదః ।
పితృస్థానాధిప దశా మారకేశేనభుజ్యతే ।

అథవారాహుకేతుభ్యాం రిప్ఫషష్ఠాష్టమాధిపైః ।
భుక్తౌతస్యవిజానీయా న్మరణంనాత్రసంశయః ।
త్రిషడాయాధిపాఃపాపాః తైర్యుక్తాంచ మృతిందదుః ।
అంతర్భుక్తి దశాయాంచ వ్యుత్క్రమేణ తథాపివా ।
ఏవంనిశ్చిత్యమతిమా నాత్మనోపి మృతి స్తథా ।
బంధనంక్లేశరోగాదీన్ స్పష్టమాహుర్మనీషిణః॥ 4

తా. అష్టమాధిపతిదశ నరులకు మృత్యువుకలుగచేయును. ఆప్రకారముగనే తృతీయ షష్ఠలాభాదిపతుల దశలును అధిక దుఃఖకరములగు కష్టములనిచ్చును. రాహు కేతువులయొక్కయు, మాందీగ్రహముయొక్కయు దశలు కష్టములను కలుగచేయును. ద్వాదశాష్టమాధి పతులయొక్క దశలు దేహమును నశింపచేయును. అష్టమాధిపతియొక్క దశయందైనను షష్ఠ ద్రేక్కాణాధిపతియొక్క దశ యందైనను లేక అంతర్దశల యందైనను, మారకస్థానాధి పాపగ్రహముల దశలయందైనను మరణముకలుగును. అట్లు గానియెడల వ్యుత్క్రమముగా శుభగ్రహ దశలయందైనను మరణము కలుగును. అష్టమాధిపతియొక్క దశయందు లగ్నాధిపతియొక్క భుక్తియందైనను, షష్ఠాధిపతియొక్క భుక్తియందైనను మరణము కలుగును. ఏభావాధిపతి తృతీయ షష్ఠలాభ ద్వాదశాధిపతులచేత జూడబడునో యట్టివారియొక్క యంతర్దశలయందు మృత్యువు కలుగును. ఒకానొకప్పుడు వ్యుత్క్రమముగా కూడ జరుగును. రాహుకేతువులయొక్క దశయందు షష్ఠాష్టమ వ్యయాధిపతులయొక్క యంతర్దశయందు మరణముకలుగును. మారకాధిపతియొక్క దశయందును, వారియొక్క యంతర్దశలయందును, భ్రాతలకు మరణముకలుగును. అట్లు కానియెడల

భ్రాతృసమాన జనులకు మరణముకలుగును. పితృస్థానాధిపతి యొక్క దశ మారకాధిపతిచేత అనుభవింపబడెనేని మారకాధిపతియొక్క యంతర్దశయందు మారకము కలుగును. లేక రాహు కేతువులయొక్క దశయందు షష్ఠాష్టమ ద్వాదశాధిపతులయొక్క భుక్తియందు మరణముకలుగును. తృతీయ షష్ఠ లాభాధిపతులు పాపులు. గనుక వారిదశలయందైనను, భుక్తులయందైనను మరణముకలుగును. ఈప్రకారముగా నిశ్చయము చేసి భావములకును, బంధువులకును, జాతకునకును, బంధన, క్లేశ, దుఃఖాదిఫలములను మనుష్యులకు చెప్పతగినది.

కేరళియే.

శ్లో॥ లగ్నాధిప దశాకాలే క్రూరైర్దేహం హరేత్పునః।
దేహారోగో విత్తనాశో భవిష్యతి నసంశయః।
ధనాధిపదశాకాలే హరణం సూర్యజేయది।
తత్కాలేధననాశశ్చ భవిష్యతి నసంశయః।
భ్రాతృపస్యదశాకాలే హరణం భూమిజేయది।
తత్కాలేభ్రాతృనాశశ్చ బంధునాశోభవిష్యతి।
మాతృపస్యదశాకాలే కుజమందేచభాస్కరే।
తత్కాలేమరణంచేతి మాతృనాశోభవిష్యతి।
బుద్ధినాథదశాకాలే హరణం భాస్కరాత్మజే।
వాతపిత్తమనోదుఃఖ మర్థనాశోభవిష్యతి।
శత్రునాథదశాకాలే హరణం భూమిజేయది।
అత్యంతశత్రుబాధాచ విరోధశ్చభవిష్యతి।
కళత్రేశదశాకాలే భాస్కరేభూమిజేశనా।
హరణంవిదితంనిత్యం కళత్రంచవినశ్యతి।
మృత్యుపస్యదశాకాలే హరణం సూర్యజేయది।

తత్కాలేమరణంయస్య వరాహస్యేతిసమ్మతం ।
ధర్మస్వామిదశాకాలే క్రూరై ర్యదిహరత్యథా ।
ధర్మనాశో బంధునాశో హ్యాపఖ్యాతిర్భవిష్యతి ।
కర్మాధిపదశాకాలే హరణం సూర్యజేకుజే ।
కర్మనాశోవిత్తనాశ స్సిధ్యతేచ నసంశయః ।
లాభస్వామిదశాకాలే హరణంసూర్యజేయది ।
ఖామేశలాభనాశశ్చ కృష్యాదిశ్చవినశ్యతి ।
వ్యయాధిపదశాకాలే కుజేమందేచభాస్కరే ।
హరణంవిదితంనిత్యం సర్వద్రవ్యంవినశ్యతి ॥ 5

తా. కేరలీయమతమునందు ఈప్రకారముగా చెప్పబడి యున్నది. లగ్నాధిపతియొక్క దశయందు క్రూరగ్రహములవల్ల మృత్యువు సంభవించును. దేహమందు రోగబాధయు, ధన నాశంబును, నిశ్చయముగా కలుగును. ద్వితీయాధిపతియొక్క దశయందు సూర్యునివల్ల మృత్యువు కలుగును. ఆకాలమందు ధననాశము నిశ్చయగా కలుగును. తృతీయాధిపతియొక్క దశ యందు కుజునిమూలకముగా మారకముకలుగును. ఆకాలమం దు భ్రాతృనాశనంబును, బంధునాశనంబును కలుగును. చతు ర్థాధిపతియొక్క దశాకాలమందు కుజ శని సూర్యులవల్ల మృ త్యువు సంభవించును. ఆకాలమందు మాతృనాశనము కలు గును. పంచమాధిపతియొక్క దశయందు శనిమూలకముగా మరణము కలుగును. వాతపిత్తరోగమును, మనోదుఃఖంబును, అర్థనాశంబును, సంభవించును. షష్ఠాధిపతియొక్క దశాకాల మందు కుజునివల్ల మరణముకలుగును. అత్యంత శత్రుబాధ యు, విరోధమునుసిద్ధించును. సప్తమాధిపతియొక్క దశాకాల మందు రవికుజ శనులవల్ల మరణము నిశ్చయముగా చెప్పదగి

నది. గాకను కళత్రనాశనముకూడ సిద్ధించును. అష్టమాధిపతియొక్క దశాకాలమందు సూర్యునివల్ల మరణము కలుగును. ఆకాలమందు మరణము నిశ్చయమని వరాహానమ్మతము. నవమాధిపతియొక్క దశాకాలమందు క్రూరగ్రహములవల్ల మరణము సంభవించును. ధర్మనాశమును, బంధునాశమును, అపఖ్యాతియును కలుగును. దశమాధిపతియొక్క దశాకాలమందు రవికుజులవల్ల మరణము సిద్ధించును. కర్మనాశమును, విత్తనాశమును, నిస్సంశయముగా సిద్ధించును. లాభాధిపతియొక్క దశాకాలమందు సూర్యునివల్ల మరణము సిద్ధించును. కుజునివల్ల లాభనాశమును, కృష్యాదినాశనమును కలుగును. ద్వాదశాధిపతియొక్క దశాకాలమందు కుజశని సూర్యులవల్ల మృత్యువు కలుగును. సర్వద్రవ్యమును నాశనము చెందును.

కేరళతంత్రే.

శ్లో॥ సప్తాష్టమగతాః ఖేటాః శత్రుస్థానస్థితా యది ।
అస్తనీచగతేష్వాపి స్వదశాను మృతిర్భవేత్ ।
షష్ఠమాధిపతౌనీచే రంధ్రపోయదివీక్షితే ।
తత్పాకే మృత్యుమాప్నోతి భవత్యేవ నసంశయః ।
లగ్నాధిపో రంధ్రప సంయుతశ్చే ।
తృతీయ రంధ్రాధిప భావపానాం ।
ద్విసప్తమైకాదశ భావపానాం ।
పాకే మృతింసిద్ధి ముపైతిజాతః ।
లాభాధీశయుతోవాపి వీక్షితోవాపికామపః ।
తత్పాకే మృత్యుమాప్నోతి రంధ్రపేనయుతోపివా ।
ధనాధిపోరంధ్ర గతోంంధ్ర లాభేనవీక్షితః ।
కామపస్తుతథైవస్యాన్మృత్యుమాప్నోత్యసంశయః॥

తా. సప్తాష్టమ రాసులనుపొందిన గ్రహములును, శత్రు స్థానములయందున్న గ్రహములును, అస్తంగతగ్రహములును, నీచరాశిని పొందియున్న గ్రహములును తమతమ దశలయందు మారకమును కలిగించును. షష్ఠమాధిపతి నీచరాశియందున్నను, అష్టమస్థానమును పొందియున్నను లేక ఆరాశ్యాధిపతుల చేత వీక్షింపబడినను, ఆదశయందు నిస్సంశయముగా మృత్యువు సంభవించును. లగ్నాధిపతి అష్టమాధిపతితోగూడి తృతీయాష్టమములయందుగాని, ద్వితీయ సప్తమ భావములయందుగాని యున్నయెడల ఆదశయందు మృత్యువు సిద్ధించును. సప్తమాధిపతి అష్టమాధిపతితో కలిసి లాభాధిపతితో కూడియున్నను లేక చూడబడినను, ఆదశయందు మరణముకలుగును. ద్వితీయాధిపతి అష్టమస్థానమును పొందియున్నను లేక అష్టమలాభాధిపతులచేత చూడబడినను, అదేప్రకారముగా సప్తమాధి యొక్క కూడికగాని వీక్షణగాని కలిగియున్నను నిశ్చయముగా మృత్యువు సంభవించును.

సారావళ్యాం.

శ్లో॥ లగ్నేవిత్తేశకర్మేశ రంధ్రేశానాం శనైరపి ।
యోవాబలవిహీనస్య తద్దశాయాం మృతింవదేత్ ।
జాయానేత్ర పయోదశానునిధనం తత్రస్థితానాంతదా ।
క్రూరాణామధరిప్పపస్యచ యదితత్రేట సంమంధినః ।
రంధ్రేశస్సహజఃక్వచిచ్ఛ భయుతోషష్ఠాధిపోమారకః।
షోచ్చేమూలత్రికోణసంస్థిత శుభాఃగ్లాభానుభేటావినా ।
మహాపాపగ్రహాణాంచ దాయేమృత్యు శనైరపి ।
పాపీమారకసంమంధః ఇతరోనస్వమారకః ।
స్వదాయేమారకోయస్య సంబంధేశుభభుక్తిషు ।

నిహంతాసంయుతేపాప భుక్తేషుమరణంధ్రువం ।
బలాన్వితారంధ్ర వ్యయాధిపాశ్చే ।
ద్దశానుమృత్యు ర్బలహీనవంతః ।
దారిద్ర్యదుఃఖం తనుపీడ్యరోగాః ।
స్థానచ్యుతిం రాజకుటుంబపీడా ।
లగ్నేశేయత్రకుత్రాః అష్టమాదష్టమాధిపే ।
తదాయేజన్మమారభ్య జీవితందుర్లభంభవేత్ ।
మదనధనగృహపయో ర్మారకత్వంతువాచ్యం ।
క్వచిదపినహజేశః రంధ్రలాభాధిపౌచ ।
భవతిచనిధన స్థస్త ద్దశాయాం మృతిస్యాత్ర ।
దధిపయుతఖేటీశ్చే దవస్యంమృతిస్యాత్ ॥ 7

తా. లగ్నమందు ద్వితీయ, దశమ, అష్టమాధిపతులతో శని కలిసియుండగా వారిలో బలహీనులైన వారియొక్క దశయందు మృత్యువు కలుగును. ద్వితీయ సప్తమాధిపతుల యొక్క దశలయందును ఆస్థానములయందున్న గ్రహముల యొక్క దశలయందును మారకము నిశ్చయముగా సంభవించును. క్రూరులైన సప్తమాష్టమాధిపతులును వారితో సంబంధించిన వారును మారకము కలుగచేయుదురు. తృతీయాష్టమాధిపతులు కొంచెము శుభవీక్షణ కలిగియున్నయెడల వష్ఠాధిపతి మారకుడగును. స్వోచ్చ, మూలత్రికోణములయందున్న శుభగ్రహములును, చంద్రసూర్యులును వినహా యితరమహా పాపగ్రహంబుల దశయందు వారు శనితోకూడియున్న యెడల మారకము చేయుదురు. మారకసంబంధముగల ఇతర పాపులు తామే స్వతంత్రముగా మారకముచేయరు. తమ దశయందు మారక సంబంధముగల శుభభుక్తులయందు చంపరు. పాప

భుక్తులయందు మరణము నిశ్చయము. అష్టమ వ్యయాధిపతుల లో బలాఢ్యునియొక్క దశయందు మారకము కలుగును. బల హీనుని దశయందు దారిద్ర్యదుఃఖంబును, దేహపీడయు, రోగ బాధయు, స్థాన భ్రంశమును, రాజకుటుంబపీడయు కలుగును. లగ్నాధిపతి యున్నరాశికి అష్టమస్థానమునకు అష్టమంబైన తృతీయాధిపతి దశయందు జన్మమారభ్యం దుర్భరజీవితుడగు ను. ద్వితీయ సప్తమాధిపతుల దశయందు మారకము నిశ్చయ ము. ఒకవేళ తృతీయ, అష్టమ, లాభాధిపతులుచేరి అష్టమ స్థానమును పొందియున్నయెడల ఆదశలయందు మారకము కలుగును. ఈ యధిపతులతోచేరిన గ్రహములు అవశ్యముగా మారకము కలుగచేయుదురు.

జాతకరాజీయే

లగ్నాది మారకనిర్ణయః.

శ్లో॥ మేషేలగ్నే ప్రజాతస్య బుధమందౌచమారకౌ ।
శుక్రస్సాక్షాన్నహంతాస్యా దితి కేరళనిర్ణయః ।
వృషేలగ్నే ప్రజాతస్య విధుజీవసితాఃఖలాః ।
తేమారకేతివిజ్ఞేయాః జ్యోతిశ్శాస్త్రబుధోత్తమైః ।
యుగ్మేలగ్నే ప్రజాతస్య రవిచంద్రకుజాఃఖలాః ।
తేగ్రహాఃమారకాధిక్యాః శనిసాక్షాన్నమారకః ।
కర్కిలగ్నే ప్రజాతస్య మందసౌమ్యసితాఃఖలాః ।
రవిస్సాక్షాన్నహంతాస్యా త్తేఖలాః మారకాస్తథా ।
సింహాలగ్నే ప్రజాతస్య శనిశుక్రౌచమారకౌ ।
బుధస్సాక్షాన్నహంతాస్యా దితి కేరళనిర్ణయః ।
కన్యాలగ్నే ప్రజాతస్య గురుచంద్రకుజాఃఖలాః ।
తేగ్రహాఃమారకాధిక్యా శుక్రస్సాక్షాన్నమారకః ।

తౌళిలగ్నే ప్రజాతస్య భానుజీవౌచమారకౌ ।
కుజస్సాక్షాన్నహంతాస్యా దితి కేరళనిశ్చయః ।
కీటలగ్నే ప్రజాతస్య విట్సూర్యసుతభార్గవాః ।
తేమారకేతివిజ్ఞేయాః జ్యోతిశ్శాస్త్రబుధోత్తమైః ।
చాపలగ్నే ప్రజాతస్య చంద్రశుక్రౌచమారకౌ ।
శనిస్సాక్షాన్నహంతస్యా దితి కేరళనిర్ణయః ।
మృగేలగ్నే ప్రజాతస్య కుజజీవనిశాకరాః ।
తేమారకేతివిజ్ఞేయాః జ్యోతిశ్శాస్త్రబుధోత్తమైః ।
కుంభలగ్నే ప్రజాతస్య కుజచంద్రౌచమారకౌ ।
గురుస్సాక్షాన్నహంతాస్యా దితి కేరళనిశ్చయః ।
మీనలగ్నే ప్రజాతస్య విట్ఛుక్రశనిభానవః ॥
తేమారకేతివిజ్ఞేయాః జ్యోతిశ్శాస్త్రబుధోత్తమైః ॥ ౪

తా. మేషలగ్న జాతకునకు బుధశనులు మారకులు. శుక్రుడు ప్రత్యక్ష మారకుడుగాడు. ఇది కేరళనిశ్చయము. వృషభలగ్న జనితునకు చంద్ర గురు శుక్రులు మారకులని జ్యోతిశ్శాస్త్ర పండితులచే నిశ్చయింపబడియున్నది. మిథున లగ్నమునందు బుట్టినవానికి రవిచంద్రకుజులు మారకులు శని మారకలక్షణములతో గూడియున్నను ప్రత్యక్షముగా మారకముచేయడు. కర్కాటక లగ్నమందు పుట్టినవారికి బుధ శని శుక్రులు మారకులు. మారకాధిపత్యము కలిగియున్నను సూర్యుడు ప్రత్యక్షముగా మారకముచేయడు. సింహాలగ్న జాతకునకు శనిశుక్రులు మారకులు. మారకలక్షణములతో గూడిన బుధుడు ప్రత్యక్షముగా మారకము చేయడని కేరళమతము. కన్యాలగ్నమునందు బుట్టినవానికి గురుచంద్రకుజులు మారకులగుదురు. మారకాధిపత్యము గల శుక్రుడు ప్రత్యక్షముగా

మారకము చేయడు. తులాలగ్నమందు జనించినవానికి రవి గురులు మారకులు. కుజుడు ప్రత్యక్షముగా మారకము కలుగ చేయుటలేదని కేరళనిశ్చయము. వృశ్చికలగ్నమందు జనించిన పురుషునకు బుధశనిశుక్రులు మారకులగుదురని జ్యోతిశ్శాస్త్ర పండితులచేత చెప్పబడియున్నది. ధనుర్లగ్నమందు జనించిన వానికి చంద్రశుక్రులు మారకులు. మారకాధిపత్యముతో కూడియున్న శని ప్రత్యక్షముగా చంపజాలడని కేరళమునిచే నిశ్చయింపబడియున్నది. మకరలగ్న జనితునకు చంద్రకుజగురువులు మారకులగుదురని జ్యోతిశ్శాస్త్ర విశారదులచేత నిశ్చయింపబడియున్నది. కుంభలగ్న జాతకునకు కుజ చంద్రులు మారకులు. అయితే గురువు ప్రత్యక్షముగా మారకము చేయజాలడని కేరళనిర్ణయము. మీనలగ్నమునందు జనించిన జాతకునకు రవి, బుధ, శుక్ర, శనులు మారకులని జ్యోతిశ్శాస్త్ర పండితులచేత చెప్పబడియున్నది.

ఉడుదశా ప్రదీపికాయాం విశేషేణోక్తం.

యథా.

శ్లో॥ విలగ్ననాథస్థ నవాంశనాథో
రంధ్రాధిపస్థాంశ పతిశ్చయుక్తౌ ।
మేషేచషడ్వర్గ గతౌయదాతౌ
భుక్తౌతయోర్జంబుక భీతిరాహుః ।
తస్మిన్నోవర్గగాతౌ చేచ్ఛునోద్భీతిం వదేన్నృణాం ॥ 9

తా. లగ్నాధిపతియున్న అంశనాథుడును, అష్టమాధిపతియున్న నవాంశాధిపతియును, ఒక్కటిగాచేరి మేషరాశియందు స్వవర్గమునుపొంది యుండిరేని ఆగ్రహములయొక్క భుక్తులు వచ్చినపుడు నక్కలు, మేకలు మొదలగు జంతువుల

వలన భయముకలుగును. వృషభవర్గమును పొందిరేని గోవులు మొదలగు వానివలన భయముకలుగును.

శ్లో॥ యుగ్మవర్గగతౌభీతిః కపిభ్యోనాత్రసంశయః ।
కుళీరవర్గగాతౌ చే ద్భీతిస్యాద్రా సభాద్ధ్రువం । 10

తా. లగ్నాధిపతియున్న నవాంశాధిపతియును, అష్టమాధిపతియున్న నవాంశాధిపతియును, కలిసి మిధునరాసియందున్న యెడల కోతులుమొదలగు వానివల్ల భయముకలుగును. అదేప్రకారముగా కర్కాటకరాశియందు చేరియున్నయెడల గాడిదెలు మొదలగు వానివలన భయముకలుగును.

శ్లో॥ సింహవర్గగతౌతౌ చేత్ సింహవ్యాఘ్రాదిజంభయం ।
కన్యావర్గగతౌతౌ చేత్ భల్లూకాదికృతంభయం॥ 11

తా. లగ్నాధిపతియున్న నవాంశాధిపతియును, అష్టమాధిపతియున్న నవాంశాదిపతియునుకలిసి సింహషడ్వర్గమును పొందిరేని సింహము, పెద్దపులి మొదలగు జంతువులవలన భీతి కలుగును. కన్యాషడ్వర్గమయ్యేనేని భల్లూకాది జంతువుల మూలకముగా భయము కలుగును.

శ్లో॥ వణిగ్వర్గగతౌస్యాతాం తయోర్భుక్తౌగజాద్భయం ।
అళివర్గగతౌతౌ చేత్ కీటసారంగజంభయం॥ 12

తా. తులాషడ్వర్గమును బొందిరేని వారియొక్క భుక్తియందు ఏనుగులు మొదలగు వానివలన భయముకలుగును. వృశ్చికషడ్వర్గమును బొందినయెడల కీటకములు, జింకలు మొదలగు వాటివలన భయముకలుగును.

శ్లో॥ ఏతౌ కార్ముకవర్గస్థౌ భుక్తౌస్యాదశ్వజంభయం ।
మృగవర్గతౌ ద్వౌచే ద్భుక్తౌసూకరతో భయం॥ 13

తా. వీరిరువురును ధనుస్సుయొక్క షడ్వర్గమును బొందిరేని గుఱ్ఱములు మొదలగు వానివలన భయముకలుగును. మృగవర్గమును పొందిరేని అడవిపంది మొదలగు వానివలన భయము కలుగును.

శ్లో॥ కుంభవర్గగతౌభుక్తౌ లాంగూలం ద్భయతోవదేత్ ।
మీనవర్గ స్తయోర్భుక్తౌ మేషస్యాద్భావాజంభయం॥ 14

తా. కుంభవర్గమును పొందిన వారలయొక్క భుక్తియందు గోలాంగూలాదులవలన భయము కలుగును. మీనవర్గమును పొందినయెడల జలజంతువుల మూలకముగా భయము కలుగును.

శ్లో॥ ఏవంలగ్నాదిభావానాం షడ్వర్గగతిభిఃఫలం ।
సమగ్విచార్యమతిమాౝ ప్రవదేత్కాలవి త్తమైః ॥ 15

తా. కాలమును చక్కగా నెరిగిన జ్యోతిర్విశారదుడీ ప్రకారముగా లగ్నాది ద్వాదశ భావములయొక్కయు, షడ్వర్గములను బొందిన గ్రహములచేత ఫలములను చక్కగా విచారించి చెప్పవలయును.

శ్లో॥ లగ్నేశ్వరోరంధ్ర పతిశ్చయుక్తౌ ।
వృషేవృషాంశే వృషభేద్రుగాణే ।
స్థితౌభవేతా యదిగోవృషేణ ।
బాధాతయోర్వా మరణంగభుక్తౌ॥ 16

తా. లగ్నాష్టమాధిపతులు వృషభమునందైనను, వృషభాంశయందైనను, వృషభ ద్రేక్కాణమునందైనను, యుండినట్టులైన యెడల గోవులు, వృషభములు మొదలగు వాటివలన బాధయైనను, మరణమైనను కలుగును.

శ్లో॥ వృషేయుగ్మాంశగౌతౌచే ద్భల్లూకేన మృతింనృణాం ।
వృషకర్కాట్యంశగౌతౌచే న్నక్రాదిభిర్జలేమృతిః॥ 17

తా. లగ్నాష్టమాదిపతులు కలిసి వృషభ మిథునముల యంశలనుబొంది యుండిరేని భల్లూకములవల్ల నరులకు మృత్యువు సంభవించును. వృషభ, కర్కాటకాంశలను పొంది యుండిరేని మొసళ్లు మొదలగు జలజంతువులవల్ల మరణము కలుగును.

శ్లో॥ వృషసింహాంసగౌతౌచే ద్వ్యాఘ్రాద్యైర్మృతిప్రదః।
వృషకన్యాంశగౌతౌచే త్కరిభిఃనాత్రసంశయః ॥ 18

తా. లగ్నాష్టమాదిపతులు కలిసి వృషభమందు సింహాంసగతినిపొంది యున్నయెడల వ్యాఘ్రభయమును కన్యాంశనుపొంది యున్నయెడల కరిడిమొదలగు వానివలన మృత్యువు సంభవించును.

శ్లో॥ వృషేతులాంశగౌతౌచే దంష్ట్రిభిర్మృతిమవాప్నుయాత్ ।
వృషేకౌర్పాశ్యంశగౌతౌచే ద్భక్తౌస్యాదాఖునాభయం॥

తా. లగ్నాష్టమాదిపతులు వృషభాంశ తులాంశలను పొందినయెడల పల్లుకాటువలన మరణము కలుగును. వృషభాంశ వృశ్చికాంశలనుపొంది యున్నయెడల కీటకాదులవలన మరణము కలుగును.

శ్లో॥ వృషేచాపాంశగౌతౌచే దశ్వాద్యైఃపరమాపదః ।
వృషేమృగాంశగౌతౌచే ద్గోలాంగూలైర్మృతింవదేత్॥

తా. లగ్నాష్టమాదిపతులు వృశభాంశ ధనురంశలను బొందిరేని శకటగండము సంభవించును. వృషభ మకరాంశలయందున్న యెడల తోకజాతి మృగములవల్ల భయము సంభవించును.

శ్లో॥ వృషకుంభాంశగౌ తౌ చేత్ వ్యాళాంశేఘటసర్పతః ।
వృషమీనాంశగౌ తౌ చే త్తయోర్భుక్తౌమృగాద్భయం ।
వృషే మేషాంశగౌ తౌ చే త్తయోర్భుక్తౌమృగాద్భయం॥21

తా. వృషభాంశ కుంభాంశలను పొందిరేని సర్పములు మొదలగు వానివలన మరణము కల్గును. వృషభాంశ మీనాంశలను బొందిరేని మృగములవల్ల భయము కలుగును. మేషాంశను పొందినయెడల పొట్టేలువల్ల మరణముకలుగును.

శ్లో॥ ఏవంనిశ్చిత్యమతిమాన్ భ్రాత్రాదీనాంమృతింవదేత్ ।
శరీరనాథో మదనాదిపేనయుక్తో ।
మృగేంద్రేతు మృగాదిపాంశే ।
తయోర్విపా కేతు భయంశూనో ।
మృతిర్భవేత్తదా ప్రాహురుదాచిత్తాః ॥ 22

తా. ఈ ప్రకారముగానే భ్రాత్రాదిభావములకును ఫలమునువిచారించి చెప్పవలయును. లగ్నాదిపతి అష్టమాదిపతితో చేరి సింహమునందైనను సింహాంశయందైనను యుండెరేని వారి భుక్తియందు భయమును, కుక్కలు మొదలగు వానివలన మరణమును సంభవించునని జ్యోతిశ్శాస్త్ర వేత్తలచేత చెప్పబడియున్నది.

శ్లో॥ సింహేకన్యాంశగౌ తౌ చే త్కరిభిఃపాపకైర్మృతిః ।
సింహరాశౌ తులాంశస్థౌ తయోర్భుక్తౌమృతిర్గజాత్ ।
అళ్యంశగౌ మృగేంద్రేతౌ తయోర్దాయేసరీసృపాత్ ।
చాపాంశగౌసింహభేతు తయోశ్వానోమృతిస్త్రియాః ।
మృగాంశగౌ తౌసింహస్థౌ తయోర్దాయేశునామృతిః ।
సింహేకుంభాంశగౌ తౌ చే న్నక్రాద్యైశ్చజలైర్మృతిః ।
మీనేసింహాంశగౌ తౌ చే త్తయోర్భుక్తౌసరీసృపాః॥ 23

తా. లగ్నాష్టమాధిపతులు సింహకన్యాంశలను పొందిరేని కరిడి మొదలగు దుష్టజంతువులవల్ల మారణము కలుగును. సింహరాశియందు తులాంశను పొంది యున్నయెడల ఆభుక్తుల యందు ఏనుగులవల్ల మృత్యువు కలుగును. ఆసింహరాశియందే వృశ్చికాంశయందున్న యెడల ఆదశయందు సర్పము మొదలగు ప్రాకెడు జంతువులవల్ల మరణము కలుగును సింహరాశి యందు ధనురాంశను పొంది యున్నయెడల శుసకములవల్ల మరణముకలుగును. సింహరాశియందు మకరరాశ్యంశమును పొందిరేని వారియొక్క భుక్తియందు గాడిదమొదలగు జంతువులవలన భయముకలుగును. సింహరాశియందు కుంభాంశమునుపొంది యున్నయెడల అడవిపంది మొదలగు దుష్టజంతువులవల్ల మరణము సంభవించును. అదేప్రకారముగా సింహరాశిలో మీనాంశ యందున్న యెడల పక్షులు సర్పములు మొదలగు వానివలన భయము కలుగును.

శ్లో॥ మేషేసింహాంసగాతౌచే త్తయోర్భుక్తౌశునామృతిః ।
సింహేవృషాంశగాతౌచే న్మహిషేణమృతింతయోః ।
యుగ్మాంశగాతౌసింహేతు గోలాంగూలాద్భయంవదేత్ ।
కర్క్యంశగాతౌసింహేచ వ్యాఘ్రక్రోష్టాన్మృతింవదేత్ ।
ఏవంభ్రాత్రాదిభావానాం తత్తద్భుక్తిఫలంవదేత్ ॥ 24

తా. లగ్నాష్టమాధిపతులు కలిసి సింహమునందైనను మేషాంశయందైనను యుండిరేని నక్కలు మొదలగు వానివలన భయము కలుగును. సింహమునందైనను వృషభాంశయందైనను యున్నయెడల గేదెలు మొదలగు జంతువులవల్ల భయము కలుగును, సింహమునందైనను, మిథునాంశయందైనను యున్నయెడల పశుగండమును, కర్కాటకవర్గమందున్న

యెడల పులులవల్ల మరణము కలుగును. ఈప్రకారముగానే భ్రాత్రాదిభావములకును ఫలమును విచారించి చెప్పవలయును.

శ్లో॥ దేహాధిపో మృత్యుప సంయుతశ్చే ।
చ్చాపాంశగా కార్ముక రాశిగా చేత్ ।
దాతయోర్వాజి కృతేన మృత్యుం ।
వదంతి తత్కాల విదో మహాంతః॥ 25

తా. పై చెప్పిన ప్రకారముగా అష్టమాధిపతి, మారక గ్రహము వీరిరువురు ఏభావమునందు ఏభావాదిపతితో ఏరాశి యందు ఏవర్గమునందు చేరియున్నయెడల దానికి తగినరీతిగా జాతకునియొక్క ఆయాభావములకు ఆయాభుక్తులయందు నాశము కలుగునని చెప్పదగినది. ఇందుకు.

ఉదాహరణము.—లగ్నాధిపతి అష్టమాధిపతితో గూడి కార్ముకరాశినిగాని ధనురంశనుగాని పొందినయెడల వారిభుక్తుల యందు గణమైన విధివలన మరణము కలుగును.

శ్లో॥ చాపేమృగాంశగౌచే త్సారంగభయం మేతయోః ।
హయేకుంభాంశగౌచే ద్వరాహాభయమేతయోః॥ 26

తా. వారిరువురునుకలిసి ధనుర్లగ్నమందు మకరాంశను పొందినయెడల సారంగములవల్ల భయము కలుగును. అదే ప్రకారముగా కుంభాంశను పొందిన యెడల పందులవల్ల మృత్యువు సంభవించును.

శ్లో॥ హయేమీనాంశగౌచే త్స్వకేనక్రాద్భయంవదేత్ ।
మేషాంశగౌచాపే తు తయోర్గ్రామేశునామృతిః॥ 27

తా. లగ్నాష్టమాధిపతులు గలిసి ధనుస్సునందు మీనాంశను పొందినయెడల మొసళ్లుమొదలగు జలచరజంతువుల

మూలకముగా మృత్యువు సంభవించును. మేషాంశయైన యెడల తోకజాతి మృగములవల్ల భయము కలుగును.

శ్లో॥ హయేవృషాంశగౌతౌచే త్రాసభాద్భయమేతయోః।
కన్యాంశగౌహయాం శేతౌ ఆఖునాద్భయమేతయోః॥ 28

తా. ధనుస్సునందు వృషభాంశనుపొంది యున్నయెడల గాడిదెలవల్ల భయము కలుగును. కన్యాంశనుపొంది యున్న యెడల పందికొక్కులవల్ల భయము కలుగును.

శ్లో॥ సింహాంసగౌ హయాం శేతౌ
జంబూకా ద్భీతిరేతయోః।
కన్యాంశేవా హయాంశేతౌ
లాంగూలా న్మృతిరేతయోః॥ 29
తులాంశగౌ హయాం శేతౌ
దంష్ట్రిద్వా మరణంతయోః।
ఆళ్యంత గౌహయాం శేతౌ
తయోర్మృత్యు స్సరీసృపాత్॥ 30
భ్రాత్రాదీనాంతునిశ్చిత్య ఫలమాహుర్మనీషిణః॥

తా. ధనుస్సునందు సింహాంశనుపొంది యున్నయెడల నక్కలవల్ల భీతికలుగును. కన్యాంశను పొంది యున్నయెడల తోకలుగల జంతువుల మూలకముగా భయము కలుగును. తులాంశనుపొంది యున్నయెడల పండ్లతో కరవబడుటచేత మృత్యువు సంభవించును. వృశ్చికాంశనుపొంది యున్నయెడల సర్పములు మొదలగువానివల్ల భయముకలుగును. ఈప్రకారముగా భ్రాత్రాదులయొక్క ఫలములనుకూడ ఊహించి చెప్పదగినది.

శ్లో॥ విలగ్నపోనై ధననాయకశ్చ
మృగేమృగస్యాంశ గతేవయుక్తౌ ।
భుక్తౌతయోః పుత్రకృతానరాణాం
వినాశహేతుః ప్రవదంతిసంతః ॥
కుంభాంశగౌమృగస్యైతౌ భల్లూకాద్భయమేతయోః ।
యుగ్మాంశగౌమృగస్యైతౌ జలసర్పాద్భయంతయోః ।
అజాంశగౌమృగస్యైతౌ తయోర్భుక్తౌశునోమృతిః ।
వృషాంశగౌమృగస్యైతౌ సారంగాద్భయమేతయోః ।
యుగ్మాంశగౌమృగస్యైతౌ కీటకాద్భీతిరేతయోః ।
కర్కాంశగౌమృగస్యైతౌ గోలాంగూలాన్మృతిస్తయోః ।
సింహాంశగౌమృగస్యైతౌవ్యాఘ్రదంష్ట్రాన్మృతిస్తయోః।
కన్యాంశగౌమృగస్యైతౌ వృద్ధకేవాద్భయంమృతిః ।
తులాంశగౌమృగస్యైతౌ తయోర్దాయేమృతీర్గజాత్ ।
కౌర్పృంశగౌమృగస్యైతౌ నకులాద్భీతిరేతయోః ।
చాపాంశగౌమృగస్యైతౌ మార్జాలాన్మృతిరేతయోః ।
ఏవంనిశ్చిత్యమతిమాణ్ భ్రాత్రాదీనాంఫలంవదేత్॥ 31

తా. లగ్నాష్టమాధిపతులు కలిసి మకరమందు మక రాంశనుపొంది యున్నయెడల వారిభుక్తియందు వినాశనము నకు కారణము కలుగును. అదేప్రకారముగా వారిరువురును మకరమందు కుంభాంశనుపొంది యున్నయెడల భల్లూకాది మృగములవల్ల భయముకలుగును. మీనాంశయందున్నయెడల జలసర్పములవల్ల భయము సంభవించును. మేషాంశయం దున్నయెడల కుక్కలవల్ల మృత్యువు కలుగును. వృషభాంశ యందున్నయెడల జింకలవల్ల మృత్యువుకలుగును. మిథునాంశ యందున్నయెడల కీటకాదులవల్ల భయముకలుగును. కర్క

టాంశయందున్నయెడల కోతులవల్ల మృత్యువు కలుగును. సింహాంశనుపొంది యున్నయెడల పులులవల్ల కఱవబడుటచేత మృత్యువు కలుగును. కన్యాంశనుపొంది యున్నయెడల నీటియందు మరణము సంభవించును. తులాంశనుపొంది యున్నయెడల వారిదశయందు గజములవల్ల మృత్యువుసంభవించును. వృశ్చికాంశనుపొంది యున్నయెడల ముంగిసల మూలకముగా భయము కలుగును. ఆలగ్నాష్టమాధిపతులుకలిసి మకరమందు ధనురాంశను పొందియున్నయెడల పిల్లులవల్ల మృత్యువు సంభవించును. ఈప్రకారముగా బుద్ధిమంతులు భ్రాతాదులయొక్క ఫలములను నిశ్చయించి చెప్పదగినది.

ఇతి జాతకఫల చింతామణౌ
నానావిధ మారక దశాంతర్దశా నిర్ణయోనామ
ఏకాదశ ప్రకరణం సమాప్తం.



శ్రీ రస్తు.

# జాతకఫలచింతామణౌ

ఆంధ్ర తాత్పర్య సహితము.

రవ్యాది గ్రహవశా ద్రోగోత్పత్తి నిర్ణయోనామ
ద్వాదశప్రకరణ ప్రారభ్యతే.

శ్లో॥ జన్మదుఃఖ జరావ్యాధి ఘోరసంసార సాగరాత్ ।
మాముద్ధర హృషీకేశ కృష్ణకృష్ణ జనార్ధన ॥ 1

తా. జన్మ, దుఃఖ, జరావ్యాధులతో గూడిన ఘోర సంసారమనెడి సముద్రమునుండి ఉద్ధరించుటకొఱకై శ్రీకృష్ణ పరమాత్ముని ధ్యానించుచున్నాను.

వ్ర ణ స్థా నా ని.

పరాశరసూత్రే.

శ్లో॥ వ్రణస్థానం ప్రవక్ష్యామి శీర్షేసూర్యస్యకీర్తిదం ।
ముఖేచంద్రస్యకథితం భౌమేకర్ణద్వయోర్భవేత్ ।
బుధేననాభిదేశస్స్యా దధోనాభౌబృహస్పతేః ।
నేత్రద్వయేతుశుక్రేణ శనేఃపాదద్వయోర్వదేత్ ।
ఉదరేరాహుకేత్వోశ్చ వ్రణోత్పత్తిరితిక్రమాత్ ।
భావేశషష్ఠభావేశ యోగాద్వ్రణ ముదీరయేత్ ॥ 2

తా. ఇకను వ్రణస్థానములను చెప్పుచున్నాడు. సూర్యునకు శిరస్సు, చంద్రునకు ముఖము, అంగారకునకు చెవులు, బుధునకు నాభిప్రదేశము, గురువునకు నాభికమలము, శుక్రునకు కన్నులు, శనికి పాదములు, రాహుకేతువులకు ఉదరము. ఈప్రకారముగా వ్రణయుత్పత్తిస్థానముల నెఱుంగునది. భావ షష్ఠమాధిపతుల సంబంధమువలన వ్రణబాధ చెప్పతగినది.

సర్వార్థచింతామణౌ॥

శ్లో॥ శిరోమేషా న్ముఖంకంఠం శ్రోత్రనాసాది గుహ్యకం ।
స్కంధౌపార్శ్వే దృశౌపాదౌ ప్రపదాకుక్షిమాతిశేత్ ॥3

తా. శిరస్సు, ముఖము, కంఠము, శ్రోత్రము, నాశికము, గుహ్యస్థానము, పాణి, పార్శ్వము, నేత్రములు, పాదములు, మీగాళ్లు, కుక్షి మొదలగునవి మేషాదిరాసులకు వరుసగా వ్రణస్థానములని వచింపదగినది.

వ్రణరోగం।

శ్లో॥ షష్ఠేశ్వరే క్రూర యుతే విలగ్నే
రంధ్రస్థితేవా వ్రణదశ్శరీరే ।
కరస్థితే తా దృశ ఖేచరేంద్రే
వ్రణప్రదోంగే శుభదృష్టియుక్తే॥ 4

తా. షష్ఠాధిపతి క్రూరులతోఁగలిసి లగ్నమందుగాని, అష్టమస్థానమందుగాని, యున్నయెడల దేహమునందు వ్రణ బాధకలుగును. ఆషష్ఠాధిపతి దశమరాశియందున్నను లేక ఆ దశమాధిపతివల్లగాని, అథవా యితరశుభగ్రహముల వల్లగాని చూడబడినను వ్రణనాశము కలుగును.

పరాశరసూత్రే.

శ్లో॥ షష్ఠేశ పాపసంయుక్తో దేహోష్టపయుతోయది ।
దేహవ్రణమవాప్నోతి పాపకర్మయుతోయది॥ 5

తా. షష్ఠస్థానాధిపతి పాపగ్రహములతో కూడియున్నను, లగ్నాష్టమాధిపతులతో కూడియున్నను, దేహమునందు వ్రణబాధయు, పాపకర్మ సంభవమును కలుగును.

## క్షయ రోగః.

గోపాలరత్నాకరే.

శ్లో॥ సప్తమేచాష్టమేవాపి శనిజీవా సమన్వితౌ ।
రక్తకాశోరవిస్తత్ర క్షయరోగే ససంశయః॥ 6

తా. సప్తమ అష్టమ స్థానములయందు శని గురులుచేరి యున్నయెడల రక్తకాశరోగము సంభవించును. అచ్చట సూర్యుడు యున్నయెడల నిస్సంశయముగా క్షయరోగము ప్రాప్తించును.

సర్వార్థచింతామణౌ॥

శ్లో॥ షష్ఠేబుధే కుజయుతే భృగుచంద్ర నిరీక్ష్యతే।
క్రూరాంశక సమాయుక్తే క్షయరోగం వదంతిహి।
రోగస్థానం గతేరాహౌ కేంద్రే మాంది సమన్వితే।
లగ్నేశే నాశరాశిస్థే షడ్వింశే క్షయరోగభాక్॥ 7

తా. బుధుడు షష్ఠరాశియందు కుజునితో కలిసి శుక్ర చంద్రులచేత చూడబడుచు క్రూరాంశయందుండగా క్షయ రోగము కలుగును. రాహువు ఆఱవయింటియందుండి మాందీ గ్రహము కేంద్రములయందుండి లగ్నాధిపతి వ్యయరాశియం దుండగా యిరువదియాఱు సంవత్సరములకు క్షయరోగము సంభవించును

కేరళే.

శ్లో॥ జలరాశిగతేచంద్రే క్షీణేవాపాపసంయుతే।
షష్ఠేవ్యష్టమలగ్నేవా క్షయరోగీభవేన్నరః॥ 8

తా. క్షీణచంద్రుడు జలరాశియందు పాపగ్రహసంబం ధము కలిగియున్నను, లేక షష్ఠాష్టమంబుల యందుగాని లగ్న మందుగాని యున్నను, క్షయరోగము సంభవించును.

మూత్రద్వారే శిలాపతనరోగః॥

గోపాలరత్నాకరే.

శ్లో॥ తృతీయాధిపతిస్సౌమ్యః లగ్నేవాయదిసంస్థితే।
కుజయుక్తేథవాదృష్టే మూత్రద్వారద్వయంభవేత్॥
భానుజేకుజసంయుక్తే తద్వారేచశిలోద్భవం॥ 9

తా. తృతీయాధిపతియైన బుధుడు లగ్నమందుండి కుజ సంబంధముగాని వీక్షణగాని కలిగియున్నను మూత్రద్వార

ములు రెండుగా ఏర్పడును. నారితో కూడ కుజశనులుచేరిన యెడల అశ్మరీరోగము సంభవించును.

మూత్ర కృఛ్రరోగః॥

గోపాలరత్నాకరే.

శ్లో॥ షష్ఠేశ స్సప్తమేశోవా వ్యయాధీశ సమన్వితః ।
శనినావీక్షితోహ్యేవ మూత్రకృఛ్రం వినిర్దిశేత్ ।
చతుర్థ సప్తమేశౌతౌ షష్ఠాష్టవ్యయశత్రుషు ।
క్రూరగ్రహేణసంయుక్తౌ మూత్రకృఛ్రంవినిర్దిశేత్ ।
షష్ఠేశే సప్తమాధీశే వ్యయాధీశ సమన్వితే ।
ఛాయానందన సంసృష్టే మూత్రకృఛ్రం వినిర్దిశేత్ ॥ 10

తా. షష్ఠ సప్తమాధిపతులలోనొకరు వ్యయాధిపతితో గూడి శనివీక్షణకలిగియున్నయెడల మూత్రకృఛ్రరోగముసంభవించును. గాకను చతుర్థసప్తమాధిపతులు 6-8-12 స్థానముల యందు శత్రుగ్రహములతోడనైనను, క్రూరగ్రహములతోడనైనను కలిసి యున్నయెడల మూత్రకృఛ్రరోగము కలుగును.

సర్వార్థచింతామణౌ॥

శ్లో॥ జలరాశిగతేచంద్రే షష్ఠేశద్భువనాధిపే ।
జపర్షస్థేవిధాదృష్టే మూత్రకృఛ్రాదికంభవేత్ ॥ 11

తా. జలరాశియైన షష్ఠమమందు చంద్రుడున్నపుడు షష్ఠమాధిపతి జలక్షేత్రమందుండి బుధునిచే చూడబడెనేని అట్టి జాతకునకు మూత్రకృఛ్రాది రోగము సంభవించును.

అండరోగః॥

గోపాలరత్నాకరే.

శ్లో॥ కుజార్కిఫణిసంయుక్త షష్ఠస్థానగతోయది ।
గురురాహు ద్వయే లగ్నే అండరోగీ భవేద్ధ్రువం ॥

కుజరాహుద్వయేలగ్నే కుబ్జోవాభవతిధ్రువం ।
జీవార్కఫణినః త్రిస్థాః అండరోగీభవేద్ధ్రువం ॥
జీవార్క రాహుసంయుక్తే తృతీయస్థేయదాకదా ।
అండరోగోభవేన్నౄణా మితికేరళనిర్ణయః॥ 12

తా. షష్ఠస్థానమున కుజ శని రాహువులున్నను లేక గురు రాహువులు లగ్నమందున్నను జాతకునకు అండరోగము కలుగును. కుజ రాహువులు లగ్నమందున్నచో కుబ్జయోగము రవి గురు రాహువులుకలిసి మూడవ యింటియందున్న యెడల అండరోగము సంభవించును.

బృహద్బీజం కుసుమరోగం॥

శ్లో॥ షష్ఠస్థానే కుజేరాహూ బృహతీ వృషణోభవేత్ ।
తత్కేటౌ సప్తమస్థానా భార్యాకుసుమరోగజా॥ 13

తా. షష్ఠస్థానమందు కుజ రాహువు లున్నయెడల బృహద్బీజరోగము సంభవించును. ఆగ్రహములు సప్తమస్థానమందున్నయెడల భార్యకు కుసుమరోగము కలుగును.

ఆసనరోగః॥

శ్లో॥ లగ్నేశేన కుజస్సాన్యుః కన్యామిథునసంస్థితౌ ।
బుధేనాపిచ సందృష్టే హ్యాసనేరోగవాన్భవేత్॥ 14

తా. లగ్నాధిపతితోడ కుజబుధులుకలిసి కన్యామిథున రాసులయందున్నను లేక బుధదృష్టియున్నను మూలవ్యాధి సంభవించును.

అపానరోగః - పవిత్రరోగః॥

శ్లో॥ లగ్నేశభూపుత్ర శశాంకపుత్రాః
సహాస్థితాసౌమ్య గృహాన్యభేవా ।

అపానరోగం త్వథవాపవిత్రం
పశ్యంతిషష్ఠే మునయోవదంతి॥ 15

తా. లగ్నాధిపతి కుజ బుధులతోడకలిసి శుభస్థానమగు షష్ఠమమందున్న యెడల అపానరోగముగాని పవిత్రరోగముగాని సంభవించును.

పిటకాదిరోగః॥

శ్లో॥ అష్టమేమందసంయుక్తే రంధ్రాద్ద్వాదశగేకుజే।
త్రింశద్వర్షేతదర్థే పిటకాది వినిర్దిశేత్॥ 16

తా. అష్టమందు శని, ద్వాదశాష్టమములయందెందేని కుజుడు యున్నయెడల ముప్పదిసంవత్సరములకైనను లేక పదియేనుసంవత్సరములకైనను పిటకాదిరోగము సంభవించును.

గ్రంధిమేహరోగః॥

శ్లో॥ రంధ్రాంశేరాహుసంయుక్తే తదీశేరంధ్రకోణగే।
ద్వావింశేష్టాదశేవర్షే గ్రంధిమేహాదిపీడితః॥ 17

తా. అష్టమరాశ్యంశయందు రాహువుండగా నాయంశాధిపతి అష్టమత్రికోణరాసులయందున్నయెడల 18 లేక 22-వ సంవత్సరమున గ్రంధిమేహరోగములు సంభవించును.

శ్వేతకుష్ఠరోగః॥

శ్లో॥ దేహేశౌచంద్రసౌమ్యౌచే త్ఫణికేతుయుతోపివా।
ఛాయానందనదృష్టీవా శ్వేతకుష్టీనసంశయః॥ 18

తా. చంద్రుడుగాని బుధుడుగాని లగ్నాధిపతులై రాహుకేతు సంబంధముకలిగి శని దృష్టిగలిగి యున్నయెడల శ్వేతకుష్టము ప్రాప్తించును.

శ్లో॥ శశాంకతత్పుత్ర విలగ్ననాథః
సరాహువార్కేణ యుత స్తదంగే।
శ్వేతాదికుష్ఠం మునయోవదంతి
శుభేక్షిత స్తం నభవే త్తదానీం॥ 19

తా. చంద్ర బుధ లగ్నాధిపతులు రాహు సూర్య సంబంధము కలిగి యున్నయెడల ఆరాశి కనుగుణమైన అంగమందు శ్వేతకుష్ఠముకలుగును. శుభవీక్షణకలిగి యున్నయెడల రోగనివారణ యగును.

శ్లో॥ షష్ఠేశరంధ్రేశ విలగ్ననాథా
ష్షష్ఠస్థితాశ్చే త్తనుకుష్ఠభాక్స్యాత్ ।
పిత్రాదిగానాం ఫలమేవమాహు
ర్మునీశ్వరాః కారకభావనాథైః ॥ 20

తా. లగ్న షష్ఠాష్టమాధిపతులు షష్ఠస్థానమందున్న యెడల కుష్ఠరోగము సంభవించును. ఈవిధముగా పిత్రాదుల యొక్క ఫలములను ఆయాకారక భావాధిపతులయొక్క శుభాశుభములనెఱింగి ఊహింపదగినది.

శ్లో॥ శ్వేతాదికుష్ఠం కుజసంయుతేన
నైల్యం భవేన్మంద సమన్వితేన ।
రక్తంతథా సూర్యసమన్వితేన
గృహే స్తదీశేన యుతేనవాస్యాత్ ॥ 21

తా. లగ్నషష్ఠాష్టమాధిపతులు కుజునితోకలిసి యున్నయెడల శ్వేతాది కుష్ఠరోగప్రాప్తియు, శనితో కలిసియున్నయెడల నీలకుష్ఠమును, సూర్యునితో కలిసియున్నయెడల రక్తకుష్ఠమును సంభవించును.

గ్రంథాంతరే.

శ్లో॥ రిపుస్థానంగతేచంద్రే శనినాసంయుతేయది।
పంచపంచాశతాబ్దేతు రక్తకుష్టంవినిర్దిశేత్॥ 22

తా. చంద్రుడు శనితోగలసి షష్ఠస్థానమందున్నయెడల 55 సంవత్సరములకు రక్తకుష్టరోగము సంభవించును

కుష్టత్రయం.

శ్లో॥ లగ్నేశభౌమవిధుసోమ జరాహుకేతు
యుక్తాస్థితాయది భవేదపి యత్రకుత్ర।
స్వదశానాంగే శ్వేతకుష్టారవేస్తు
రక్తాభ కుష్టమసితం శనినా వదంతి॥ 23

తా. లగ్నాధిపతితోగూడ కుజ చంద్ర బుధ రాహు కేతువులు చేరియున్నయెడల వారి స్వదశలయందు శ్వేతకుష్ట రోగము సంభవించును. రక్తకుష్టము రవివల్లను, నీలకుష్టము శనివల్లను ప్రాప్తించును.

## నేత్రరోగః॥

గోపాలరత్నాకరే.

శ్లో॥ నేత్రే శేతనునాయకే స్మరపతౌ చంద్రేయుతే దుస్థలే।
నేత్రఘ్నంతనునాయకే ధనపతౌసంస్థేచవామఘ్నకం।
లగ్నేశేధననాయకే శనియుతే జాత్యంధకోజన్మనీ।
రిష్ఫేభానునుతేక్షి దక్షిణహతం మాక్షిమంగారకే॥ 24

తా. ద్వితీయలగ్న సప్తమాధిపతులు చంద్రునితో కలిసి దుస్థానములయందున్న యెడల నేత్రరోగము సంభవించును. లగ్నధనాధిపతులు కలిసిన యెడల యెడమకన్నుకు రోగముకలుగును. లగ్నద్వితీయాధిపతులు శనితోకలిసినయెడల

ఆజాతకుడు జాత్యంధుడగు. శత్రుక్షేత్రమందు శని యున్న యెడల దక్షిణనేత్రమును, కుజుడున్న యెడల వామనేత్రమును గ్రుడ్డియగును.

—॥ రక్తకాశరోగః ॥—

శ్లో॥ షష్ఠేశేస సప్తమాధీశే ద్వశేమనుంధవిక్షితే ।
రక్తకాశో భవున్నృణా మితి కేరళనిర్ణయః ॥ 25

తా. షష్ఠసప్తమాధిపతులు కేతువుతో కూడినను లేక చూడబడినను రక్తకాశరోగము కలుగును.

—॥ శ్వాస కాశః ॥—

శ్లో॥ షష్ఠేశనౌనగుళికే రవ్యారఫణివీక్షితే ।
శుభన్యదృష్టే యుక్తేవా శ్వాసకాశక్షయాదిరుక్ ॥ 26

తా. షష్ఠరాశియందు శని గుళికునితో కలిసి రవి కుజ రాహువీక్షణగలిగి శుభగ్రహ సంబంధముగాని వీక్షణగాని లేకున్న యెడల శ్వాసకాశరోగము క్షయాది బాధలు కలుగును.

—॥ స్ఫోటకం - కుష్ఠురోగః ॥—

గోపాలరత్నాకరే.

శ్లో॥ షష్ఠేశే సప్తమస్థేవా కుజదృష్టేతు స్ఫోటకం ।
రాహుణాంగ వికారంచ కేతోఃకుష్ఠు ర్నసంశయః॥ 27

తా. షష్ఠాధిపతి సప్తమస్థానమందు కుజ దృష్టికలిగి యున్న యెడల స్ఫోటకభయము కలుగును. రాహువువల్ల అంగ వికారమును, కేతువువల్ల కుష్ఠరోగమును నిస్సంశయముగా కలుగును.

## మసూరికా సర్పవిషాదిరోగాః॥

శ్లో॥ లగ్నేశరోగేశప సంయుతశ్చే
ద్దృష్టాచమందాత్మజ రాహుకేతూః।
మసూరికా సర్ప విషాదిరోగా
స్సదా నరాణాం ప్రభవంతిసత్యం॥ 28

తా. లగ్నాధిపతి షష్ఠాధిపతితో గలసి శని రాహు కేతువులచే చూడబడినయెడల మసూరికా సర్పవిషాది రోగములు ఎల్లప్పుడును నరులకు నిశ్చయముగా సంభవించుచుండును.

## కుక్షిశూలరోగః॥

శ్లో॥ పంచమేసప్తమేక్రూరా స్తదీశేరిపుమందిరే।
క్రూరక్షేత్రగతేవాపి హృద్రోగోకుక్షిశూలకః॥ 29

తా. పంచమమునందును సప్తమమునందును క్రూరగ్రహములుండి ఆరాశ్యాధిపతులు శత్రురానులయందుగాని క్రూరక్షేత్రములయందుగాని యున్నయెడల హృద్రోగమును కుక్షిశూలయు సంభవించును.

## పైత్యరోగః॥

శ్లో॥ రోగస్థానంగతేసూర్యే తద్భావేపాపసంయుతే।
పాపదృష్టియుతేభానౌ పైత్యరోగ్బణమాదిశేత్॥ 30

తా. సూర్యుడు షష్ఠస్థానమును పొందియుండ నాభావమునకు పాపసంబంధము కలిగియుండి సూర్యునకు పాపదృష్టి యున్నయెడల పిత్తరోగము సంభవించును.

శ్లో॥ అష్టమేలగ్ననూర్యేచ లగ్నేచసహితేథవా ।
శుభైర్నిరీక్షితేలగ్నే పిత్తరోగ మవాప్నుయాత్॥ 31

తా. లగ్నాష్టమములయందు సూర్యుడు లగ్నాధిపతితో కలిసియుండి లగ్నమునకు శుభగ్రహవీక్షణ యున్నయెడల పిత్తరోగము సంభవించును.

శ్లో॥ చోరనాథేవిలగ్నేశో గురుషడ్వర్గగోయది ।
తస్యభుక్తౌపైత్యరోగీ పీడావాబ్రాహ్మణేనతు । 32

తా. లగ్నషష్టాధిపతులు గురుషడ్వర్గమం దున్నయెడల వారిభుక్తియందు పైత్యరోగము సంభవించును.

## ముఖరోగః.

శ్లో॥ లగ్నాధిపకుజోయత్ర బుధక్షేత్రస్థితోయది ।
బుధేనచేద్వీక్షితోవా ముఖరోగీభవేన్నరః॥ 33

తా. లగ్నాధిపతి కుజునితోకలిసి బుధక్షేత్రమందున్నను లేక బుధునిచే చూడబడినను ముఖరోగము సంభవించును.

## పీనసరోగః॥

శ్లో॥ షష్ఠచంద్రేశనౌరంధ్రే వ్యయేపాపవిలగ్నగే ।
పాపాంశకసమాయుక్తే పీనసంరోగమాదిశేత్॥ 34

తా. షష్ఠమమున చంద్రుడు, అష్టమ స్థానమందు శని, లగ్నమందు పాపగ్రహములయుండి లగ్నము పాపాంశనుపొంది యున్నయెడల పీనసరోగము కలుగును.

## అజీర్ణం - గుల్మం.

శ్లో॥ బలహీనేరినాథేవా లగ్నస్థేవాధరాసుతే ।
అజీర్తిముఖరోగోవా గుల్మరోగోభవేద్ధ్రువం॥ 35

తా. షష్ఠాధిపతి బలహీనుడైనను లేక లగ్నమందు కుజుడున్నను ఆజాతకునకు అగ్నిమాంద్య రోగముకాని లేక గుల్మరోగముగాని సంభవించును.

## అజీర్ణం - జలదోషం.

శ్లో॥ రోగాధిపశరీరేశ చంద్రషడ్వర్గ సంయుతః ।
జలదోషా స్తస్యభుక్తౌ అజీర్ణేవా నసంశయః॥ 36

తా. షష్ఠ లగ్నాధిపతులు చంద్ర షడ్వర్గమందున్న యెడల ఆభుక్తులయందు జలదోషముగాని అజీర్ణసంబంధమగు వ్యాధిగాని సంభవించును.

## వా త రో గః.

శేరశే.

శ్లో॥ లగ్నేశేరంధ్రరాశిస్థే మందేశత్రు సమన్వితే ।
ఏకోనషష్టివర్షేవా వాతరోగా ప్రపీడితః॥ 37

తా. లగ్నాధిపతి అష్టమమందును, శని శత్రుక్షేత్రము నందును, యున్నయెడల 59 సంవత్సరములకు వాతరోగము సంభవించును.

శ్లో॥ విత్తేష్టమేథవాలగ్నే లగ్నేశేసంయుతే శనా ।
చంద్రేపాపసమాయుక్తే వాతరోగార్దితోనరః॥ 38

తా. లగ్నాధిపతి శనితోగూడి 1-2-8 రాసులయందును, చంద్రుడు పాపసంబంధము కలిగియు నున్నయెడల నరులకు వాతరోగము కలుగును.

శ్లో॥ షష్ఠేశయుతలగ్నేశో బుధషడ్వర్గగోయది ।
తస్యభుక్తౌ భవేద్వాయుః కాలోవా దేహజాడ్యకృత్ ॥ 39

తా. లగ్నాధిపతి షష్ఠాధిపతితో గలిసి బుధషడ్వర్గమం దున్న యెడల ఆభుక్తియందు వాయురోగము మొదలగు జాడ్యములు దేహమందు కలుగుచుండును

వాతరోగ సన్నిపాతరోగః.

శ్లో॥ సరోగేశో విలగ్నేశో శనిషడ్వర్గగోయది।
తస్యభుక్తౌ భవేద్వాత స్సన్నిపాతోథవానృణాం॥ 40

తా. లగ్నాధిపతి షష్ఠాధిపతితో గూడి శనిషడ్వర్గమం దున్న యెడల ఆభుక్తియందు వాతరోగము, సన్నిపాతరోగము సంభవించును.

ఉష్ణ రోగః.

శ్లో॥ స్వక్షేత్రేశో విలగ్నేశః భృగుషడ్వర్గగోయది।
తస్యభుక్తౌ వుష్ణరోగః పీడాస్త్రీసంభవాతదా॥ 41

తా. లగ్నాధిపతి తానున్న రాశ్యాధిపతితోగూడి శుక్ర షడ్వర్గమందున్న యెడల ఆభుక్తియందు స్త్రీమూలకమైన ఉష్ణరోగము సంప్రాప్తించును.

జ్వర రోగః.

శ్లో॥ సరోగనాథో లగ్నేశో భౌమషడ్వర్గగాయది।
తస్యభుక్తౌ జ్వరప్రాప్తి ర్నరాణాం నాత్రసంశయః॥ 42

తా. లగ్నషష్ఠాధిపతులు కలిసి కుజషడ్వర్గయందున్న యెడల వారి భుక్తులయందు నరులకు నిశ్చయముగా జ్వర ప్రాప్తి కలుగును.

శ్లో॥ సరోగాధిపమూర్తీచ సూర్యషడ్వర్గ సంస్థితః।
తస్యభుక్తౌ జ్వరప్రాప్తి రాహుకాల విదోజనాః॥ 43

తా. లగ్నషష్ఠాధి పతులు సూర్యషడ్వర్గమం దున్న యెడల వారి భుక్తియందు రాహు అంతరమున జ్వరప్రాప్తి కలుగును.

శ్లో॥ రోగస్థానం గతేభౌమే తదీశే రంధ్రసంయుతే।
షడ్వర్షే ద్వాదశేవర్షే జ్వరరోగాది పీడితః॥ 44

తా. కుజుడు షష్ఠస్థానమందును, షష్ఠాధిపతి అష్టమ మందును యున్నయెడల ఆ జాతకునకు 6 లేక 12 సంవత్సర ములకు జ్వరగండము కలుగును.

సదారోగః - దీర్ఘరోగః.

శ్లో॥ రోగస్థానం గతే పాపే తదీశే పాపసంయుతే।
రాహుణా సంయుతే మందే సర్వదా రోగసంయుతః॥45

తా. షష్ఠ స్థానమందు పాపులున్నను, షష్ఠాధి పతితో పాపులు కలిసినను, లేక రాహువుతో గూడ శని కలిసియున్న ను, ఆజాతకుడు ఎల్లకాలము రోగ బాధ కలిగియుండును.

శ్లో॥ శన్యారసహితే షష్ఠేరవి రాహునిరీక్షితే।
లగ్నేశ్వరే హీనబలే దీర్ఘరోగీ భవేన్నరః॥ 46

తా. శని కుజునితో కలిసి షష్ఠమస్థానమునుబొంది రవి రాహువులచేత చూడబడుచుండగా లగ్నాధిపతి బలహీనుడైన యెడల దీర్ఘ రోగియగును.

గుల్మరోగః

శ్లో॥ వ్యయేశే రోగరాశిస్థే తదీశే వ్యయరాశిగే।
త్రివర్షే పంచమే వర్షే గుల్మరోగం వినిర్దిశేత్। 47

తా. ద్వాదశాధిపతి షష్ఠమమందును, షష్ఠాధిపతి ద్వాదశ రాశియందును యున్నయెడల 3 లేక 5 వ సంవత్సర మున గుల్మరోగము సంభవించును.

## { వాతరోగ - రక్తపైత్య - శ్లేష్మవాత - అతిసార - గుల్మరోగః. }

సర్వార్థచింతామణౌ.

శ్లో॥ తథాభూతేనిశానాథే క్రూరదృష్టేతదంశగే।
వాతరోగోభవేజ్జాతో రక్తపిత్తార్దితః కుజః।
శ్లేష్మవాతార్తిదస్సౌమ్య స్తథాభూతే విశేషతః।
తాదృశోన్యేనదోషస్స్యాచ్ఛుక్రాత్ మూలాతిసారరుక్।
తథాభూతేశనౌ గుల్మరోగో వాత్ర విశేషతః।
రాహుణా వాధ్వజే నాపి వయుక్తశ్చంద్రస్తురోగద॥48

తా. షష్ఠస్థానమందు చంద్రుడుండి క్రూరగ్రహవీక్షణ గలిగి క్రూరనవాంశ యందున్న యెడల అట్టి జాతకుడు వాతవ్యాధి వల్ల పీడితుడగును. గాకను షష్ఠమమునందు కుజుడుండి పాపగ్రహ దృష్టిబొంది పాప గ్రహ నవాంశను పొందియున్న యెడల రక్త పిత్త వ్యాధివల్ల పీడితుండగును. మరియు షష్ఠమమందు బుధుడుండి పాపగ్రహదృష్టుడై పాపగ్రహానవాంశస్థితుడాయెనేని శ్లేష్మవాతవ్యాధి పీడితుండగును. షష్ఠమమందు గురుడుండి పాపదృష్టి పాప నవాంశయుతుండైనను యే దోషము గలుగదు. షష్ఠమమందు శుక్రుడుండి పాప గ్రహదృష్టుడై పాపగ్రహనవాంశయందున్న యెడల అట్టిజాతకునకు మూల అతిసారాది వ్యాధులవలన మృత్యువు సంభవించును. గాకను, షష్ఠమమందు శనైశ్చరుడుండి పాపగ్రహ వీక్షణ గలవాడైన యెడల గుల్మరోగము ప్రాప్తించును. మరియు షష్ఠమమందు రాహుకేతువులు పాపగ్రహదృష్టిబొంది పాపనవాంశలయందుండెనేని పిశాచముల వలన బాధ కలుగునని తెలియదగినది.

## పాండ్వాది వి సర్పశూల రోగాః.

శ్లో॥ చంద్రేవష్ఠే కుజేయుక్తే భ్రాంతిః పాండ్వాది రోగతః ।
చరే రంధ్రే రవియుతే వి సర్పో శూల రోగకృత్॥ 49

తా. షష్ఠస్థానమందు చంద్ర కుజులు కలిసి యున్న యెడల మతిభ్రాంతియు, పాండ్వాది రోగమును సంభవించును. చరరాశి యైన అష్టమరాశియందు రవితోకూడియున్న యెడల సర్పరోగమును, శూలరోగమును సంభవించును.

## గ్రహసంబంధ రోగాః.

శ్లో॥ లగ్నేశోరిపు భావేశో రవిణా వీక్షితోయుతః ।
జ్వరగండం వదేత్ప్రాజ్ఞో జలగండం సితాంశునా॥
భౌమేన గ్రంధిశస్త్రాది వ్రణమేన ము దీరయేత్ ।
బుధేన పిత్త రోగీచ గురుణా రోగహీనవాన్ ।
యువత్యావధ శుక్రేణ మందో చండాల చోరకైః ।
రాహు కేతోశ్చ సర్పేణ గండాంతర ము దీరయేత్ ।
షష్టాష్టమవ్యయేశానాం దశాం కష్టప్రదాయినీం।
తేషాం భుక్తిశ్చకష్టం స్యా న్మారకస్యచతాదృశీ।
సమారకేశషష్ఠేశయుక్తో లగ్నాధి పోయది ।
తస్య భుక్తౌతు రోగార్త స్సంభవేన్నాత్రసంశయః॥ 50

తా. లగ్నషష్ఠాధిపతులు సూర్యునిచే చూడ బడిన యెడల జ్వరగండము కలుగును. చంద్రునిచే చూడ బడిన యెడల జలగండము. కుజునిచే చూడబడిన యెడల గ్రంధిరోగమును, శస్త్రాది వ్రణబాధయుకలుగును. బుధునిచే చూడ బడినయెడల పిత్తరోగము. గురునిచే చూడబడినయెడల దేహారోగ్యమును, శుక్రునిచే చూడబడినయెడల స్త్రీమూలకముగా

గండమును, శనిచే చూడబడిన యెడల చండాలుర వల్లను, చోరుల వల్లను భయమును కలుగును. రాహు కేతువులవీక్షణ కలిగియున్న యెడల సర్పగండము కలుగును. 6. 8. 12 రాసుల యధిపతుల దశలు కష్టఫలము నిచ్చును. వారి భుక్తులుకూడ కష్టఫలములను, మారకమును యిచ్చును. లగ్నాధిపతి మారక షష్టాధిపతులతోడ చేరి యున్న యెడల ఆ భుక్తియందు నిస్సంశయముగా రోగబాధలను, విశేషకష్టములను కలుగ చేయును.

ఇతి జాతకఫల చింతామణౌ.

రోగోత్పత్తి సంగ్రహో నామాధ్యాయః.

ద్వాదశ ప్రకరణం సమాప్తం.





శ్రీ రస్తు.

# జా త క ఫ ల చిం తా మ ణౌ.

ఆంధ్ర తాత్పర్య సహితః.



కర్మవిపాక సారసంగ్రహోనామ

త్రయోదశ ప్రకరణ ప్రారభ్యతే.



శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవనరోత్తమం।
దేవీం సరస్వతీంచైవ తతోజయ ము దీరయేత్॥ 1

తా. శ్రీమన్నారాయణుని, నరులలో శ్రేష్ఠుడైన నర మునిని, సరస్వతీదేవిని, నమస్కరించిన పిదప జయమును. వచింపవలయును.

—⊷ అథ ప్రశ్నవిధిః. ⊶—

శ్లో॥ రవివారేచ సంక్రాంతౌ శుభయోగే తథావిధిః ।
వైధృతౌచ వ్యతీపాతే విప్రాణాంచ గృహేతథా ।
దేవతాయతనేచైవ నద్యాంవై సంగమోత్తమే ।
అథవాస్వగృహేచైవ శుభస్థానే విశేషతః॥
ధ్యానంసమాచరే ద్రోగీ మృతపుత్ర స్సపుత్రకః।
కర్మణాపీడితో యోసౌ నారీవాపురుషోథవా ।
ధాత్రీఫలానిలోధ్రంచ గోమయంతిలసర్షపం ।
మృత్తికా సమకర్పూర ముశీరంతుపసంయుతం॥
ఔషధై స్సుశుభాగ్నిర్వి స్నానంకుర్యా త్ప్రయత్నతః ।
దేవాన్ పిత్రూంశ్చ సంతర్ప్యదత్వా సూర్యార్ఘ్యమేవచ।
ఏవంసర్వవిధిం కృత్వా సంకల్పం కారయేత్తతః ।
అద్యేత్యాది ప్రాచీన సంచిత కర్మవిలోకనార్థం ।
మనః కామయ మానసిద్ధ్యర్థం విష్ణోపూజన ।
పూర్వక కర్మవిపాక పుస్తక పూజన మహంకరిష్యే॥ 2

తా. పురుషుడుగాని స్త్రీగాని కర్మజాడ్యమువల్ల పీడింపబడుచున్నను, లేక బిడ్డలు మృతినొందుచున్నను, లేక పుత్రుడును తల్లితండ్రులును తీరని కర్మవ్యాధిని అనుభవించుచున్నను, అటువంటి మనుష్యులు చేయవలసిన కర్మవిపాకశాంతి క్రమ మెట్లనగా:—సామాన్యముగా భానువారము, సంక్రాంతి, శుభయోగము, వ్యతీపాత, వైదృతి, ఇటువంటి కాలముల యందు బ్రాహ్మణునియిల్లు, దేవస్థానము, నదీతీరము, నదీసం

గ్రమక్షేత్రము, లేక తనగృహమునందు పరిశుద్ధస్థలమున దేవుని యుంచి ధ్యానించి ఔషధస్నానము చేయవలెయును. నెల్లి కాయ, లోధ్రచెక్క, గోమయము నూగులు, సానురలు, పరి శుద్ధమైనమన్ను, పచ్చకర్పూరము, లావంచము, పెసలుపిండి మొదలగువాటిని సమభాగముగా చేర్చి నీళ్లలోకలిపి దానితో దేహమును బాగుగాతోమి స్నానము చేయవలెయును. దైవ పితృతర్పణముచేసి సూర్యభగవానునికి అర్ఘ్యమిచ్చి విధిప్రకా రముగా సంకల్పముచేసి అద్వైతాది ప్రాచీనసంచితకర్మవిలోక నార్థముగను, ధర్మార్థకామమోక్ష ఫల పురుషార్థసిద్ధికొఱకును, విఘ్నపూజ పూర్వకకర్మవిపాక పుస్తకపూజను చేయవలెయును. అదెట్లనిన:— అంగన్యాసపూర్వకం షోడశోపచార పూజాం సంకల్ప్య॥ వైశ్యదేవశ్రాద్ధం అత్రాంతరే దేహశుద్ధ్యర్థం పుర శ్చరణాంగత్వేనగో మిథునదానం ఘృతకుంభదానంచ ప్రజా పతి సంతుష్టయే కృత్వా షోడశబ్రాహ్మణాన్ భోజయేత్। భోజనానంతరే ప్రార్థనాచార్యస్య॥

శ్లో॥ బ్రాహ్మణత్వం మహాభాగ భూమిదేవ ద్విజోత్తమం।
యథావిధిం ప్రతిజ్ఞాయ ప్రాచీనంచ శుభాశుభం।
కథాంమే కథయస్వామిన్ కృపాంకృత్వామమోపరి॥
ఏవంచ బ్రాహ్మణాచార్యం నమస్కృత్య ప్రసాదయేత్।
దశపంచ తథావిప్రా నుపవేశ్య ప్రయత్నతః॥
తేషామనుజ్ఞయా సర్వ ప్రాయశ్చిత్తా నుపక్రమేత్॥
వస్త్రాలంకరణాద్యైరాచార్యం పూజయిత్వా ప్రజాపతి
స్వరూపం గురుం ప్రార్థయేత్॥

శ్లో॥ ప్రజాపతే మహాబాహో వేదవేదాంగ పారగ।
పుత్రకామ సమృద్ధ్యర్థం పూజాం గృహీణ్వ తేనమః॥

విష్ణోత్వం పుండరీకాక్ష భువనానాంచ పాలక ।
లక్ష్మ్యాసహ హృషీకేశపూజాం గృహ్ణీష్వ తేనమః ।
రుద్రత్వం దైత్య నాశాయ సదాభస్మాంగధారక ।
నాగయజ్ఞోపవీతీచ పూజాం గృహ్ణీష్వ తేనమః ।
సర్వేసురార్చ గంధర్వాః పాతాళే పన్నగాదయః ।
మృత్యులోకేమానవాశ్చ సర్వేధ్యాయంతి భాస్కరం ।
మహాయజ్ఞాంతికం హోమం అగ్నిహోత్రాది కర్మచ ।
తీర్థస్నానం తథాధ్యానం వర్తతే భాస్కరో దయాత్ ।
బ్రహ్మావిష్ణు శ్శివశ్శక్తి ర్దేవాశ్చైవ మునీశ్వరాః ।
ధ్యాయంతి భాస్కరం దేవం సాక్షీభూతం జగత్రయే ।
త్వం బ్రహ్మత్వంచ విష్ణుశ్చ రుద్రస్త్వంచ ప్రజాపతిః ।
త్వముగ్వస్త్వం వమట్కారస్త్వా మాహుస్సర్వసాక్షిణం ।
యోగీనాం పరమోధ్యేయో వ్రతీతో బ్రహ్మచారిణాం ।
ఆధివ్యాధి ప్రహర్తాత్వం సర్వపాప క్షయం కురు ।
దీనానాం కృపణానాంచ వ్యాధీనాం వ్యాధినాశనః ।
ఏవంచ భాస్కరంధ్యాత్వా నమస్కృత్య ప్రసాదయేత్ ।
పరీమద్దక్షిణాంగృహీత్వా బ్రాహ్మణాం త్రిఃప్రదక్షిణీకృత్య ॥

తా. అంగన్యాస కరన్యాసాది పూర్వకముగా షోడశోపచార పూజా సంకల్పక్రమము చేయవలయును. అటుపిమ్మట వైశ్వదేవశ్రాద్ధముచేసి దేహశుద్ధికొఱకై పురశ్చరణాంగముగా గోవృషభ దానములనుచేసి ఘృతకుంభదానముచేసి, ప్రజాపతి దేవతను సంతుష్టిచేసి షోడశ బ్రాహ్మణ సంతర్పణగావించి, భోజనానంతరం ఆచార్యులను ప్రార్థనచేసి పది, ఐదు బ్రాహ్మణులను, సభచేర్చి వారియనుజ్ఞనుపొంది సర్వప్రాయశ్చిత్తమును చేసుకొనవలయును. గురుపూజచేయుటకుగాను త్రిమూర్తి

పూజచేసి అటుపిమ్మట సూర్యభగవానుని విశేషముగా ప్రార్థించవలయును. ఆమీాదట యథావిధిగా పరిపద్దక్షిణ సమర్పించి బ్రాహ్మణులకు ముమ్మారు ప్రదక్షిణ నమస్కారముచేసి,

అథ పృచ్ఛకవినయః:—

శ్లో॥ పాపీచైవ దురాచారీ ఫలనిందా పరాయణః ।
బ్రంహహా హేమ హారీచ సురాపి గురుతల్పగః ।
స్త్రీహాచ బాల ఘాతీచ అగమ్యాగమనం తథా ।
ఏవమాదిని పాపానిమయావై పూర్వ జన్మని ।
కృతానివి విధాన్యేవం సర్వాణి మాహ్తు మర్హాసి ।
శరణం తవసంప్రాప్త స్త్వం మా ముద్ధర్తు మర్హాసి ।
మమోపరి కృపాం కృత్వా కర్మమే కథయప్రభో ।
ఏవముక్తో తదా దేవః బ్రాహ్మణో వేదపారగః ।
తము వాచ సమాహూయ వక్ష్యామిాప్రశ్నను మాదరాత్ ।
లగ్నంతత్కాలికం కృత్వా జన్మపత్రం నిరీక్ష్యచ ।
లగ్న గ్రహ విచారేణ జ్ఞాతవ్యం కర్మమానుషం ।
గ్రహావలి విచారేణ జ్ఞాతవ్యం శాస్త్ర పారగైః ।
పురాకైలాస శిఖరే సుఖాసీనం మహేశ్వరం ।
ప్రణమ్య పార్వతీ భక్త్యా ప్రత్యుక్తంచ సదాశివం॥ 4

తా. తనయొక్క పాపములను తనబుద్ధి చేత ఊహించి తెలిసికొని సిగ్గువిడిచి వారితో చెప్పుకొని తగువైన ప్రాయశ్చిత్తము చేయించు నట్లుగా బ్రాహ్మణులను ప్రార్థించవలయును. ఆసభికులు ఆపృచ్ఛకుని యొక్క జన్మపత్రమును చూచి గ్రహగతులకు తగినట్లుగా ప్రాయశ్చిత్తమును చెప్పవలయును. ఈ వివరము పార్వతీ దేవి వల్ల భక్తితో పూజింపబడుటచేత

ప్రత్యక్షుడైన కైలాస శిఖరమునందు సుఖాసీనుడై యున్న మహేశ్వరునిచే చెప్పబడియున్నది.

పార్వత్యువాచ.

శ్లో॥ దేవ దేవ జగన్నాథ భక్తానుగ్రహ కారక ।
లోకోపకారకం ప్రశ్నం వదమే పరమేశ్వర ।
కలౌచ మానవా స్సర్వే పాపమోహ సమన్వితాః।
మహారోగ గ్రహ గ్రస్తాః పుత్రకన్యా వివర్జితాః।
కుత్సితాః రూపవిభ్రష్టాః మృతవత్సాః నపుంసకాః।
నారీణాంపురుషాణాంచ పూర్వకర్మచ యత్ప్రిభో।
తత్సర్వం వదమేస్వామిన్ సర్వజ్ఞోసియతో మమ।
ఏతచ్ఛ్రుత్వానచో వ్యాధిః ప్రీతిమాన్స మహేశ్వరః ।
ప్రహస్యవగతామీశో వల్లభం ప్రీతి సంయుతాం।
ఉవాచ ప్రశ్నంతం గూఢం త్రైలోక్యే చాపి దుర్లభం॥

శివఉవాచ.

శృణుత్వం గిరిజేదేవి నృణాం కర్మ విశేషతః।
కథయామిన సందేహో యదితే శ్రవణే రతి ।
మత్తస్సర్వం జగజ్జాతః చరాచరమిదం హివై ।
స్వకర్మణాతతో దేవి భుజ్యతే దేవ మానుషైః।
మానుషైశ్చవిశేషేణ సుఖదుఃఖాది సంచయం ।
కర్మత్రయంచ సర్వేషాం తన్మధ్యే సుష్టుచింతయేత్ ।
వక్తవ్యం నాత్ర సందేహో యత్కృత్వా ఫలభాక్భవః।
ప్రారబ్ధ విస్తరం కర్మ వర్తమానంచ దృశ్యతే।
మేషాది ద్వాదశఋక్షే సర్వేషాం జన్మజాయతే।
తన్నవాంశాదిభేదేన జ్ఞాతవ్యంచ శుభాశుభం।

ఇతిశృత్వా ద చ స్తస్యే మహాదేవ ప్రియాశివా।
ప్రణమ్య పార్వతీదేవి శంకరం పరమేశ్వరం।
ఉవాచతం మహాదేతం చరాచర గురుంపరం।
ప్రాణినాం నియతంకర్మ తవమాయా వి చేష్టితం।
శుభమేవా శుభంచైవ కథం జానామి పూర్వజం।
తత్సర్వం కృపయాదేవ వదమే పరమేశ్వర॥ 5

తా. సకలప్రాణులును సంసారమందు కర్మ ఫలమునే యనుభవించుచున్నను కూడ మనుష్య జన్మమునకు మాత్రము ఆ జన్మమందు చేసిన పుణ్యపాపములు ఆ జన్మమందే అనుభవించు నట్లు కలుగును. కర్మఫలానుభవమునందు కర్మకర్తృత్వము మనుష్యులకే తప్ప యితర ప్రాణులకు లోపములేదు. ప్రారబ్ధాగామి సంచిత కర్మముల యందు సంచిత కర్మము మాత్రము ప్రాయశ్చిత్తమువల్ల పరిహారమగును. ఇషానిష్ట మశ్రకర్మములయందు అనిష్ట కర్మమునకు కేవల నివృత్తి. మిత్ర కర్మమందు అనిష్టాంశకుని వృత్తియు కావలెను.

ఈశ్వర ఉవాచ.

శ్లో॥ త్రివిధం ప్రాణినాం కర్మ నృణాం చైవ స్వభావజం।
అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలం।
అనిష్టం నాగలోకేచ నరకేవి విధోభవా।
ఇష్టం స్వర్గ ఫలం దేవి మిశ్రం మర్త్యే ప్రజాయతే।
ఏకత్రేష్ఠయా సర్వం జ్ఞేయం సర్వ శుభాశుభం।
రాజరోగీ భవేద్యస్తు బ్రంహహా పూర్వజన్మని।
పుత్రకన్యా విహీనోయః గోత్రహా గురుహాభవేత్।
పాండురోగీ నరోయస్తు దేవ పూజన వర్జితః।
కన్యాపత్యం భవేద్యస్య వేదనిందా కృతాపురా।

దరిద్రో దీర్ఘరోగీచ గోవధంచ కృతంపురా ।
కన్యాఘాతీ పశుఘాతీ తస్యభార్యానజీవతీ ।
భ్రాతృహాయః పురాదేవి సజ్వరేణ ప్రపీడితః ।
ఘంటావాదిత్ర హారీచ కంఠరోగీ నరోభవేత్ ।
భగినీ గమనం దేవీ కృతం వై పూర్వ జన్మని ।
తేన పాపేన భోదేవి చరణే ఖంజతాభవేత్ ।
మిత్ర ద్రోహీ బాలఘాతీ పశుఘాతీ తథైవచ ।
తత్ఫలేన మహాదేవి మృత వత్సశ్చ రోగవాన్ ।
కన్యాఘాతీ గర్భ ఘాతీ వాద్య పుస్తకహారకః ।
జన్మాంధో జాయతే దేవీ నాత్ర కార్యవిచారణా ।
వస్త్రహా భూమి హారీచ పరం నిందా ప్రహారకః ।
తేనపాపేనభోదేవి దరిద్రో జాయతేనరః ।
గోత్ర దారాప హారీచ దీర్ఘ రోగీ భవేన్నరః ।
మహిషీ పుత్ర ఘాతీచ కంఠరోగో ప్రజాయతే ।
నివర్త వృషభం యస్తు ప్రకరోతి నరాధమః ।
షండస్సం జాయతే దేవి మూత్ర కృచ్ఛ్రో భవేత్తతః ।
మాతృహా పితృహా దేవి మహాకుష్ఠీ భవేన్నరః ।
అగమ్యాగమనం యస్తు పీరయోషా గమంతథా ।
గోవధిజాయతేదేవి శ్వేత కుష్ఠీయుతస్సదా ।
కన్యకా గమనం యస్తు కరోతి హారతఃపురా ।
తేనపాపేనభోదేవి రోగవాన్ ధనవర్జితః ।
పుష్పగంధాహారీచ ముఖేతస్య ప్రగంధతః ।
ఘృతహారీ భవేత్కుష్ఠీ తస్మాద్ర భ్రష్టః క్రిమిర్భవేత్ ।
వృక్షగం ధాపహారీచ కీటకే జాయతే నరః ।
వాపీకూపాపహారీచ దంతరోగీ భవేన్నరః ।

దేవపాత్రాపహారీచ కంఠరోగీ భవేన్నరః ।
సారంగ గీత గాతీచ వనే దావాగ్ని దాహకః।
అక్షిరోగీ నాసికాయాంవ్రణీ క్రిమి కులాకులః ।
తైలహారీ భవేత్తైలీ గుడహారీ జ్వరీసదా ।
స్వర్ణరాప్యాప హారీచ నరో భవతి పుత్రహా ।
దాసదాసీ హాగోయస్తు కర్ణరోగీ భవేన్నరః ।
దధిదుగ్ధ హారోయస్తు కుక్షిరోగీ భవేన్నరః ।
మార్గగ్రాహీ వస్త్రహారీ బహురోగీ ప్రజాయతే ।
మయూరకుక్కుటానాంచ కచ్ఛపానాంచ ఘాతకః ।
భ్రాతరోగీచఖం జశ్చ జన్మ జన్మ నపుంసకః ।
మద్యపీ మాంస హారీచ మత్స్య భోజీ తథైవచ ।
తేనపాప ప్రభావేన చర్మకారోహీ జాయతే ।
అన్నహా జలహాద్వాచ దంతరోగీ భవేన్నరః ।
బ్రాహ్మణస్య గృహం విత్తం ధనధాన్య సమన్వితం ।
హారణం యచ్ఛవైకుర్యా స్మృగీ రోగీ నసంశయః ।
ఏవంబహు విధారోగాః నరాణాం చైవ జాయతే।
పూర్వకర్మ ఫలంచైవ భుజ్యతే ఖిలమానవైః ।
పూర్వజన్మకృతం పాప మిహ జన్మని బాధతే।
విజ్ఞాయ హోరాశాస్త్రేణ శాంతిం విధివదాచరేత్ ॥ 6

తా. ఈ జన్మమందు క్షయ రోగము ననుభవించు మనుజుడు పూర్వజన్మమునందు బ్రహ్మహత్య గావించినవాడు. ఇపుడు సంతానము లేనివాడు గురుహత్య గోత్రహత్య మొదలగునవి చేసినవాడు. దేవునిపూజ చేయనివాడు పాండు రోగియగును. వేదనింద చేసినవానికి పుత్రికలే జనింతురు. గోహత్య చేసినవానికి దారిద్ర్యము దీర్ఘరోగము సంభవించును.

ఘంట మొదలగు వాద్యముల నపహరించిన వానికి గుల్మ రోగ
ము సంభవించును. భగినీ గమనము చేసినవానికి కాలుకుంటి
యగును. మిత్ర ద్రోహము, శిశు హత్య, పశుహత్య మొదలగు
నవి చేసినవానికి బిడ్డలు నశింతురు. దేహమునందు జాడ్యము
సంభవించును. గర్భస్రావము కలిగించు కొన్నవారును, పుస్త
కముల నపహరించిన వారును జన్మ అంధులుగా పుట్టుదురు.
వస్త్రాపహారము, భూమ్యాపహారము, పరనింద పరపీడ మొద
లగునవి చేసిన వానికి మహా దారిద్ర్యము తటస్థించును.
పరస్త్రీలను అపహరించు వానికి దీర్ఘ రోగము. మహిషము
నపహరించిన యెడల కంపరోగము కలుగును. ఎద్దు యొక్క
వృషణములను కొట్టెడు నరాధముఁడు షండుఁడగును. గాకను
మూత్రకృచ్ఛ్రరోగము కూడ సంభవించును. మాతాపితృవుల
యొక్క హత్యగావించినవాడు మహా కుష్ఠరోగము ననుభవిం
చు వాడగును. అగమ్యాగమన గోహత్యలు చేయుట వల్ల
శ్వేతకుష్ఠము సంప్రాప్తించును. బలాత్కారము చేత కన్య
కను చెఱచిన యెడల పేదరికము, శిశురోగము కలుఁగును.
గంధపుష్పాదుల నపహరించిన యెడల దేహమందు దుర్వా
సన కలుగును. నేతిని దొంగిలించిన యెడల క్రిమిరోగము
కలుగును. చెట్లను దొంగిలించినవానికి పురుగులుపడును.
గుంటలు బావులు మొదలగు వానినుండి నీళ్లను అపహరిం
చిన వానికి దంతరోగము సంభవించును. దేవపాత్రల నపహ
రించిన వానికి కంఠరోగము సంభవించును. వాద్యముల నప
హరించిన వానికి అడవియందు అగ్నిభయము కలుగును.
తైలమును దొంగిలించిన యెడల నేత్రరోగమును నాసికము
నందు క్రిమిబాధయు సంభవించును. బెల్లము నపహ

రించిన యెడల జ్వరపీడితుడగును, వెండి బంగారమును దొంగిలించినయెడల పుత్రహాని కలుగును. దాసదాసీల నపహరించిన యెడల కర్ణరోగము సంభవించును. పాలు, పెరుగు, దొంగిలించిన యెడల కడుపునొప్పి కలుగును. మార్గస్థులను దోచువాడును వస్త్రముల నపహరించువాడును బహువిధములగు రోగముల ననుభవించును. పక్షుల నపహరించువానికి శ్వాసరోగము కలుగును. మధ్యమాంసములను అపహరించినను, లేక మత్స్యభోజనము చేసినను చర్మరోగము ననుభవించును. అన్నపానాదులను అపహరించినయెడల దంత రోగియగును. బ్రాహ్మణునియొక్క సొమ్ము నపహరించినను, అనగా ఆతనియొక్క గృహము, విత్తము, ధనధాన్యసంపద లను అపహరించిన యెడల మహారోగము కలవాడగును. ఈప్ర కారముగా అపరిమిత పాప విశేషములవల్ల కొన్ని విధవిధము లయిన అనంతరోగములు బుట్టి ఏయొక్క ఔషధమువల్లను గుణముకాక పీడించుచుండును. అటువంటి రోగములు నశిం చుటకొఱకై పూర్వోక్తక్రమముగా చేర్పబడియున్న సభికుల నందరిని ప్రార్థించి వినయపూర్వకముగా నడుగుటవల్ల మహా జనులయిన బ్రాహ్మణులు చెప్పినట్లుగా ప్రాయశ్చిత్తము చేసు కొన్నయెడల పాపములు పరిహారమై రోగ నివృత్తి యగును.

ఇతి జాతకఫల చింతామణౌ

కర్మవిపాకాఖ్యనామ త్రయోదశాధ్యాయం

సమాప్తం.





శ్రీ ర స్తు.

# జా త క ఫ ల చిం తా మ ణౌ.

## ఆంధ్ర తాత్పర్య సహితః.



గ్రహాణాం శాంతి విధిర్నామ

చతుర్దశ ప్రకరణ ప్రారభ్యతే.



ఆదౌ తద్రోగాపనోదనాయ గ్రంథాంతరోక్తవిధి

మాకృష్యాత్ర ప్రకాశయామః.

సూర్యదశాయాం సూర్యప్రీతికర స్వర్ణపద్మదానం.

యామళే.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామి సూర్యప్రీతి కరంపరం।
స్వర్ణపద్మ మితిఖ్యాతం సర్వదానోత్త మోత్తమం।
ద్వాదశాష్టమ జన్మాది దుస్థాన స్థితభానునా।
సూచితారిష్టశమనం సర్వసంతృప్తి దాయకం।
ఆయుష్కరం పుత్రదంచ హ్యారోగ్య కరముత్తమం।
జన్మర్క్షే నామనక్షత్రే కర్మర్క్షే భానువాసరే।
గ్రహయోగేపివా కుర్యాత్ దానమేత ద్విచక్షణః।
దేవాలయేగృహేవాపి శుచౌదేశే సమాహితః।
చతురాఢక మానేన హ్యాఢక త్రితయేనవా।
ద్వ్యాఢకే నాఢకే నాపి గోధూమైశ్చ నవైశ్శుభైః।
రాశింకృత్వా కర్షమాత్ర స్వర్ణనిర్మిత పంకజ।

తామ్రపాత్రే వినిక్షిప్య హ్యష్టపత్రం సకర్ణికం ।
రక్తవస్త్రేణ సంవేష్ట్య ధ్యాత్వాపూజాం సమాచరేత్ ॥ 1

తా. సూర్యుడు జన్మ, అష్టమ, ద్వాదశాది దుస్థానముల యందుండగా తన దశాభుక్తి కాలములయందు క్రూర ఫలముల నిచ్చును గాన ఆయురిష్ట శాంతికొఱకై సూర్య ప్రీతికరంబుగా జన్మనక్షత్రము, నామనక్షత్రము, కర్మనక్షత్రము లేక భానువారములయందు సకల దానములయందును ఉత్తమమైన స్వర్ణపద్మదానమును ఆయుర్వృద్ధిని, పుత్ర సంపదను ఆరోగ్యమును యుద్దేశించి చేయవలయును. దేవస్థానముల యందైనను లేక స్వంతగృహమునందైనను శుచియైన ప్రదేశమునందు నాలుగు తూముల వడ్లు రెండుతూములగోధుమలు రాశిచేసి తాంబ్ర పాత్ర కలశస్థాపనము చేసి బంగారు సూర్య ప్రతిమను యుంచి అష్టపత్రము రక్తవస్త్రములతో యథావిధిగా శాంతి కల్ప ప్రకారము పూజచేసి.

ధ్యానం.

శ్లో॥ ద్విభుజం పద్మహస్తంచ వరదం మకుటాన్వితం ।
ధ్యాయేద్దివాకరందేవం సర్వాభీష్ట ప్రదాయకం ॥

యని సూర్యభగవంతుని ధ్యానముచేసి.

ఏవంధ్యాత్వా ఉదయమితి మంత్రేణాథ సమర్చయేత్ ॥
రక్త గంధాక్షతైః పుష్పైః పాయసాద్యైర్యథావిధి ।
అథర్ఘ్యం పంకజదళే ష్వర్చయేన్నామభిః క్రమాత్ ॥
సూర్యోదివాకరశ్చైవ తేజోమూర్తి ర్జగత్పతిః ।
శశాంకోవరదశ్శాంతః హంసశ్చే త్యష్టనామభిః ।
తతోర్ఘ్యంచ ఘృణి సూర్య ఆదిత్యో ఇతి మంత్రతః ।
యథావిద్యుక్త మంత్రేణ హోమం కుర్యాచ్ఛుభానవే ।

దత్వా బ్రాహ్మణ మభ్యర్చ్య రక్తవస్త్ర విలేపనైః ।
దద్యాన్మంత్రేణ తత్పద్మం మంత్రమేతం పఠన్నరః ॥ 2

తా. రక్తగంధాక్షత పుష్పములు సమర్పించి యథావిధిగా పాయసము నైవేద్యము చేసి సూర్యః దివాకరః తేజోమూర్తిః జగత్పతిః శంకరః వరదః శాంతః హంసః యనెడి అష్టనామపూజచేసి అర్ఘ్యమిచ్చి యథావిధిగా మంత్రముల చేత హోమముచేసి బ్రాహ్మణ పూజచేసి మంత్రోదకము చేత యజమానుని ప్రోక్షణచేసి కలసవస్త్ర ప్రతిమాదానముచేసి.

మంత్రః॥ గోధూమస్థం రవింభక్త్యా స్వర్చితంసుమనోహరం।
దదామి ఫలసిద్ధ్యర్థం పీడాందహాతు మేరవిః ।
ఇతి దత్వా దక్షిణాంచ రక్తధేనుం ప్రదాపయేత్ ।
అనేనవిధినా యస్తు స్వర్ణ పద్మం నివేదయేత్ ।
సర్వపాప వినిర్ముక్త స్సర్వరోగ వివర్జితః ।
దుష్టస్థానస్థితాదిత్య సూచితా రిష్టమోచితః ।
రాజక్షోభార్థనాశాది సర్వోపద్రవ వర్జితః ।
ఇహ భుక్త్వాఖిలాన్భోగా నంతే సూర్యపదం లభేత్ ।
ఇతియామళే సూర్యప్రీతికర స్వర్ణ పద్మదానవిధిః॥ 3

తా. దుష్ట స్థానములయందున్న సూర్యుని వల్ల కలిగెడు అరిష్ట నాశముకొఱకును రాజోపద్రవమును అర్థ నాశము మొదలగు సకలవిధకష్టములును తొలగి సర్వపాప విమోచనమును సర్వరోగ నివారణయు కలిగి ఇహలోకమునందు సకలవిధ భోగములను పొంది సర్వాభీష్ట ఫల సిద్ధ్యర్థమై భక్తితోడ సూర్యభగవానుని ప్రార్థించి సూర్యప్రీతికరముగా ఎఱ్ఱనిగోవును దక్షిణతోడ దానము నియ్యవలయును. ఈ ప్రకార

ముగా స్వర్ణ పద్మ దానము చేసిన యెడల సూర్యప్రీతి యగు నని యామిళగ్రంథమునందు చెప్పబడియున్నది.

రవిదశాయాం రవిభుక్తౌ భాను ప్రీతికర రక్త ధేను దానం.

అర్ణవే.

శ్లో॥ ప్రత్యక్షం రక్త ధేనుంచ సవత్సాంచ పయస్వినీ।
స్వర్ణశృంగీరౌప్యఖురాం తామ్ర పృష్ఠసమన్వితా ।
స్వర్ణఘంటాంకాస్యదోహాంముక్తాలాంగూలభూషణాం।
రక్తవస్త్రేణ సంవేష్ట్య దద్యాద్విత్తాను సారతః ।
ఘృతకుంభ సమోపేతాం నైవేద్యాంతం ప్రపూజయేత్।
గావోభగేతి మంత్రేణ నియమాదర్చయే న్నరః ।
తతో బ్రాహ్మణ మభ్యర్చ్య వస్త్రైరాభరణై శ్శుభైః ।
పీనసాది శిరోరోగ గ్రస్తంమాం పాహి భాస్కర ।
రక్తధేను ప్రదానేన సర్వరోగాన్ హరస్వమే ॥
తతస్తు దక్షిణాం దద్యా ద్యథావిభవ సారతః ।
నిరోగీనాత్ర సందేహో దీర్ఘమాయు ర్భవేద్ధ్రువం ।
ఇత్యర్ణవే భానుప్రీతికర రక్తధేను దాన విధిః ॥ 4

తా. పాలు యిచ్చునట్టి ఎఱ్ఱని గోవును దూడతోడను చెక్కిన కొమ్ములును తోక కాళ్లు మొదలగు అవయవములను బంగారు వెండితో శృంగారించి పాలు పితుకుటకై కంచు పాత్రతోడను ఎఱ్ఱని వస్త్రాలంకార సహితముగను ఘృత కుంభముతోడను నైవేద్యాదులతోడను పూజించి బ్రాహ్మణునిగా వో భగేతి మంత్రములతోడఅర్చించి శుభవస్త్ర ఆభరణములతోడ ఆ బ్రాహ్మణునకు ప్రత్యక్షగోదానమును చేయవలయును. అట్లు చేసిన యెడల పీనసాది శిరోరోగములు పరిహారమగును. ఎఱ్ఱనిగోవును దానము యిచ్చుట వల్ల సర్వరోగములు

రిహారమగును. దానికితగినట్టుగా దక్షిణ లోపముకాకూడదు. అట్లు వైభవముతోడ దక్షిణ కూడ సమర్పించిన యెడల ఆరోగ్య భాగ్యమును పొందుటయే గాక ఆయుర్వృద్ధియు కలుగును. ఈప్రకారముగా అర్ణవమునందు భాను ప్రీతికరముగా రక్తధేను దానవిధి చెప్పబడియున్నది.

రవిదశాయాం చంద్ర భుక్తౌ చంద్రప్రీతికర గోదానం.

హేమద్రౌ,

శ్వేతధేను దానవిధిః॥

శ్లో॥ ఏతద్దానంకర్తుమిచ్ఛుఃపురుషఃగ్రహణాదిపుణ్యకాలేషువా।
ద్వాదశాష్టమ జన్మస్థ చంద్ర సంచారకాలేవా ।
దేవాలయాది పుణ్యదేశేషుగోమయానులేపితరంగవల్ల్యాది।
రచితభూ భాగోపరి అవ్యంగీం సుశీలాం పయస్వినీం ।
సవత్సాం శ్వేతాంగాం ప్రాఙ్ముఖమవస్థాప్యస్వర్ణశృంగరజిత ।
ఖురముక్తా లాంగూల తామ్ర పృష్ఠకాంస్యదో ।
హేమశ్వేత వస్త్రాదిభి రలంకృత్య ఏవం ।
రచయిత్వా దాన సంకల్పం కుర్యాత్ ॥ 5

తా. సూర్యదశలో చంద్ర భుక్తియందు చంద్రప్రీతికరముగా తెల్లని గోదానము నిచ్చుటకు తగినవిధి ఎట్లనిన:— ఈదానమిచ్చుటయందిచ్ఛ గల పురుషుడు గ్రహణాది పుణ్యకాలముల యందును లేక ద్వాదశాష్టమ జన్మరాసులయందు చంద్రుడు సంచరించుచున్న కాలమున యందును. దేవాలయాది పుణ్యస్థలముల యందు గోమయముతో శుద్ధిచేసి ముగ్గులు మొదలగునవి పెట్టి శృంగారించినట్టి భూ ప్రదేశము నందు మంచి అంగ పరిశీలము గలదియును పాలు ఇచ్చునదియును, దూడతో కూడి నదియును, తెల్లని దేహము గలది

యును, ఎత్తైనముఖము గలదియును, బంగారు చేత నలంక రింపబడిన కొమ్ములు గలదియును, నల్లని వెంట్రుకల కుచ్చుతో గూడిన తోక కలదియును. తామ్ర పృష్ఠము గలదియును యగు గోవును వస్త్రాలంకార సహితముగా దానము చేయుట కొఱకై సంకల్పముచేసి.

శ్లో॥ ఏవంగుణే త్యాదియమ ఇహ జన్మని జన్మాంతరేషు।
జ్ఞానాజ్ఞానకృత మహాపాతకాది సకల పాతక సంక్షయ ।
ద్వారా సర్వమంగళా వాప్త్యర్థం వాత శ్లేష్మకపోద్భవాది।
నానారోగ నివారణార్థం శతాయుష్య సిద్ధ్యర్థం ।
చంద్ర గ్రహ ప్రీత్యర్థం శ్వేత ధేనుదానం కరిష్యేతి ।
సంకల్ప్య శ్వేతధేను పూజాం కుర్యాత్ ॥ 6

తా. ఈ ప్రకారముగా ఏవంగుణ విశేషణ విశిష్టాది శుభతిథౌ యందు ఈ జన్మమందును జన్మాంతరము నందును, తన యొక్క జ్ఞాన అజ్ఞాన ముల వల్ల చేయబడిన మహా పాతకాది సకల పాతక క్షయాద్వారా సర్వమంగళము కలుగుట కొఱకును వాత శ్లేష్మ కఫముల వల్ల బుట్టిన నానారోగ నివారణార్థముగను పూర్ణాయుస్సు సిద్ధించుట కొఱకును చంద్ర గ్రహ ప్రీత్యర్థముగా తెల్లని గోదానము చేయుట కొఱకై సంకల్పము చేసి శ్వేత ధేనుపూజ చేయవలసినది.

శ్లో॥ సవత్సాయై శ్వేతధేనవేనమః ।
ఆవాహ నాస నార్ఘ్య పాద్యస్నానం
సురభీర్వస్త్రదానేన ప్రియతాం ।
పరమేశ్వరీతి వస్త్రముపవీతా భరణాని గంధాక్షత
పుష్పాణి అంగపూజా ।
శ్వేత ధేనోస్సవత్సాయా ఇతి ధేనోర్వరగ్రపాదాభ్యాం ।

శృంగాభ్యాంపశ్చాత్పాదాభ్యాంపుచ్ఛాయసర్వాంగేభ్యః।
గాః ధూపః ప్రతి గృహ్యాతామితి దూపః ।
ఆనంద కృత్సర్వలోక ఇతి దీపః ।
సురభి స్త్వం జగన్మాతః విచిత్రైరన్నకై రితిచ ।
మంత్రేణనై వేద్యతాంబూలం నీరాజనంచ ।
యాలక్ష్మీ రితి పంచ భిశ్లోకైః ప్రదక్షిణం ।
నమోగోభ్య ఇతి మంత్రేణ నమస్కారః ।
గావోమ మాగ్రత స్సంత్వితి ప్రార్థనా ।
ఏవం శ్వేత ధేనుపూజాం కృత్వా ॥ 7

తా. దూడతో గూడిన తెల్లని గోవును ఆవాహనచేసి అర్ఘ్యపాద్యాది స్నానములను చేయించి వస్త్రప్రదానముచేసి ఉపవీతి యాభరణములతోడను. గంధాక్షత పుష్పములతోడను అంగపూజ చేసి గోవుయొక్కయు దూడయొక్క చతుష్పాదములకును పృచ్ఛ భాగమునకును సర్వాంగములకును శొమ్ములకును అలంకారముచేసి దూపదీప నైవేద్య తాంబూల నీరాజనములను సమర్పించి ప్రదక్షిణ నమస్కారములు చేసి మంత్ర పూర్వకముగా ప్రార్థించి ఈ ప్రకారముగా శ్వేత ధేను పూజ చేసి.

శ్లో॥ బ్రాహ్మణం చంద్ర స్వరూపమితి వస్త్రాంగులీయ ।
కర్ణాభరణాద్యై రభ్యర్చ్య దద్యా ద్దానమంత్రః ।
శ్వేతగాత్సర్వ భూతానాం పూజనీయ్యాసరోహిణీ।
తీర్థదేవమయీ యస్మాదతశ్శాంతిం ప్రయచ్ఛమే ।
అస్మై అహమిమాం స్వర్ణ శృంగాది విభూషితాం।
స్వర్చితాంస వత్సాం శ్వేతాంగాం పూర్వోక్తఫల
కామస్తుభ్య మహం సంప్రదదే నమః ।

వృచ్ఛ దేశేదాన సాద్గుణ్యార్థం
సువర్ణ త్రయం దక్షిణాం దద్యాత్ ।
ఇతి శ్వేత గోదానవిధిః ॥ 8

తా. చంద్ర స్వరూపు డైనట్టి బ్రాహ్మణుని వస్త్రముల తోడను, ఉంగురములతోడను, చెవులకు ఆభరణములతో డను, అలంకరించి పూజించి గోవుయొక్క తోకను పట్టుకొని మూడు వరహాల సహితముగా చంద్ర ప్రీతికరముగా బ్రాహ్మణునకు గోదానము చేయవలెయును. అట్లు చేయుటవల్ల పూర్వోక్త ప్రకారముగా ఇష్టకామ్యార్థసిద్ధిని పొందుటయే గాక సకల గ్రహచార పీడయు నివృత్తియగును.

రవిదశాయాం కుజభుక్తౌ కుజప్రీతికర అనడ్వాహదానం.
యూవ శే.

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామ్యనడువాహ దానముత్తమం ।
అంగారక ప్రీతికరం దానానాముత్త మోత్తమం ।
ద్వాదశాష్టమ జన్మస్థ సప్తమే నవమేపివా ।
దుష్టస్థాన స్థితః క్రూరః కుర్యా దంగారకో వ్రణం ।
మానహానిం ద్రవ్యహానిం స్థానహానిం కుజంతథా ।
రాజామాత్య భయంచైవ పిశునో పద్రవాదికం ।
దారిద్రదుఃఖక్లేశాదీన్ తస్మాత్తత్తం నివృత్తయే ।
ఆయురారోగ్య సిద్ధ్యర్థం కర్తవ్యం దానముత్తమం ।
జన్మర్క్షేగ్రహ యోగేవా తథారిక్త తిథావపి ।
కృష్ణపక్షే చతుర్దశ్యాం సంక్రాంతౌ దర్శనేపివా ।
భౌమవారే విశేషేణ గృహే దేవాలయేపివా ।
గోమయే నోపలిప్యోర్వీం రంగవల్లిం నిరచ్యచ ।
రక్తవర్ణమనడ్వాహ మదగ్ధం ద్విత్రివర్ణకం ।

కర్ణచ్ఛేదాది రహితం ప్రక్షాళ్య ప్రాఙ్ముఖం క్షిపేత్ ।
స్వర్ణశృంగై రౌప్యఖురైః ముక్తాలాంగూల భూషణైః ।
అలంకృత్య స్వయంతస్మిన్ శివం సంప్రార్థయేత్తథా ।
తువరీభారసహితం సమ్యక్సం ప్రార్థయేత్తథా ।
అనడ్వాహా బలీవర్ధ రుద్రవాహా వృషాహ్వయా ।
ధర్మమూర్తే నమస్తుభ్యం పూజాంగృహ్ణీ వృషాహిమాం।
ఏవంధ్యాత్వాభూసుతంచ తస్మిన్నావాహ్య పూజయేత్ ॥

తా. అన్ని దానములలోను వృషభదానము యుత్తమము. అంగారక ప్రీతికొఱకై దానము లన్నిటిలోను ఈవృషభదానము అత్యుత్తమ మైనది. అంగారకుడు ద్వాదశ అష్టమ, జన్మ, సప్తమ, నవమములయందున్నను లేక దుష్టస్థానములను పొందియున్నను లేక క్రూరుడైనను వ్రణబాధను కలుగచేయును. గాకను మానహానియు ద్రవ్యహానియు, స్థాననాశమును, రాజభయమును, మంత్రి కోపమును, దారిద్ర దుఃఖమును, సహా కలుగచేయును. ఇవన్నియు నివృత్తియగుట కొఱకును ఆయురారోగ్యాభివృద్ధి సిద్ధించుట కొఱకును, ఈదానమిచ్చుట ఉత్తమము. జన్మనక్షత్రమునందును, గ్రహయోగమునందును, లేక రిక్తతిథుల యందును, కృష్ణపక్షపు చతుర్దశియందును, సంక్రాంతియందును, దర్శన దినముల యందును మంగళవారమునందును విశేషముగా తనయింటియందు గాని లేక దేవాలయమునందుగాని గోమయము చేత భూమిని శుద్ధిచేసి రంగవల్లి పెట్టి రక్తవర్ణముతో గూడినదియును. మదముతో గూడినదియును, 2 లేక 3 సంత్సరముల వయస్సు గలదియును కర్ణచ్ఛేదము మొదలగు అంగవిహీనము లేనిదియును యగు వృషభమునుతెచ్చి ప్రక్షాళనము చేసి స్వర్ణము చేత

శౌమ్ములనలంకరించి భూషణములతోడ తోక మొదలగు యవ యనముల శృంగారించి శివుని ప్రార్థించి కందులమూటను మోపి యథావిధిగా ఆవాహనాది పూజలు చేసి.

శ్లో॥ అగ్నిర్మూర్ధేతి మంత్రేణ రక్త గంధాక్షతాదిభిః ।
రక్తోత్పలైః రక్తపుష్పైః ఏభిర్నామైః పృథక్పృథక్ ।
మంగళో భూమిపుత్రశ్చ ఋణహర్తా ధనప్రదః ।
స్థిరాసనో మహాకాయ స్సర్వకర్మావరోధకః ।
ధర్మాత్మజః కుజోభౌమో భూతిదో భూమినందనః ।
అంగారకో యమశ్చైవ సర్వరోగాపహారకః ।
వృష్టికర్తా వృష్టిహర్తా సర్వకామ ఫలప్రదః ।
ఏభిస్సంపూజ్య ధూపాదీన్ దత్వాచైవగుడోదనం ।
నివేద్యార్ఘ్యం ప్రదాతవ్యం మంత్రేణానే నయత్నతః ।
భూమిపుత్రమహాకాయ స్వేదోద్భవపినాకినా ।
శ్రేయోర్థీ త్వాం ప్రపన్నోస్మి గృహాణార్ఘ్యం నమోస్తుతే ।
తతఃపుష్పాంజలింకుర్యాత్ ప్రదక్షిణమథాచరేత్ ।
అనడ్వాహ క్షయేఽత్ర కృష్యాదీనాం కృతమత్రమం ।
శివవాహ పశుశ్రేష్ఠ భారవాహిం నమోస్తుతే ।
బలపుష్టి మహాసత్వ రోగాదిభయ సంచయ ।
కృష్యాది సర్వకార్యేషు శక్తస్త్వం క్షంతుమర్హసి ।
అనేన ప్రార్థనాం కృత్వా భువో యజ్ఞేతి మంత్రతః ।
తతో బ్రాహ్మణ మాహూయ వేదవేదాంగ పారగం ।
రక్తగంధాక్షతైః పుష్పైః రక్త వస్త్రాది భూషణైః ।
సంపూజ్యాస్మై ప్రదాతవ్యమనడ్వాహంసభూషణం ॥ 10

తా॥ మంత్ర సహితముగా రక్త గంధాక్షతాదులును, ఎఱ్ఱని పుష్పములను సమర్పించి అంగారకుని ధ్యానించి ధూప

దీపాది నైవేద్యంబులను నొసంగి అర్ఘ్యమిచ్చి ప్రదక్షిణ నమస్కారము చేసి అనేక విధంబులుగా ప్రార్థించి అటుపిమ్మట వేద వేదాంత పారంగతుడగు బ్రాహ్మణునకు రక్త గంధాక్షతులను పుష్పములను, ఎఱ్ఱని వస్త్రములను భూషణములను యిచ్చి.

మంత్రః.

శ్లో॥ ధర్మస్త్వం వృషరూపేణ జగదానంద కారక ।
అష్టమూర్తే రధిష్ఠానా దతఃపాహి సనాతన ।
తుషరీభార సంయుక్తమనడ్వాహం మహాబలం ।
దదామాయుష్య వృద్ధ్యర్థం భౌమపీడావనుత్తయే ।
అకస్మాదహ మిత్యాది పూర్వోక్తం సంస్మరంతదా ।
సువర్ణం దక్షిణాందద్యా త్తథా ద్వాదశ సంఖ్యయా ।
తదర్థంవా యథాశక్తి దక్షిణార్థం ప్రదాపయేత్ ।
తథాషాణ్మాస పర్యంతం తన్ముఖం నావలోకయేత్
ఏతద్దాన ప్రతిష్ఠార్థం దశదానాని కారయేత్ ।
సూర్యావలోకనం కృత్వా శాంతీసూక్తం జపేత్తతః ।
అనడ్వాహస్య దానంతు విధినాయః కరోతిచ ।
సర్వదోష వినిర్ముక్త స్సర్వక్లేశ వివర్జితః ।
పుత్రపౌత్రైః పరివృతః సుఖీభవతి మానవః ।
ఇతియామళే కుజభుక్తి ప్రీతికర అనడ్వాహ దానవిధిః ॥

తా. పై చెప్పిన ప్రకారముగా మంత్రోచ్ఛరణ చేసి సువర్ణదక్షిణ సహితముగా ఎఱ్ఱని వృషభమును విధిప్రకారముగా దానముచేసినయెడల సర్వదోషములు తొలగిపోయి పుత్ర పౌత్ర సహితముగా సుఖము ననుభవించును. ఈ రీతిగా యామళ గ్రంథమునందు కుజప్రీతి కొఱకై అనడ్వాహదాన విధి చెప్పబడియున్నది.

రవిదశాయాం రాహుభుక్తౌ రాహుప్రీతికర మహిషీదానం.

యామళే.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామి మహిషీదాన ముత్తమం ।
కాలమృత్యు హరం సాక్షా దపమృత్యోస్తు కాకథా ।
అసాధ్య క్షయరోగాది మహారోగ నివారణం ।
మహాజ్వరం మహావాత మహాగుల్మాది నాశనం ।
రిపురాజ మహామాత్య మహా భయనివారణం ।
భౌమాంత రిక్షదివ్యాఖ్య త్రివిధోత్పాత నాశనం ।
మహామారీ మహామృత్యు ర్మహాభయ నివారణం ।
ద్వాదశాష్టమ జన్మస్థ క్రూరగ్రహ భయాపహం ।
సాక్షాద్యమ ప్రీతికరం తాపత్రయ నివారణం ।
అయనేవిషు పుణ్యేషు జన్మర్క్షేచ విశేషతః ।
అసాధ్య రోగకాలేచ దుస్స్వప్నా ద్భుత దర్శనే ।
భూమౌగోమయలిప్తాయాం కుశానాస్తీర్య సర్వతః ।
తరుణీం వత్ససహితాం అవ్యంగాం శ్యామలాం శుభాం।
మహిషీం స్నాప్యసర్వాంగం తైలేనా విప్యసర్వతః ।
రక్తవస్త్రేణ సంవేష్ట్య దక్షిణాభిముఖస్థితాం ।
కృత్వా తు తేషుదర్భేషు పరితో నిక్షిపేత్తతః ।
సప్తధాన్యానిపిణ్యాకం పిటకం తామ్రదోహకం ।
శృంగయో స్స్వర్ణశృంగేచ ఖురానాయస నిర్మితాం ।
ఖురేషుస్వర్ణతిలకం లలాటే రూప్యనిర్మితాం ।
పంక్తింపంక్తించ దంతేషు రూప్యపుచ్ఛంతు పుచ్ఛకే ।
తామ్రఘంటా కంఠదేశే విన్యసేద్భక్తితో నరః ।
ఏవంవిధాయ తస్యాంతు మహిషాం విధివత్పునః ।
ప్రపూర్వమితిమంత్రేణ మృత్యుమావాహ్య పూజయేత్॥

తా. కాలమృత్యువును హరించుటకును, సాక్షాత్తుగా అపమృత్యువును హరించుటకును, అసాధ్యమైనటువంటి క్షయ రోగాది మహారోగములను నివారణచేయుటకును, మహాజ్వరం, మహావాతం, మహాగుల్మాది రోగములను నాశనము చేయుట కును, శత్రుభయము, రాజభయము, మంత్రికోపము, మొదలగు విశేషభయములను నివారణచేయుటకును, భూమ్యాంతరిక్షములయందు కలుగు ఉత్పాతములయొక్క నాశనమును, మహామారీ, మహామృత్యువు, మహాభయము మొదలగువాటి నివారణయును, చేయుటకొఱకై మహిషీదానమిచ్చుట ఉత్తమంబు క్రూరగ్రహములు ద్వాదశ, అష్టమ, జన్మస్థానముల యందుండుటవల్ల కలుగునటువంటి భయములను పోగొట్టుటకు గాను సాక్షాత్తుగా యమునియొక్క ప్రీతికొఱకును, తాపత్రయ నివారణమునకుగాను, సంక్రాంత్యయన, విషువత్పుణ్య కాలములయందును, విశేషముగా జన్మ నక్షత్రమునందును, అసాధ్యరోగము సంభవించి యున్నపుడును. దుస్స్వప్నము కలిగియున్నపుడును, భూప్రదేశమును, గోమయముచేత శుద్ధి చేసి నల్లని ఎనుమును దూడతోగూడ తెచ్చి సర్వాంగములకు నూనెపూసి, రక్తవస్త్రముచుట్టి దక్షిణాభిముఖముగా నిలిపి దర్భలతోడ గాణిగనుండి తీయుబడిన నూగులపిండిరాశిని ప్రోగు చేసి గేదెయొక్కతోకకు గంటకట్టి కొమ్ములకును, గొంతుకును వెండి బంగారములచేత అలంకారముచేసి విధిప్రకారముగా మంత్రములచేత మృత్యుదేవతను ఆవాహనచేసి పూజించి.

శ్లో॥ రక్తగంధాక్షతై పుష్పైఃకర వీరజపాదికైః।

కృసరాన్నంచ నైవేద్యం నివేద్యప్రార్థయేత్తతః।

ఆధివ్యాధి మహామృత్యు మహాభయ యుతంతుమాం।

త్రాహి దేహి సుఖారోగ్యం మృత్యోస్త్వన్మూర్తిపూజయా।
ఇతిసంప్రార్థ్య సంకల్ప్య విప్రమాహూయదుర్గతం।
కుటుంబినంకులీనంచ వేదవేదాంగ పారగం।
సంపూజ్యనీలగంధాద్యైః నీలవస్త్రైశ్చ భూషణైః।
ఉదఙ్ముఖాయ విప్రాయ ప్రాఙ్ముఖో దానమాచరేత్।
కుశైఃపుష్పాక్షతైస్సాకం గృహీత్వా పుచ్ఛమగ్రతః।
దద్యాదనేన మంత్రేణ సర్వరోగాపనుత్తయే॥ 12

తా. రక్తగంధము, ఎఱ్ఱనిఅక్షతలు, పుష్పములు, మొదలగువానితో మహాపూజచేసి కృసరాన్న నైవేద్యము సమర్పించి, అదేప్రకారముగా ఆదివ్యాధి మహామృత్యువులును, మహాభయమును పోగొట్టి సుఖారోగ్యముల నిచ్చునట్లుగా మృత్యుదేవతనుప్రార్థించి సంకల్పముచేసి, కుటుంబియు, మంచి కులమునందు పుట్టినవాడును, వేదవేదాంగ పారంగతుండును. యగు బ్రాహ్మణుని నీలగంధ, అక్షత, పుష్పాదులతోడను, నీల వస్త్రభూషణాదులతోడను, పూజించి సర్వరోగ పరిహారార్థముగా గేదె దానమిచ్చుటకొఱకై కుశ పుష్ప అక్షత సహితముగా సాకదానము యిచ్చి ఈక్రిందచెప్పెడి ప్రకారముగా యుక్తమంత్రోచ్చరణచేసి.

మంత్రం॥

శ్లో॥ ఇంద్రాదిలోకపాలానాం యారాజ మహిషీ శుభా।
మహిషీ దానమాహాత్మ్యా త్సాస్తుమే సర్వకామదీ।
ధర్మరాజస్యసాహాయ్యం యస్యాఃపుత్రప్రతిష్ఠితః।
మహిషాసురస్య జననం యాసాస్తు వరదామమ।
కాలమృత్యు స్వరూపాంతాం మహిషీం రక్తభూషణాం।
మృత్యుభీత్యాప్రయచ్ఛామి హ్యాతశ్శాంతిం ప్రయచ్ఛమే।

దానం దత్వాతు విప్రాయ మహిషీం మృత్యురూపిణీం।
శతనిష్కం తదర్ధంవాతదర్ధం వాపి శక్తితః ।
దద్యాద్దాన ప్రతిష్ఠార్థం దక్షిణాం ప్రీతిమానసః ।
తతః ప్రతి గృహీణాచ దేవస్యేత్యాది సంవదన్ ।
దాతామృత్యుశ్చ దేయంచ మృత్యుర్మృత్యుర్వహంపునః ।
దాతుర్మృత్యు ర్వినాశాయ మృత్యుంగృహ్ణామ్యసంశయః।
ఇత్యుక్త్వా సతుంనిర్గచ్ఛే చ్ఛీఘ్రమానా మితామనః ।
తతోమృత్యోః పనమిత మంత్రేణా నేనమానవః ।
గోమయాంభోభితంమృజ్య మహిషాశ్చ ద్విజస్యచ ।
ప్రదానితత్ర విన్యస్య రంగవల్లీం వికీర్యచ ।
పుష్పాక్షతాం స్తతోవిప్రై శ్చతుర్భి స్స్వస్తివాచనం ।
కారయిత్వాథ విప్రేభ్యో దద్యాద్గో వస్త్రకాంచనం।
దానానిచ యథాశక్తిందత్వా సంతుష్టమానసః ।
ప్రగృహీచ్యవచనం వత్సరం నావలోకయేత్ ।
అనేనవిధినాయస్తు మహిషీ దానమాచరేత్ ।
నాపమృత్యు భయంతస్య నచవ్యాధి భయంతథా ।
విషకృత్రిమ సంభూత భయన్నాప్యుపజాయతే।
వేదోక్తాయుష్యత శ్శ్రీమాన్ గృథకారోగ్య ఢేంద్రియః।
పుత్రపౌత్రైః పరివృతో భక్త్యా భోగ పరంపరాం ।
దేహాంతే దివ్యరూపాఢ్యో విమానం సూర్యసన్నిభం ।
దివ్యమాల్యాం బరధరో దివ్యస్త్రీ పరివేష్టితః ।
బ్రహ్మలోకం సమాసాద్య తత్రైవ పరిలీయతే ।
ఇతి యమాష్టకే రామ ప్రీతికర మహిషీదానవిధిః॥ 13

తా. ఇంద్రాది లోకములను పాలించు నట్టి యమధర్మ రాజు యొక్క వాహనంబైన మహిషమును సకల ఇష్ట కామ

మోక్ష ఫల పురుషార్థములను పొందుట కొఱకై సూరువర హాలుగాని లేక అందులో నర్ధముగాని లేక దానిలో సగము గాని యథాశక్తిగా అధిక దక్షిణ యిచ్చి బ్రాహ్మణునకు వస్త్రాభరణముల చేత అలంకారముచేసి పూజించి సమంత్రకముగా దానమిచ్చి పంపి దానిని మరల చూడకనే యథాశక్తిగా బ్రాహ్మణులకు గోదాన భూదాన వస్త్రదాన కాంచన దానములను సమర్పించి విధిప్రకారముగా పరిశుద్ధుడుకావలయును. అట్లు మహిషీదానము చేసినయెడల మహా అపమృత్యువు పరిహారమగును. అంతియే గాక విషకృతిమ సంబంధ మగునట్టి భయము లన్నియు నశించును. వేదోక్త ప్రకారముగా ఆయుర్భాగ్యముగల శ్రీమంతులునుదృఢగాత్రులును దృఢమనస్కులును యగు పుత్ర పౌత్రులసహితముగను భోగ భాగ్య పరంపరల ననుభవించుచు దేహము నశించిన పిమ్మట దివ్యవిమానము నెక్కి సూర్య సాన్నిధ్యమును చేరి దివ్యమాల్యాంబర ధరులగు దివ్య స్త్రీలతోడ పరివేష్టింప బడినవాడై బ్రహ్మలోకమును పొందు వాడగును. ఈ ప్రకారముగా యామళ గ్రంథము నందు రాహుప్రీతికరంబైన మహిషిదాన విధి చెప్పబడి యున్నది.

రవిదశాయాం గురుభుక్తౌ గురుప్రీతికర స్వర్ణదానం

విష్ణుయామళే.

శ్లో॥ పలాదిపరిమిత సువర్ణ దాన రచనా ఏతద్దానంచికీర్షుః ।
అథాతస్సం ప్రవక్ష్యామి స్వర్ణ దాన విధింక్రమాత్ ।
బలహీనేయథాజీవే రోగక్లేశ భయం భవేత్ ।
జన్మరాశిస్థితేజీవే మృత్యురోగ భయాదయః ।
తృతీయేర్థభయవృద్ధిశ్చ మానహానిర్భవేత్పునః ।

చతుర్థే బంధుపీడాచ స్వగోత్ర కలహేపిహా ।
అష్టమే రాజ్యహానిశ్చ స్థాననాశం మనోవ్యథా ।
పశ్వశ్చకృషిహానిశ్చ దశమేస్థాది సంక్షయః ।
ద్వాదశే సర్వహానిశ్చ సదా పీడాకరోగురుః ।
రాశి చక్రే యదాదుష్ట స్థానే జీవస్థితోయది ।
జీవవారే పుణ్యకాలే స్వర్ణదానం యథావిధి ।
గోమయేనో పలిప్యోర్వ్యాం రంగవల్లిం ప్రవిన్యసేత్ ।
శాల్యక్షతైః హారిద్రాక్తైః ప్రస్థద్వయమితైశ్శుభం ।
పద్మమష్టదళంతత్ర విలిఖ్య శుభకర్ణికం ।
తస్మిన్ ప్రసార్యకౌస్తుంభం వస్త్రంతస్యో పరిన్యసేత్ ।
పాత్రం పలద్వయమితం రజతేన వినిర్మితం ।
తత్రోపరిస్థితం స్వర్ణంపూజయే ద్విష్ణుదైవతం ।
ఉపచారై స్సముభ్యర్చ్య దద్యాన్మంత్ర మిమంపఠన్ ।
నమస్తే దేవదేవేశ కృపామయ జగత్ప్రభో ।
స్వర్ణదానేన సతతం మమసంతు మనోరథాః ।
ఆయురారోగ్యమైశ్వర్యం విజయంవిపులం యశః ।
స్వర్ణదానేన లక్ష్మీశ దేహి జన్మని జన్మని ।
ఇతి దత్వాసువర్ణంచ యథాశక్తించ దక్షిణాం ।
దత్వైవవిపులాన్ భోగాన్ భుక్త్వాదార సుతైస్సహా ।
వేదోక్తాయుద్యుత శ్రీమాన్ నిర్భయోనిరుపద్రవః ।
తతోవిష్ణుం పదంయాతి తత్రగత్వానశోచతి ॥
ఇతి విష్ణుయామళే స్వర్ణదాన విధిః ॥ 14

తా. గురుప్రీతికరముగా సువర్ణదానము చేయవలెయు
ను. గురువు బలహీనుడై యున్న యెడల రోగభయమును

దుఃఖప్రాప్తియును సంభవించును. జన్మరాశియందు గురువున్న యెడల మృత్యురోగ భయము కలుగును. తృతీయ మందు గురువున్న యెడల విశేషభయమును మానహానియు కలుగును. చతుర్థమందు బంధుపీడయు స్వగోత్ర కలహమును కలుగును. అష్టమమందు గురువున్న యెడల రాజ్యహానియు స్థాననాశంబును మనోవ్యథయును కలుగును. మరియు పశుహానియు కృషి నష్టమును సంభవించును. దశమరాశియందు గురువున్న యెడల అర్థనాశము కలుగును. ద్వాదశరాశి యందున్న గురువు సర్వవస్తుహానియు సదాపీడయు కలుగజేసును. రాశిచక్రమందు దుస్థానంబుల యందు గురువున్న యెడల గురువారము పుణ్యకాలమునందును యథావిధిగా స్వర్ణదాన మియ్యవలెయును. అదెట్లనిన. గోమయము చేత అలికి రంగవల్లి బెట్టి శుద్ధమైనటువంటి భూప్రదేశమునందు శుచిగా పసుపుతో అష్టదళ పద్మము వ్రాసి కుసుంబావస్త్రమును పఱచి దప్పమైన వెండిపాత్రమునందు ఒకవరహాతూకము గల బంగారుతో గురుప్రతిమను చేయించి విష్ణుప్రతిమ సహితముగా పూజించి బ్రాహ్మణునికి శోడషోపచారములు చేసి యుక్త మంత్రపఠన గావించి యథాశక్తి దక్షిణతో గూడ సువర్ణ దానముచేసిన యెడల అనిష్ట పరిహారమగుటయే గాక విశేష భోగ భాగ్య సౌఖ్యంబును భార్యాపుత్ర సుఖమును ఆయుర్యాభివృద్ధియు కలుగును. మరియు మహాసంపన్నుడై నిర్భయముగను నిరుపద్రవముగను జీవించియుండి అనంతరము విష్ణుపదమును పొందువాడగును. ఈ ప్రకారముగా విష్ణుయామిళము నందు స్వర్ణదాన విధి చెప్పబడి యున్నది.

రవిదశాయాం శని భుక్తౌ శని ప్రీతికర ఛాగదానం.

పూమశే.

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి సర్వపాప హరక్షమం ।
మహాభయాపహం నిత్యం దుష్టగ్రహ భయాపహం ।
దుర్గ్రహాణో ద్భూత విస్మృత్యు స్సాదనాశనం ।
ఉత్పాతదోషసీహారం కృత్రిమాది భయాపహం ।
ఛాగదాన మితిఖ్యాతం సర్వసంపత్ప్రదాయకం ।
రోగశాంతిప్రదం నృణా మాయురారోగ్యదాయకం ।
క్లేశకారే ప్రకుర్వీత గ్రహదోషాత్ప్రముచ్యతే ।
జన్మకర్మతథా ధానాన్నక్షత్రే గ్రహసంక్రమే ।
అష్టమ్యాంవా చతుర్దశ్యాం ద్వాదశ్యాం వాథపర్వణి ।
భానుభౌమ భృగోర్వారే త్రిపుష్కర వివర్జితే ।
కర్తుశ్చంద్ర బలోపేతే బాహ్యక్షే స్వగృహేధవా ।
దేవాలయే నదీతీరే శుద్ధదేశే సమాచరేత్ ।
హస్తత్రయమితాం భూమిం గోమయేన విలేపయేత్ ।
కృత్వాస్వస్తి కుశానన్య సర్షపాక్ష సంప్రకీర్యచ ।
అరోగిణం పూర్ణకాయం ఛాగంప్రక్షాళ్యవారిణా ।
దానదేశే వినిక్షిప్య యమస్యాభిముఖోథవా ।
చతుర్విధం ధాన్యరాశిం యథాద్రోణ ప్రమాణతః ।
వామాగ్రపాదే గోధూమాన్ దక్షిణాగ్రేతుమాషకం ।
పృష్టస్యవామపాదే తునిక్షిపే చ్చణకాన్ బుధః ।
పృష్ఠస్యదక్షిణెపాదె తిలరాశిం వినిక్షిపేత్ ।
నీలవస్త్రేణ సంవేష్ట్య రక్తగంధాక్షతాదిభిః ।
ఏమచ్ఛాగేతి మంత్రేణ పూజయేత్ప్రాఙ్ముఖ శ్శుచిః ।
శృంగద్వయం రాజతేన అయసేనఖురాంస్తథా ।

నీలరక్తమయం స్వర్ణ పటం స్పృష్టే తథాయసాత్ ।
తిలోదనంచ నైవేద్యం తథాకర్తా ప్రదక్షిణం ।
తతో బ్రాహ్మణ మభ్యర్చ్య వేదాచార సమన్వితం ।
ఛాగస్యదక్షిణే పాదే హవ్యవాహ సమన్వితం ।
కుటుంబినం కులీనంచ గంధవస్త్రాది భూషణైః ।
మృత్యుంజయేశ్వరమితి సంచిత్య బ్రాహ్మణోత్తమం ।
దక్షిణాభి ముఖస్థాయ ప్రాఙ్ముఖో దాన మాచరేత్ ।
దానోపరిగతం ఛాగం దక్షిణాభి ముఖాన్వితం ।
స్వర్చితం నీలవస్త్రాఢ్యం మృత్యువక్త్రసముద్భవం ।
శివరూపాయ విప్రాయ తథామృత్యుంజయాయచ ।
ఛాగందదామి సర్వార్థ సుఖారోగ్యాది సిద్ధయే ।
తతస్తుదక్షిణాదానం శతనిష్కం ప్రమాణతః ।
దరిద్రకృతదోషేణ స్వర్ణపంచక మేవవా ।
సువర్ణద్వయ మేవాపి దద్యాద్భక్తి సమన్వితః ।
విప్రంవిసర్జయే త్పశ్చా న్స్నాసాంతం నావలోకయేత్ ।
తిలదాన మయఃపిండం కార్పాసార్ధియథోక్తతః ।
కర్తాశరీర పుష్ట్యర్థం శ్రీమూర్తే ర్దాన మాచరేత్ ।
రుద్రాభిషేకం కుర్వీత తతో బ్రాహ్మణ భోజనం ।
నిరీక్షణంచ కుర్వీత ఫలదానాదికం తథా ।
యఃకుర్యాద్భక్తి భావేన విత్తశాఠ్య వివర్జితః ।
తస్య మృత్యు భయంనాస్తి సత్యమేవన సంశయః ।
నిరోగిదృఢకాయాచ చిరజీవి సుఖీభవేత్ ।
ఇతి యామళే శనిప్రీతికర ఛాగదానవిధిః ॥ 15

తా. విశేషభయము ఎల్లపుడును దుష్టగ్రహాభయ సంభవము దుర్గ్రహముల మూలకముగా కలుగునటువంటి మృత్యు

భయము ఉన్మాదము ఉత్పాత దోషము కృత్రిమాది భయము మొదలగు సర్వపాపములను హరింపజేసి క్షేమమును పొందుట కొఱకై ఛాగదానము చెప్పబడి యున్నది. క్లేశ కాలమందు కృష్ణాష్టమి చతుర్దశి ద్వాదశి జన్మనక్షత్రాది క్రూర పర్వకాలములు భాను, శుక్ర, మంగళవారములు మొదలగు దినములలో కర్తృవు, అనగా కర్మచేయువాడు తారాబల చంద్రబలములతో గూడిన నక్షత్రమందు తనయింటి యందుగాని లేక దేవాలయము నందుగాని నదీతీరమందుగాని శుద్ధమైన భూప్రదేశమునందు పరిశుద్ధుడై మూడుహస్తముల పరిమాణము గల భూమిని గోమయము చేత అలికి రోగములేనిదియు ధృఢమైన దేహముగలదియునగు నల్లని మేకపోతును తెచ్చి అచ్చట నిలిపి దానియొక్క వామపాదము వైపున గోధుమధాన్యమును, దక్షిణపాదము వైపున వుద్దులు ధాన్యమును పృష్ఠ భాగమునకు కుడివైపున ధాన్యము, దక్షిణభాగమందు నూగులు ధాన్యమును యథాద్రోణ ప్రమాణముగా రాసులుచేసి నీలవస్త్రము కప్పి రక్తగంధాక్షతలను సమర్పించి యథా విధిగా మంత్రములచేత పూజించి నూగులు నైవేద్యము బెట్టి ప్రదక్షిణ నమస్కారముచేసి మృత్యుంజయేశ్వరుని పూజచేసి యథావిధిగా పిండకార్పాన సహితముగా దక్షిణాభి ముఖముగా నిలిచి యున్నటు వంటి కుటుంబుడును, సద్వంశమునందు బుట్టిన వాడును యగు బ్రాహ్మణోత్తముని గంధవస్త్రాది భూషణములతోడ పూజించి తాను పూర్వాభి ముఖముగా నిలుచుకొని ఛాగదాన మిచ్చి ఆ విప్రుని పంపించి పిమ్మట ఒక నెలవరకును ఆ విప్రుని యొక్క దర్శనము చేయ కూడదు. అటు పిమ్మట రుద్రాభి షేకమును సాలగ్రామ దానము బ్రాహ్మణ భోజనము

విశేషముగా ఫలదానము మొదలగు శాంతులను భక్తిపూర్వకముగా చేసినయెడల మృత్యు పరిహారమగును ఇందుకు సందేహము లేదు. గాకను దేహారోగ్యమును దృఢశరీరమును ఆయుర్వృద్ధియు సుఖమును కలుగును ఈప్రకారముగా యామళ గ్రంథమునందు శని భగవానుని ప్రీతికొఱకు ఛాగదాన విధి చెప్పంబడియున్నది.

రవిదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర రచితదానం.

హేమాద్రౌ॥

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి బుధప్రీతికరంపరం।
రజతేన కృతం దేవం పలమేకాదశం శుభం।
దుష్టస్థాన స్థితస్సౌమ్యః కురుతే సర్వతోభయం।
పైత్యరోగభయం మృత్యుభయ మర్థవినాశనం।
బంధుద్వేషం కార్యహానిం బుద్ధిభ్రంశం తథైవచ।
తస్మాత్తద్దోషశమన మాయురారోగ్య సిద్ధయే।
దానమేతత్ప్రకర్తవ్యం సౌమ్యవారే విశేషతః।
గృహే దేవాలయేవాపి గోమయేనోపలిప్యతే।
రంగవల్లీం సమాలిఖ్య ముదరాశ్యో పరిస్థితం।
రజతేన బుధం దేవం పీతవస్త్రేణభూషితం।
మల్లికా జాజిపుష్పాద్యైః పూజయే ద్ధ్యానపూర్వకం॥16

తా. బుధప్రీతికరముగా పదునొకండు పలముల వెండితో ప్రతిమనుచేయించి దానమియ్యవలెయును. అదెట్లనిన:— దుష్టస్థానముల యందున్న బుధుడు సర్వవిధములయందును భయము కలుగచేయును. గాకను పిత్తరోగభయమును, మృత్యుభయమును, అర్థనాశమును, బంధుద్వేషమును, కార్యహానియు, బుద్ధిభ్రంశమును కలుగచేయును. ఈదోషములన్నియు

పరిహారమై ఆయురారోగ్యములు సిద్ధించుటకై ముఖ్యముగా ఈదానముచేయుట ఉత్తమము విశేషముగా బుధవారము నందు తనయింటియందుగాని దేవాలయము నందుగాని శుద్ధ ప్రదేశమున గోమయముచేత భూమిని శుద్ధిచేసి ముగ్గులు మొదలగునవి పెట్టి బుధప్రతిమను సింహవాహనము మీద కూర్చుండ పెట్టి మల్లె, జాజి, మొదలగు పుష్పములతో పూజించి, పచ్చని వస్త్రములను, ధరింపజేసి, భూషణములచేత నలంకరించి.

ధ్యానం॥ సింహారూఢం చతుర్బాహుం ఖడ్గచర్మగదాధరాః।
ధారయంతం మహాసౌమ్యం ధ్యాయేత్సర్వార్థసిద్ధయే।
ఉద్బుధ్యస్వేతి మంత్రేణ ఉపచారా న్యథాక్రమాత్।
సంపూజ్య ధూపదీపాద్యై ర్ముద్గమిశ్రాన్నకై రపి।
తతో బ్రాహ్మణమాహూయ పీతవస్త్రాదికై రపి।
అభ్యర్చ్య దద్యాత్తద్దానం మంత్రమేతం పఠేన్నరః॥ 17

తా. పైన చెప్పిన ప్రకారముగా ధ్యానముచేసి యథా విధిగా మంత్రములచేత ఉపచారాదులనుచేసి ధూపదీప నైవే ద్యములను సమర్పించి అటుపిమ్మట ఉత్తముడైన బ్రాహ్మణునకు.

మంత్రః॥

శ్లో॥ రుద్రనేత్ర సముద్భూతం రజితంపితృవల్లభం।
తస్మాదస్య ప్రదానేన అతశ్శాంతిం ప్రయచ్ఛమే।
ఇతిదత్వా విధానేన దద్యాద్భక్త్యాచ దక్షిణాం।
అనేన విధినాయస్తు దానమేత త్సమాచరేత్।
సర్వదోష వినిర్ముక్త స్సర్వ బాధావివర్జితః।
రూపసౌభాగ్య సంపన్నో జీవేచ్ఛ శరదాంశతం।
ఇతి హేమాద్రౌ బుధప్రీతికర రజితదానవిధిః॥ 18

తా. పైనచెప్పిన మంత్రపూర్వకముగా దానము చేసి యదావిధిగా దక్షిణ యిచ్చిన యెడల సర్వదోషములు పరిహారమై సకలవిధ కష్టములు తొలగును. ఈ ప్రకారముగా హేమాద్రియందు బుధప్రీతికరముగా రజితదాన విధి చెప్పబడి యున్నది.

రవిదశాయాం కేతుభుక్తౌ కేతుప్రీతికర ఛాగదానం.
యామళే.

శ్లో॥ ద్వితీయ సప్తమస్తేవా తత్స్థా నాదిసంయుతే ।
అపమృత్యు భయంచైవ తీవ్రశూలాద్యాదిభిర్యుతం ।
దుర్గాజపం ప్రకుర్వీత ఛాగదానం తథైవచ ।
మహామృత్యుజపంజప్యంకుర్యాచ్ఛాంతిమవాప్నుయాత్ ।
పూర్వోక్త విధి నజ్ఞయం ఛాగదాన రతోయది ।
రవిదశాయాం శనిభుక్తివత్ ॥ 19

తా. కేతువు ద్వితీయ సప్తములయందున్నను లేక ఆ స్థానాది పతులతో చేరియున్నను అపమృత్యు భయమును. శూలాద్యాది తీవ్రపీడయు సంభవించును అందుకై దుర్గాజపముచేసి ఛాగదాన మియ్యవలెయును. అటుపిమ్మట మహామృత్యుంజయ జపముచేయుటవలన శాంతి కలుగును. రవిదశలో శనిభుక్తికి చెప్పినట్టుగా విధిననుసరించి ఛాగదానము చేయవలెయును.

రవిదశాయాం శుక్రభుక్తౌ శుక్రప్రీతికర శ్వేతధేనుదానం.
హేమాద్రౌ.

శ్లో॥ దుష్టస్థాన స్థితే శుక్రే ధననాశం మహద్భయం ।
స్వదేహ పీడితంచైవ దారాపుత్రవి నాశనం ।
నవ్యత్రకలహం చైవ స్థాననాశం తథైవచ ।

తద్దోషపరిహారార్థం శ్వేత గోదానమాచరేత్ ।
మృత్యుంజయం రుద్రజప్యం కారయేత్పూర్వవత్క్రమాత్ ।
రవిదశాయాం చంద్ర భుక్తివత్ ॥ 20

తా. దుష్టస్థానముల యందున్న శుక్రుడు ధననాశమును, విశేషభయమును దేహబాధయు భార్యాపుత్ర వినాశనంబును ఎల్లచోట్లను కలహమును స్థాననాశనంబును కలుగచేయును. ఆ దోషపరిహారార్థమై సూర్యదశలో చంద్ర భుక్తి యందు చెప్పినట్లు యథావిధిగా తెల్లనిగోవును దానమిచ్చి మృత్యుంజయ జపమును రుద్రజపమును పూర్వము చెప్పిన రీతిగా చేయవలెయును.

చంద్ర దశాయాం చంద్రప్రీతికర రజితపద్మదానం.

యామశే.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామి చంద్రప్రీతికరం పరం ।
రూప్యపద్మ మితిఖ్యాతం దానముష్ట ఫలంకృతం ।
బలహీనో యదాచంద్రః ద్వాదశాష్టమ జన్మగాత్ ।
తదాదానం ప్రకుర్వీత గ్రహదోషేపివాపునః ॥
సోమవారే విశేషేణ దేవాగారే గృహేథవా ।
గోమయేనో పలిప్యోర్వ్యాం ద్రోణం ద్రోణార్థ మేవవా ।
కృత్వారాశిం తండులైస్తు తత్రపద్మంవినిక్షిపేచ ।
రజితేన యథారూపం నిర్మితం వసుపత్రకం ।
శ్వేతవస్త్రేణ సంవేష్ట్య ధ్యాయేద్దేవం విచక్షణః ।
గదా వరధరంచేవం శ్వేతవర్ణం శశాకరం ।
ధ్యాయేదమృత సంభూతం సర్వకామ ఫలప్రదం ।
ధ్యాత్వాసోమో ధేనుమితి మంత్రేణా ధనమర్చయేత్ ।
శ్రీచందన శ్వేత గంధకర వీరాంబు జైరపి ।

మౌక్తికాభరణం దత్వాథాష్ట పత్రేషు పూజయేత్ ।
సోమోనిశాకర శ్చంద్రః క్షీరోదార్ణవ సంభవః ।
అతిగోత్రసముద్భూత స్తారకేశ స్తథైవచ ।
సుధామూర్తిశ్చైవ ధీనాం ప్రాణరూపిత నామభిః ।
సంపూజ్యధూప దీపౌచ దత్వా పాయసముత్తమం ।
నివేద్యవి ప్రమాహూయ శ్వేతవస్త్రేణ పూజయేత్ ।
శ్వేతపుష్పాది భిశ్చైవ దద్యాన్మంత్ర మిమంపఠన్ ॥

మంత్రః॥

శ్లో॥ తండులోపరివిన్యస్త చంద్రమూర్తిం దదామ్యహం ।
ఆయుశ్శ్రీస్సుత సంపత్తిం సదాశాంతిం ప్రయచ్ఛతు ।
ఇతిదత్వా విధానేన దక్షిణా శక్తితోదదేత్ ।
అనేన విధినాయస్తు చంద్రప్రీతికరంపరం ।
పద్మదానంతు కురుతేన సర్వభయవర్జితః ।
రూపవాన్ ధనవాన్ వాగ్మీ పుత్రపౌత్ర సమన్వితః ।
ఇహభుక్త్వాఖిలాన్ భోగా నంతే చంద్రపురంవ్రజేత్ ।
ఇతియామళే చంద్రప్రీతికర రజిత పద్మదానవిధిః ॥ 21

తా. చంద్రదశయందు చంద్రప్రీతికరముగా చంద్రుని యొక్క క్రూరకాలములయందు అనగా చంద్రుడు బలహీనుడై ద్వాదశాష్టమ జన్మరాసులయందు సంచరించునపుడు వెండి పద్మదానము చేయవలెయును. అదెట్లనిన సోమవారమునందు యింటియందుగాని లేక దేవాలయమునందుగాని శుభ్రమైన భూప్రదేశమును గోమయముచేత నలికి అందు బియ్యపురాశిచేసి దానిమీద వెండిపద్మమును పెట్టి తెల్లని వస్త్రమును చుట్టి శ్వేతవస్త్రము ధరింపజేసి తెల్లని గంధపుష్పాదులచేత చంద్రునిపూజించి దక్షిణ సహితము యథావిధిగా మంత్ర

యుక్తముగా బ్రాహ్మణోత్తమునకు దానముచేయుట వలన చంద్రునివల్ల కలిగిన అనిష్టములు పరిహారమగును. అదియును గాక రూపవంతుడును, ధనవంతుడును, పుత్రపౌత్రాభివృద్ధి గలవాడును, యగును. మరియు ఇహాలోక సుఖభోగముల నన్నిటిని యనుభవించిన పిదప చంద్రలోకము చేరును. ఇట్లుయామళగ్రంథమునందు చంద్రప్రీతికరముగా వెండి పద్మదానవిధి చెప్పబడియున్నది

చంద్రదశాయాం చంద్రభుక్తౌ చంద్రప్రీతికర శ్వేతగోదానం. యామళతంత్రే.

శ్లో॥ షష్ఠాష్టవ్యయరాశిస్థే ధనద్యూనగతో శశీ ।
తత్కాలే ధననాశస్స్యాత్ స్థానభ్రంశం మనోవ్యథా ।
దేహాయాసం మనస్తాపం శీతజ్వర భయంతథా ।
నేత్రరోగంమూత్ర కృఛ్రం జలగండంతథైవచ ।
తద్దోష పరిహారార్థం శ్వేతధేనుం ప్రదాపయేత్ ।
అథవామహిషీం దద్యా న్మృత్యుంజయ జపంచరేత్ ।
పశ్చాత్సౌఖ్య మవాప్నోతి పూర్వోక్తం విధిచోదితాత్ ॥
రవిదశాయాం చంద్రభుక్తివత్ । 22

తా. చంద్రుడు షష్ఠాష్టమ వ్యయరాసులయందు గాని లేక ద్వితీయ సప్తమముల యందుగాని యుండగా ఆకాలమందు ధననాశమును, స్థానభ్రంశమును మనోవ్యథయును దేహాయాసమును మనస్తాపమును శీతజ్వర భయమును నేత్రరోగమును మూత్ర కృఛ్రవ్యాధి సంభవమును జలగండమును సంభవించును. ఆదోషపరిహారార్థమై తెల్లనిఆవును బ్రాహ్మణునకు యథావిధిగా దానమియ్యవలయును. లేక మహిషిదానంబు నైనను యియ్యవలెయును. మృత్యుంజయ జపముకూడ నాచ

రించవలయును. అటు పిమ్మట సౌఖ్యము కలుగు పూర్వమందు రవిదశలో చంద్రభుక్తి యందు చెప్పిన రీతిగా దానవిధి ననుసరించ వలెయును.

చంద్రదశాయాం కుజభుక్తౌ కుజప్రీతికర నాగదానం.

బోధాయనోక్త నాగదాన విధిః.

శ్లో॥ విధోరంతర్గతే భౌమే షష్ఠాష్ట వ్యయ రాశిగే।
లగ్నాద్వాచంద్ర లగ్నాద్వా ద్వితీయే సప్తమేపివా।
పాపగ్రహాయుతే దృష్టే సంతాపం దేహపీడనం।
జ్వరాతి సారరోగాది విసర్పిరోగ సంభవం।
ధననాశం భ్రాతృనాశ మపమృత్యుభయం తథా।
తద్దోష శమనార్థాయనాగదానంచ కారయేత్॥ 23

తా. చంద్రదశలో అంగారకుని భుక్తియందు అంగారకుడు 6-8-12 రాసులయందున్నను లేక జన్మ లగ్నమునుండిగాని అథవాచంద్ర లగ్నము నుండిగాని ద్వితీయ సప్తమరాసులయందున్నను లేక పాపగ్రహ సంబంధముగాని వీక్షణగాని కలిగియున్నను ఆ కాలమందు సంతాపమును, దేహపీడయు జ్వరము అతిసారము మొదలగు రోగభయమును, విసర్పి రోగోపద్రవంబును ధననాశంబును భ్రాతృనాశంబును అపమృత్యు భయమును కలుగును. ఆదోష పరిహారార్థమై నాగదానము చేయవలెయును. అదెట్లనిన

నాగదాన విధిః.

శ్లో॥ ఏతద్దానంచి క్షీరయనాది పుణ్యకాలేషువా।
ఉపద్రవకాలేవా॥
దేవాలయాది పుణ్యస్థలేషు వాస్వగృహేవా।
గోమయానులే పితరంగవల్యాది రచితభూభాగో।

పరిపలాష్టక పరిమిత తామ్రపాత్రంనిధాయ ।
తస్మిన్‌పలపరిమితేన వానువర్ణేన ।
ఫలపంచక సంయుతం నాగంకార యిత్వా ।
పంచఫణాసు పంచరత్నాని నిధాయ ।
పుచ్ఛేపద్మరాగం విన్యస్యముఖతో లోచన ।
ద్వయేచరత్నత్రయం విన్యస్య కుంకుమేన ।
సర్వాంగమాలిప్య రక్తేనవాససా సంవేష్ట్య ।
ఏవంరచయిత్వాదాన సంకల్పం కుర్యాత్ ॥ 24

తా. అయనాది పుణ్యకాలముల యందును అంగారకుడు క్రూరుడై ఉపద్రవములను కలుగచేయునట్టి కాలముల యందును, దేవాలయాది పుణ్యస్థలముల యందుగాని లేకతన యింటి యందుగాని గోమయముచేత భూమిని అలికి ముగ్గులు పెట్టి శుద్ధి చేసి ధాన్యరాశిమీద ఎనిమిది పలముల తాంబ్ర కలశమునందు ఒక పలము బంగారు నాగ ప్రతిమ నుంచి రత్నాదుల చేత నలంకరించి ఎఱ్ఱని వస్త్రమును చుట్టి యథా విధిగా దాన సంకల్పము చేయవలెయును అదెట్లనిన:—

శ్లో॥ ఏవంగుణేత్యాదిమమ ఇహజన్మని జన్మాంతరేషు ।
సర్వాలంకారబాలక వధాభరణాది సంగ్రహ దోషేణ ।
విసర్పరోగనిదాన భూతానాం ।
సర్వేషాంపాపానాం సంక్షయద్వారా శరీరే ।
వర్తమానవిసర్పి రోగాది సర్వరోగ ।
నివృత్త్యర్థం అరోగదృఢకాయత యాశతవర్ష ।
జీవిత్వ సిద్ధ్యర్థం సర్వదేవతా ప్రీత్యర్థం ।
బోధాయనోక్తప్రకారేణ నాగదానం కరిష్యేతిసంకల్ప్య ।

తదంగ సర్పపూజాం కలశస్థాపనంచ ।
కర్తుమాచార్యం వృణుయాత్ ॥ 25

ఈప్రకారము సర్వదేవతా ప్రీతి కొఱకై బోధాయనోక్త ప్రకారముగా నాగదాన మిచ్చుటకుగాను సంకల్పము చేసి దానికి అంగముగానున్న సర్పపూజయు కలశస్థాపనయు చేసి ఆచార్యపూజ చేయువలసినది.

అనంతర మాచార్యః పూజాస్థానం గత్వా దేశకాలాసంకీర్త్య యజమానచికీర్షిత నాగదానాంగ నాగపూజాం వారుణ పూజాం హోమంచకరిష్య ఇతి సంకల్ప్య ॥

నమోఅస్తు సర్పేభ్య ఇతి మంత్రేణ కుంకుమగంధా దిభి ష్షోడశోపచార పూజాం కృత్వా పూజా స్థానస్య పశ్చిమ భాగే స్థండి లేగ్నిం ప్రతిష్ఠాప్య ॥

తదుత్తరతః కలశతీర్థోదక పూరిత ధాన్యోపరి ప్రతిష్ఠాప్య కలశారాధన ప్రకారేణ సర్వంకృత్వా । తస్మిన్వరుణమావాహ్య । అవతేహేళయితిమంత్రేణ కుంకుమగంధాదిభి ష్షోడశోపచారైస్సం పూజ్యకృత్వా పూజాస్థానస్య పశ్చిమ భాగే స్థండిలేగ్నిం ప్రతిష్ఠాప్యతదుత్తరతః కలశతీర్థోదక పూరితం ధాన్యోపరి ప్రతిష్ఠాప్య పునరగ్నే ప్రత్యగాసీనం పాత్ర సాధనాని చతుష్యంతం కర్మ కృత్వా ॥
నమోఅస్తు సర్పేభ్య ఇతిపాలాశ సమిద్ధోమం ।
యా ఇషవోయాతు ధానానామితి ఆజ్యహోమః ।
యెదోరోచనోదివీతి మంత్రేణ తిలహోమశ్చ ।
ప్రత్యేకమష్టోత్తర శతసంఖ్యయాకృత్వా ।
స్విష్టకృతాది హోమశేషం సమాప్య ।
ఆచార్యః యజమానం భద్రపీఠే ఉపవిశ్య ।

ఆజ్యాహుతి సంపాతాజ్యేన సర్పరాజాం।
ఋగ్భిర్యాభిః ర్యాభమ్నాదిభి మంత్రైః అంగాన్యాలిప్య।
సుగంధగుగ్గులు ధూపేణ ధూపయిత్వా।
కలశోదకేన ఔదుంబరశాఖయానమో అస్తు।
సర్పేభ్య ఇత్యాది సర్ప ప్రకాశ మంత్రైః।
హిరణ్యవర్ణా శ్శుచయ ఇత్యాదిభిః పవమానాను వాక్యేన।
ఆపోహిష్ఠాదిభిశ్చ మార్జయిత్వా।
వస్త్రేణ సముద్ధృత్య అగరుచందనే నానులిప్యేత్।
అనంతరం యజమానః అభిషేక పుతానివస్త్రాణి పరిహృత్య।
శుక్లాంబరగంధమాల్య ధరో గృహీత కుసుమాం।
జలిస్తు సర్పంత్రిః ప్రదక్షిణీకృత సంపూజ్య।
అచార్యం వస్త్రాంగులీయ్య కర్ణాభరణాద్యై।
రభ్యస్చ్య దద్యాద్దాన మంత్రః॥
యోగత్తే పృథివీకృత్స్నం సశైలవనకాననాం।
క్షీరాబ్ధాయస్య శయ్యాచ వాసు దేవస్యశార్ఙ్గిణః।
స్వేతదానేన శేగో సౌతుష్టోవ్యాధిం వ్యపోహతు।
తైస్సర్పిక వికారంతు తద్దోష జనితంతథా।
రక్తరేతో ద్భవం వాపి మాతృతః పితృత స్తథా।
అంగప్రత్యం గజం సర్వం వికారం మేవ్యపోహతు।
ఆస్తైఅహం ఇమాంభూ భాగోపరివిన్యస్త।
సర్వాలంకార సహితనాగం మమ పూర్వోక్త।
ఫలకామస్తుభ్య మిదంసంప్రద దేనమమేతిదత్వా।
దానసాద్గుణ్యార్థం శక్త్యా దక్షిణాందత్వా।
స్వశక్త్యా బ్రాహ్మణాన్ భోజయిత్వా।
ఇతిబోధాయనోక్త నాగదాన పద్ధతిః॥

తా. పైచెప్పిన ప్రకారము రక్త గంధాక్షాదులచేత భోదాయన రీతిగా పూజచేసి తిలహోమాదులను రచించి కలశోదకముచేత యజమానునికి మంత్రాభిషేకముచేసి ఆచార్యుని పూజించి దక్షిణసహితముగా కలశవస్త్ర ప్రతిమాదానముచేసి తనశక్తికొలది బ్రాహ్మణ సంతర్పణచేసి ఆశీర్వాదమును పొందిన యెడల సర్వపీడయు నశించును. ఇట్లు భోధాయన వచనము.

చంద్రదశాయాం రాహుభుక్తౌ రాహుప్రీతికర ఛాగదానం.

యామళే.

శ్లో॥ విధోరంతర్గతేరాహౌ ద్వితీయ్యే లాభగేపివా ।
ద్యూనేవా విత్తగేవాపి తృతీయ్యే చాష్టమేపివా ।
వ్యయేవా నీచరాశౌవా పాపగ్రహయుతేపివా ।
తత్కాలే పుత్రమరణం భూమా నిర్వీర్యచేతసః ।
స్థానచ్యుతి మవాప్నోతి సర్పవృశ్చిక పీడనం ।
రక్తస్రావం మూత్రరోగం స్త్రీవివాదం ధనక్షయం ।
తద్దోషశమనార్థాయ ఛాగదానం యథావిధి ।
అథదానం ప్రవక్ష్యామి సర్వపాపహరం శుభం ।
మహాభయాపహం నిత్యం దుష్టగ్రహభయాపహం ।
ఛాగదాన మితిఖ్యాతం సర్వసంపత్ప్రదాయకం ।
రవిదశాయాం శనిభుక్తివత్॥ 27

తా. చంద్రదశలో రాహుభుక్తియందు రాహువు ద్వితీయ లాభముల యందున్నను, సప్తమ నవమముల యందున్నను, తృతీయ అష్టమ రాసులయందున్నను లేక వ్యయరాశి యందున్నను, తన నీచరాశియందున్నను, పాపగ్రహములతో కూడియున్నను ఆకాలమందు పుత్రమరణంబును, స్థానభ్రంశ

మును, సర్పవృశ్చికాది విషజంతుభయమును, రక్తస్రావమును, మూత్రరోగమును, స్త్రీద్వేషమును, ధనక్షయమును, కలుగును. ఈదోషపరిహారార్థమై యథావిధిగా ఛాగదానము చేయవలసినది. అట్లు చేయుటవలన సర్వవిధ పాపములు నాశనమై శుభము కలుగును. సకలవిధ సంపత్తును యిచ్చునది యగును. రవిదశలో శనిభుక్తికి చెప్పిన విధిప్రకారముగనే ఇచ్చుట ఛాగదానవిధి ననుసరించ వలసినది.

చంద్రదశాయాం గురుభుక్తౌ గురుప్రీతికర దుర్గాదానం.

శ్లో॥ విధోరంతర్గతే జీవే దుష్టస్థానగతేపివా ।
తత్కాలే గృహనాశంచ ధననాశం మనోవ్యథా ।
దాయాది కలహంచైవ గర్భస్రావం తథైవచ ।
సీతజ్వరేణాప మృత్యుభయం శత్రుభయంతథా ।
తద్దోషశమనార్థాయ దుర్గాదానం ప్రశస్యతే॥ 28

తా. చంద్రదశలో గురు అంతగమునందు గురువు దుష్టస్థానములను పొందియున్న యెడల ఆకాలమందు గృహనాశమును, ధననాశమును, మనోవ్యథయును, దాయాదిజనులతోడ కలహమును, గర్భస్రావమును, సీతజ్వరమువల్ల అపమృత్యువును, శత్రుభయమును, కలుగును. ఆదోషపరిహారార్థమై దుర్గాదానము చేయుట ఉత్తమము.

శ్లో॥ అథవక్ష్యే భయహర దుర్గా దానం మహత్తరం ।
సర్వపాపహరం నృణాం సర్వమంగళ దాయకం ।
మహాశత్రు మహావ్యాధి మహామృత్యు భయావహం ।
పరకృత్యం మంత్ర యంత్ర సంభూతా నిష్టనాశనం ।
భౌమాంతక్ష దివ్యాఖ్య త్రివిధోత్పాత పాపహం ।
దుష్టస్థానస్థ గ్రహోద్భూత సర్వపీడా హారక్షమం ।

సర్వదుర్గతు సంహార కారకం వైరినాశనం।
అష్టమ్యాంవా నవమ్యాంవా చతుర్దశ్యామథాపివా।
భానుభార్గవ భౌమానాం వారేషు మునిపుంగవ।
దేవాలయే గృహేవాపి గోమయాలే పితస్థలే।
వ్రీహిరాశిం వినిక్షిప్య యథాసంభవ మాత్రతః।
చతురశ్రం తతఃకృత్వా నవకోష్ఠాని సంలిఖేత్।
మధ్యకోష్ఠే రక్తవస్త్రం ప్రసార్య తదుపర్యథ।
పలత్రయప్రమాణేన రజితేన వినిర్మితం।
సర్వలక్షణ సంయుక్త మహిషం వినివేశ్యచ।
తత్రస్వర్ణమయీందుర్గాం పలత్రిద్వేక మానతః।
కృత్వావిధాయ రక్తేన వస్త్రేణా వేష్ట్య పూజయేత్।
ఖడ్గత్రి శూలపాణించ వరదా భయసంయుతాం।
హారగ్రైవేయమకుట రత్నతాటంక భూషితాం।
దివ్యాంబరావృతాం దేవీం మహిషోపరి సంస్థితాం।
ఏవంధ్యాత్వా మగ్నివర్ణా మితి సంపూజయేత్క్రమాత్।
పంచామృతైశ్చ గంధైశ్చ కుంకుమాక్తై స్సుపుష్పకైః।
ధూపైర్దీపైశ్చనైవేద్యై శ్శర్కరా పరమాన్నకైః।
ఏవంసంపూజ్య ప్రాక్కోష్ఠే జాతవేదసమంత్రతః।
బ్రాహ్మీమాజ్య జుష్టాద్యైః పూజయేదిష్టసిద్ధయే।
గౌరీమిమాయేతి చత్వాగ్నేయా మాహేశ్వరీంయజేత్।
కాత్యాయనేతి మంత్రేణ కౌమారీం యమకోష్టకే।
విష్ణోరరాట మంత్రేణ నైరుత్యే వైష్ణవీంయజేత్।
ఘృతవాజిత మంత్రేణ వారాహీం పశ్చిమేతథా।
వాయవ్యకోష్ఠే చేంద్రాణి మింద్రాణీ మాసునేతిచ।
చాముండీముత్తరేకోష్ఠే హ్యాగ్నేత్వం పారయేతిచ।

గంధద్వారేతి చైశాన్య కోష్ఠే లక్ష్మీం ప్రపూజయేత్ ।
ఏవం బ్రహ్మాద్యష్ట శక్తీస్సమభ్యర్చ్యోపచారకైః ।
తతో బ్రాహ్మణమాహూయ దైవజ్ఞం మంత్రకోవిదం ।
రక్తవస్త్రాదిభిః రక్తగంధ పుష్పాక్షతాదిభిః ।
సంపూజ్య దద్యాత్తాం దేవీం మంత్రమేనం సముచ్చరన్ ॥

తా॥ దుర్గాప్రతిమను బంగారముతో చేసి కృష్ణాష్టమి, మంగళవారము మొదలగు క్రూర సమయముల యందు కలశ స్థాపన చేసి రక్త వస్త్రాదుల చేత నలంకరించి ఖడ్గ త్రిశూలవర దాభయ హస్తురాలైన మూడు పలముల సువర్ణదుర్గా ప్రతిమను మహిషీ వాహనము మీఁద చండీవిధాన ప్రకారముగా పూజచేసి నూరువరహాల అధిక దక్షిణ యిచ్చి యోగ్యుడైన బ్రాహ్మణునికి రక్తవస్త్రాదులను గంధపుష్పాక్షతాదులను ఇచ్చి పూజించి అటుపిమ్మట.

మంత్రః.

శ్లో॥ మహిషాసురి సంస్థాత్వాం దద్యామాయుష్య వర్ధయే ।
సమస్త దోషనిర్ముక్తి మభయంకురుశంకరి ।
ఇతి దత్వావిధానేన దానసాద్గుణ్య సిద్ధయే ।
దక్షిణాం శతనిష్కంచ తదర్ధంవా తదర్ధకం ।
దద్యాద్విత్తాను సారేణ తతో హీనం నకారయేత్ ।
ఏవంయః కురుతేదుర్గం దానం భయనివారకం ।
ససర్వశత్రూన్ సమరే విజిత్య భయవర్జితః ।
రూపసౌభాగ్య సంపన్నః పుత్రపౌత్రాదిభిర్వృతః ।
అకంటకాం మహీంలబ్ధ్వా భుక్త్వాభోగాన్యధేప్సితాన్ ।
అపమృత్యుహరం చైవ సర్వరోగాన్వినశ్యతి ।
ఇతియామళే దుర్గాదానవిధిః ॥

తా. పైనవివరించినట్లు మంత్ర పూర్వకముగా దుర్గా ప్రతిమదానము యిచ్చినయెడల భయ నివారణయును, యుద్ధమునందు సర్వశత్రు జయమును రూపసౌభాగ్య సంపన్నులగు పుత్రపౌత్రాభి వృద్ధియు మితిలేని ఐశ్వర్య లాభమును విశేష భోగభాగ్యములును, అపమృత్యు పరిహారమును సర్వరోగనాశమును కలుగును. ఈప్రకారముగా యామళ గ్రంథమునందు దుర్గాదానవిధి చెప్పబడి యున్నది.

చంద్రదశాయాం శనిభుక్తౌ శనిప్రీతికర మహిషీదానం.

జ్యోతిషార్ణవే.

శ్లో॥ విధోరంతర్గతేమందే దుస్థానాధిప సంయుతే।
నీచేవా స్తంగతేవాపి దుష్టస్థాన స్థితేపివా।
సమానజననాశంచ చతుష్పాజ్జీవనాశనం।
కలహం రాజనిష్ఠూరం దేహపీడా ధనవ్యయం।
తద్దోషహరణార్థాయ మహిషీదాన మాచరేత్ ।
పశ్చాత్సౌఖ్య మవాప్నోతి పూర్వోక్తం విధిచోదితం।
రవిదశాయాం రాహుభుక్తివత్॥ 31

తా. చంద్రదశలో శనిభుక్తియందు శని దుస్థానాధిపతులతో కలిసియున్నను, నీచుడైనను, అస్తంగతుడైనను, లేక దుష్టస్థానములను పొందియున్నను ఆకాలమందు సమానజననాశనంబును, చతుష్పాజ్జీవనాశనంబును, కలహమును, రాజనిష్ఠూరమును, దేహపీడయు, ధనవ్యయమును కలుగును. ఆదోషపరిహారార్థమై మహిషీదాన మియ్యవలెయును. అటుపిమ్మట సౌఖ్యముసిద్ధించును. పూర్వము రవిదశలో రాహుభుక్తియందు చెప్పిన ప్రకారము మహిషీదానవిధి ననుసరించవలయును.

{ చంద్రదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర లక్ష్మీనారాయణ దానం. }

విష్ణుయామళే.

శ్లో॥ విధోరంతర్గతే సౌమ్యే షష్టస్థాన స్థితోయది।
తత్కాలే బంధునాశంచ మిత్రవర్గవిరోధకృత్।
స్వవారే రాజకోపంచ దారాపుత్రాది పీడనం।
పైత్యజ్వరాది సంభూత మపమృత్యు భయంతథా।
లక్ష్మీనారాయణద్దానం కృతేనాయుష్య వర్ధనం।
సర్వకామ ప్రదంన్నాణాం సర్వత్రవిజయావహం।
సర్వశత్రుక్షయకరం నరకోత్తారకారకం।
యమబాధాపహారణం విష్ణుసాయుజ్యకారణం।
సువర్ణై ర్దశభిస్సుద్యక్తుల యావా ప్రయత్నతః।
గోమయేనో పలిప్యాథ చతురశ్రంసమంతతః।
తండులై ర్దశభిః ప్రస్థైః మండలంకారయే త్తతః।
తన్మధ్యేష్టదళంపద్మం చందనేన లిఖే త్తతః।
తస్యోపరిన్యసేత్కుంభం గోక్షీరేణ ప్రపూరితం।
పక్వంబింబ సమాకారం కృష్ణమండల వర్జితం।
ద్వాత్రింశ త్ప్రస్థమానంతు పూర్ణకుంభం తదుచ్యతే।
గరుడోపలవైడూర్యే ప్రవాళంమౌక్తికం తథా।
పద్మరాగం సువర్ణంచ క్షీరమధ్యే వినిక్షిపేత్।
రక్తవస్త్రేణసంవేష్ట్య గంధపుష్పాక్షతాదిభిః।
అర్చయిత్వాథ తులసీ విష్ణుక్రాంతా విశేషతః।
కుంభస్యో పరికౌశేయం న్యసే ద్వస్త్రంవిచక్షణః।
కుంకుమేన లిఖేత్పద్మం దళ ద్వాదశసంయుతం।

ఈశానాది దళేష్వేతాన్ కేశవాదీన్ ప్రపూజయేత్ ।
కుంభస్య పశ్చిమే భాగే పంచధాన్యాని విన్యపేత్ ।
యవప్రీహించ గాధూమ ముద్గమాషాం స్తథైవచ ।
తామ్రపాత్రన్యసే త్తత్ర జలపూర్ణం విచక్షణం ।
దేవంసంస్థాప్య తన్మధ్యే పశ్చాత్పంచామృతైఃపృథక్ ।
స్నాప్య నారాయణం దేవం సదాలక్ష్మీ సమన్వితం ।
ప్రాణప్రతిష్ఠాం కృత్వాథ కుంభస్యో పరివిన్యసేత్ ।
పీతవస్త్రద్వయేనాథ పరిదానం ప్రకల్పయేత్ ।
గంధపుష్పం తతో ధూపం దీపందత్వాథ మంత్రవిత్ ।
అష్టోత్తరశతంనామ్నాం రాఘవస్య మహాత్మనః ।
అపామార్జనమన్యచ్చ విష్ణుసంకీర్తనంపరం ।
వాచయిత్వాథ తేభ్యోపి దత్వాసద్య స్సుదక్షిణాం ।
శ్రోత్రియం విప్రమాహూయ దరిద్రంచ కుటుంబినం ।
పాదప్రక్షాళనం కృత్వా కుర్యా దాచమనక్రియాం ।
ఆసనంకల్పయిత్వాథ విశుద్ధం రత్నకంబళం ।
ఉపవేశ్యచ తన్మధ్యే ప్రాఙ్ముఖం వాప్యదఙ్ముఖం ।
అంగుళీయ్యక వస్త్రాద్యైః కర్ణాభరణసంయుతైః ।
అలంకృత్వాథ విప్రేంద్ర సర్చయిత్వా యథావిధి ।
దద్యాదనేన మంత్రేణ లక్ష్మీనారాయణం విభుం ।
లక్ష్మీరమణ దేవేశ సర్వాభీష్ట ఫలప్రద ।
దానేనానేన సుప్రీతః ప్రయచ్ఛను మవాంఛితం ।
దానప్రతిష్ఠాసిద్ధ్యర్థం తదర్ధం దక్షిణామతా ।
ఉక్తమార్గేణచేద్దాన మనంత ఫలదాయకం ।
భూరిదానంచ విప్రేభ్య స్తథాకుర్యా త్స్వశక్తితః ।
బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాద్భోక్తవ్యం స్వస్థమానసైః ॥

లక్ష్మీనారాయణం దానం కరిష్యంతిచ యోనరః ।
అభిచారాది సర్వాణి స్థావరాదీని సర్వశః ।
నశ్యంతి సకలాన్ దోషాన్ సత్యంవిష్ణో ప్రసాదతః ।
నచాగ్నేర్నాపి శస్త్రేభ్యో నజలేభ్య స్సమంతతః ।
నజ్వరాచ్చపి పాపాయాః నాస్తిభీతిః కదాచన ।
భవేద్వర్ష శతం సాగ్ర మపమృత్యు వివర్జితః ।
మంత్రయంత్రాది కర్మాణి లూతాదిస్ఫోటకాదయః ।
విషాణిచాప్య నేకాని నశ్య త్యేవనసంశయః॥
ఇతి లక్ష్మీనారాయణ దానవిధిః॥ 32

తా. చంద్రదశాకాలమందు భుక్తినాథుడగు బుధుడు షష్ఠరాశియందున్న యెడల ఆకాలమందు బంధునాశనమును, మిత్రులతోడ విరోధమును, తనవారమునందు రాజకోపమును, భార్యాపుత్రాదిపీడయు, పైత్యజ్వరాది సంభవమును అపమృత్యుభయమును కలుగును. అందుకై లక్ష్మీనారాయణ దానముచేయవలయును. అందువలన ఆయుర్వృద్ధియు, ఇష్టకామమోక్ష ఫలపురుషార్థసిద్ధియు, ఎల్లచోట్లను విజయమును, సర్వశత్రునాశమును, యమబాధా పరిహారమును, విష్ణుసాయుజ్య పదవియును, కలుగును. శుద్ధకాల దేశములయందు శుచిర్భూతుడై పదిపలముల బంగారుతో లక్ష్మీనారాయణ ప్రతిమను చేయించి పదితూముల పెసలు రాశిచేసి అందుపై ఎనిమిది తూముల పాలుతో నిండిన కుంభమునుపెట్టి దానిలో ఈప్రతిమనుపెట్టి మహావిధానప్రకారముగా తులసీపూజచేసి హోమానంతరం భక్తితోడ వైష్ణవ బ్రాహ్మణోత్తమునకు దానమిచ్చి బ్రాహ్మణసంతర్పణచేసిన యెడల విష్ణువుయొక్క అనుగ్రహము వల్ల నిశ్చయముగా సకలవిధ దోషములు నశించును. మరియు

ఇష్టసిద్ధిలభించును. ఈప్రకారముగా విష్ణుయామిళ గ్రంథము నందు లక్ష్మీనారాయణ దానవిధి చెప్పబడియున్నది.

చంద్రదశాయాం కేతుభుక్తి ప్రీతికర ఛాగదానం.

శ్లో॥ విధోరంతర్గతే కేతౌ దుష్టస్థానస్థితో యది ।
తత్కాలే శత్రుభీతిశ్చ ధననాశకరో భవేత్ ।
కారాగృహ ప్రవేశశ్చ తద్భుక్తౌ మరణంధ్రువం ।
ఛాగదానం ప్రకుర్వీ సర్వసంపత్ప్రదాయకం ।
రోగశాంతప్రదం నృణా మాయురారోగ్యదాయకం ।
యామళోక్తప్రకారేణ విధిం వివివదాచర ।
రవిదశాయాం శనిభుక్తివత్ ॥ 33

తా. చంద్రదశలో కేతుభుక్తియందు కేతువు దుష్ట స్థానములయందున్న యెడల ఆకాలమందు శత్రుభయమును, ధననాశమును, కారాగృహప్రవేశమును, నిశ్చయముగా మరణ మును కలుగును. ఆదోషపరిహారార్థమై ఛాగదానముచేసిన యెడల సకలవిధ సంపత్తును లభించును. రోగనివారణయగును. ఆయురారోగ్యాభి వృద్ధికలుగును. యామళగ్రంథమునందు రవిదశలో శనిభుక్తియందు చెప్పియుండు విధి ననుసరించి ఛాగదానము చేయవలయును.

చంద్రదశాయాం శుక్రభుక్తిప్రీతికర మహిషీదానం.

శ్లో॥ చంద్రస్యాంతర్గతే శుక్రే షష్ఠాష్టమ వ్యయరాశిగే ।
తద్భుక్తౌ దేహతాపశ్చ శత్రుబాధా భవిష్యతి ।
తద్దోష పరిహారార్థం రుద్రజప్యంతు కారయేత్ ।
శ్వేతాంగాంమహిషీందద్యాచ్ఛాంతిమాప్నోత్యసంశయః।
యామళోక్త ప్రకారేణ మహిషీదాన మాచరేత్ ।
రవిదశాయాం రాహుభుక్తివత్ ॥ 34

తా. చంద్రదశలో శుక్రభుక్తి యందు శుక్రుడు 6-8-12 రాసులను పొందియున్న యెడల ఆ భుక్తియందు దేహతాపమును శత్రుబాధయు సంభవించును. ఆదోషపరిహారార్థమై రుద్రజపము చేయువలెయును. తెల్లని మహిషిదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతి కలుగును. యామళోక్త రీతిగా సూర్యదశలో రాహుభుక్తి యందు చెప్పినప్రకారముగా మహిషీదాన విధి ననుసరించ వలసినది.

చంద్రదశాయాం రవిభుక్తి ప్రీతికర దుర్గాదానం.

సంహితార్ణవే.

శ్లో॥ విధోరంతర్గతే సూర్యే ద్వితీయ ద్యూనరాశిగే।
పాపగ్రహేణ సంయుక్తే బలహీనే తథాపివా।
గుల్మక్షయాదిరోగైశ్చ హ్యతిసారాది పీడనం।
నృపచోరాగ్ని భీతిశ్చ జ్వరరోగాది సంభవః।
తద్దోషపరిహారార్థం దుర్గాదానం చకారయేత్ ।
యామళోక్త ప్రకారేణ విధింవిధి వదాచర।
చంద్రదశాయాం గురుభుక్తివత్ ॥ 35

తా. చంద్రదశలో రవిభుక్తియందు సూర్యుడు ద్వితీయ సప్తమరాసుల యందున్నను పాపగ్రహములతో కూడియున్నను లేక బలహీనుడైనను ఆకాలమందు గుల్మక్షయాది రోగసంభవమును అతిసారాదిపీడయు రాజభీతియు అగ్నిభయమును చోరపీడయు జ్వరరోగాది ప్రాప్తియు సంభవించును. ఆదోషపరిహారార్థమై దుర్గాదానము చేయవలెయును. యామళోక్త రీతిగా చంద్రదశా గురుభుక్తి యందు చెప్పిన విధమున దుర్గాదాన విధిననుసరించ వలెయును.

కుజదశాయాం కుజప్రీతికర తామ్రపద్మదానం.

యామళే.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామి తామ్ర పద్మ సమాహ్వయం।
అంగారక ప్రీతికరం దానానా ముత్తమోత్తమం।
దుష్టస్థానస్థితః క్రూరః కుర్యాదంగార కోవ్రణం।
మానహానిం ద్రవ్యహానిం స్థానహానిం కుజస్తథా।
రాజామాత్యభయంచైవ పిశునోద్రవాదికం।
దారిద్ర్య దుఃఖక్లేశాదీ౯ తస్మాత్ త్తన్నివర్తయే।
ఆయురారోగ్య సిధ్యర్థం కర్తవ్యం దానముత్తమం।
జన్మర్క్షే గ్రహయోగేవాతథారిక్త తిథావపి।
భౌమవారే విశేషేణ గృహేదేవాలయేపివా।
గోమయేనోపలిప్యోర్వీం రంగవల్లీం విరచ్యచ।
కృత్వాథతు వరీరాశి మాఢక ప్రమితం శుభం।
ఏకవింశద్దళోపేతం తామ్రపద్మం సకర్ణికం।
పలమాత్రసువర్ణేన నిర్మితం లక్షణాన్వితం।
రక్తమాల్యాం బరధర శ్శక్తి శూలగదాధరః।
చతుర్భుజో మేషగతో వరదస్సార్థరానుతః।
నిధాయరక్త వస్త్రేణ సంవేష్ట్య ధ్యానమాచరేత్ ॥ 56

అంగారక ప్రీతికరముగా.

తా. అన్ని దానముల యందును తామ్ర పద్మదానము అధిక యుత్తమమైనది. అంగారకుడు దుష్టస్థానముల యందున్నను లేక పాపులతో కలసినను దేహమందు వ్రణ బాధయు మానహానియు ద్రవ్యహానియు స్థానహానియు రాజభీతియు మంత్రిద్వేషమును ఉపద్రవమును దారిద్రదుఃఖమును సంభవించును. ఆదోష పరిహారార్థ మగుటకును ఆయురారోగ్యాభి

వృద్ధి కలుగుటకును ఉత్తమదానమును ముఖ్యముగా చేయవల సినది కర్తవ్యము. జన్మనక్షత్రమునందుగాని గ్రహయోగము నందుగాని అథవా రిక్తతిథులయందుగాని మంగళవారముతో గూడియుండగా యింటియందుగాని దేవాలయము నందుగాని పరిశుద్ధ ప్రదేశమునందు భూమిని గోమయముతోడ అలికి శుద్ధి చేసి ముగ్గులుపెట్టి అచ్చట కందులు రాసి పోసి 21 దళముల తో గూడిన తామ్ర పద్మమును నిర్మించి మూడుతులముల బంగారముచేత శక్తి శూల గదా పాశధర చతుర్భుజములతో మేషవాహనా రూఢుడై రక్తమాల్యాం బరధరుడైన అంగా రక ప్రతిమను చేయించి పెట్టి ధ్యానము చేయవలయును. అదెట్లనిన,

శ్లో॥ రక్తమాల్యాం బరధరం మేషారూఢం చతుర్భుజం ।
శక్తిశూల గదుపాశం వరదం పూజయేత్కుజం ।
ఏవంధ్యాత్వా భువోయజ్ఞ న్యేతి మంత్రేణ పూజయేత్ ।
రక్తగంధాక్షతైః పుష్పైస్తత పత్రేషు నామభిః ।
పూజయేదేక వింశద్భిః వక్ష్యమాణై ర్విచక్షణః ॥ 37

తా. ఈప్రకారముగా ధ్యానముచేసి మంత్ర సహితము గా పూజచేసి రక్త గంధాక్షత పుష్పాదులను సమర్పించి నామపూజచేసి అటుపిమ్మట.

నామాని.

శ్లో॥ మంగళో భూమి పుత్రశ్చ ఋణహర్తా ధనప్రదః।
స్థిరాసనోమహాకాయ స్సర్వ కర్మావరోధకః ।
ధర్మాత్మజ కుజోభౌమా భూతిదః భూమినందనః ।
అంగారకో యమశ్చైవ సర్వరోగాపహారకః ।
వృష్టిహర్తా వృష్టికర్తా సర్వకామ ఫలప్రదః ।

ఏభిస్సం పూజ్యధూపాదీన్ తద్వాచ్చైవగుడోదనం ।
నివేద్యార్ఘ్యం ప్రదాతవ్యం మంత్రేణానేన యత్నతః॥38

తా. పైనచెప్పిన రీతిగా అంగారక ప్రార్థన చేసి ధూప దీప నైవేద్యాదులను మంత్ర పూర్వకముగా అర్ఘ్యపాద్యాదులనుయిచ్చి.

మంత్ర॥

శ్లో॥ భూమి పుత్రమహాకాయ స్వేదోద్భవ పినాకినః ।
శ్రేయసేత్వ ప్రసన్నోపి గృహాణార్ఘ్యం నమోస్తుతే ।
ఇతి దత్వార్ఘ్య మాహూయ బ్రాహ్మణం వేదపారగం।
రక్తవస్త్రాది స్సత్కృత్యసం పూజ్యాస్మై ప్రదాపయేత్ ।
తువరీరాశి మారూఢ తామ్రపాత్రే వినిర్మితం ।
దదామి పద్మం భౌమోద్ధపీడాం దహతే మేకుజః ।
అనేనవిధినా భౌమ ప్రతిమా దానకృన్నరః ।
ఆదివ్యాధి వినిర్ముక్త స్సర్వ సౌభాగ్యమశ్నుతే ।
ఇతిమంత్రేణ తద్దానం దత్వా దద్యాచ్చ దక్షిణాం ।
సువర్ణంతు యథాశక్తి దానసాద్గుణ్య సిద్ధయే ॥
ఇతియామళే అంగారక ప్రీతికర తామ్రపద్మదానవిధిః॥39

తా. పైనవివరించినరీతి మంత్ర పూర్వకముగా బ్రాహ్మణునికి యథాశక్తి దక్షిణతోకూడ దానమిచ్చిన యెడల కుజ దోష శాంతియగును ఈ ప్రకారముగా యామళ గ్రంథమునందు అంగారక ప్రీతికరముగా తామ్ర పద్మదాన విధి చెప్పబడియున్నది

కుజదశాయాం కుజభుక్తౌ కుజప్రీతికర అనడ్వాహదానం.

జ్యోతిషార్ణవే.

శ్లో॥ కుజేష్వంతర్గతే భౌమే షష్ఠాష్టమ వ్యయరాశిగే ।

పాపేవా నీచ సంయుక్తే నీచరాశిగతోపివా ।
ద్వితీయద్యూనపయుతే మహావ్యాధి భయంతథా ।
చోరాగ్ని నృపబాధాచ దారాపుత్రాది నాశనం ।
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్ ।
అనడ్వాహం ప్రకుర్వీత దానమారోగ్య మాదిశేత్ ।
యామళోక్త ప్రకారేణ యథావిధి సమాచర ।
రవిదశాయాం కుజభుక్తిఫలత్ ॥ 40

తా. కుజుడు తనదశలో స్వభుక్తియందు షష్ఠాష్టమవ్యయ రాసులను పొందియున్నను పాపులతో గలసి యున్నను నీచగ్రహ సంబంధము కలిగియున్నను లేక నీచరాశిని పొంది యున్నను ద్వితీయ సప్తమరాసుల యందున్నను ఆకాలమందు మహావ్యాధి భయమును, చోరబాధయు, అగ్నిభయమును, రాజభీతియు, భార్యాపుత్రాది నాశమును కలుగును. ఆదోష పరిహారార్థమై సుబ్రహ్మణ్యజపము చేయవలెయును. ఎద్దుని వృషభదానము చేయవలెయును. అటుపిమ్మట ఆరోగ్య భాగ్యము లభించును. యామళోక్త ప్రకారముగా రవిదశాకుజభుక్తియందు చెప్పిన విధి ననుసరించి దానము చేయవలెయును.

{ కుజదశాయాం రాహుభుక్తి ప్రీతికర మహిషీదానం కృష్ణధేనుదానంచ. }

సారదీయే.

శ్లో॥ కుజేప్యంతర్గతే రాహౌ షష్ఠాష్టవ్యయ రాశిగే ।
ద్విసప్తమాధిపయుతే చోరాగ్ని వ్రణభీతిదః ।
భూతాపస్మార పీడాచ దేహబాధా భవిష్యతి ।
తద్దోష పరిహారార్థం మహిషీదాన ముత్తమం ।

యామళోక్త ప్రకారేణవిధిం విధివదాచరేత్ ।
రవిదశాయాం రాహుభుక్తివత్ ॥ 41

తా. కుజదశలో భుక్తినాథుడగు రాహువు 6-8-12 రాసులయందున్నను లేక ద్వితీయ సప్తమాధి పతులతోఁడ కూడియున్నను ఆకాలమందు చోరబాధయు అగ్నిభీతియు, వ్రణపీడయు భూత అపస్మారాది పీడయు దేహాలస్యమును కలుగును. ఆదోష పరిహారార్థమై మహిషీదాన మిచ్చుట యుత్తమము. యామళోక్త ప్రకారముగా రవిదశలో రాహు భుక్తి యందు చెప్పినరీతిగా మహిషీదాన విధి ననుసరించ వలసినది.

కుజదశాయాం గురుభుక్తి ప్రీతికర స్వర్ణదానం.

శ్లో॥ కుజేస్యంతర్గతే జీవే ద్వితీయ ద్యూనరాశిగే ।
షష్ఠాష్టమ వ్యయాధీశ సంయుతే బలవర్జితే ।
తద్భుక్తౌపైత్య రోగశ్చ మూత్రకృచ్ఛ్రాది రోగకృత్ ।
తద్దోషపరి హారార్థం శివసాహస్ర కంజపేత్ ।
స్వర్ణదానం ప్రకుర్వీత యామళోక్త విధానతః ।
స్వర్ణదానం ప్రకురుతేన సర్వభయవర్జితః ।
ఇహభుక్త్వాఖిలాన్ భోగానంతే ఇంద్రపురంవ్రజేత్ ।
రవిదశాయాం గురుభుక్తివత్ ॥ 42

తా. కుజదశలో గురుభుక్తియందు గురువు ద్వితీయ సప్తమరాసుల యందున్నను, బలహీనుడై 6-8-12 రాశ్యాధిపతులతో కూడియున్నను ఆభుక్తియందు పిత్త సంబంధమగు రోగభయమును, మూత్రకృచ్ఛ్రాది రోగసంభవమును, కలుగును. ఆదోషపరిహారార్థమై శివసహస్రనామ జపము చేయవలెయును. యామళోక్త ప్రకారముగా స్వర్ణదానము చేయవలెయును. అట్లు దానమిచ్చిన పిమ్మట సకలవిధ భయములు

నశించును. ఇహలోక మందు సకలవిధములైయిన భోగసుఖాదుల ననుభవించిన పిమ్మట ఇంద్రలోకము చేరువాడగును. రవి దశలో గురుభుక్తియందు చెప్పినరీతిగా దాని విధి ననుసరించ వలసినది.

కుజదశాయాం శనిభుక్తి ప్రీత్యర్థం తిలపిష్ఠ మృత్యుదానం.

దశాచంద్రికాయాం॥

శ్లో॥ కుజస్యాంతర్గతేమందే నీచారిక్షేత్రరాశిగే।
షష్ఠాష్టమవ్యయాదీశ సంయుతే పాపరాశిగే।
ద్విసప్తమాధిపయుతే దేహతాపం తథైవచ।
శిరోరోగంచ కలహం చింతావ్యాధి భయంతథా।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
తిలమృత్యుహారందానం దీయతే భయవర్జితః।
అథదానం ప్రవక్ష్యామి మృత్యోర్వ్యస్తి లయమస్యచ।
సర్వపాపహరంపుణ్యం సర్వోపద్రవనాశనం।
విషకృత్రిమసంజాత సర్వదోష నికృంతనం।
రవ్యంగారక జీవార్కి దుస్థానస్థ భయాపహం।
మాఘమాసే పౌర్ణమాస్యాం రోగోత్పత్తౌ విశేషతః।
భయకాలేపివా కుర్యా దుత్పాతానాంచ దర్శనే।
దేవాలయే గృహేవాపి గోమయాలేపితస్థలే।
రక్తవస్త్రం ప్రసార్యాథ తిలరాశిం వినిక్షిపేత్।
తత్రద్రోణ ప్రమాణేన తిలపిష్టేన నిర్మితం।
మృత్యురూపం దక్షిణాభిముఖం సంస్థాప్యప్యవాససా।
రక్తవస్త్రేణ సంఛాద్య తామ్రాక్షే ద్వితయేనచ।
రాజితభ్రూయుగేనాపి స్వర్ణపట్టేన చారుణా।
రూప్యహస్తద్వయేనాపి హ్యలంకృత్య విచక్షణః।

రక్షోక్షి ప్తేణచ శిరస్సం వేష్టక్ష ప్రాఙ్ముఖస్వయం ।
సంకల్పపూజాం కుర్వీత ధ్యాత్వా ప్రయతే మానసః॥ 43

తా. కుజదశలో శనిభుక్తియందు శని నీచక్షేత్రమందుగాని, శత్రుక్షేత్రమందుగాని యున్నను, షష్ఠాష్టమ వ్యయాధిపతితోడ కలిసి పాపరాసులయం దున్నను, లేక ద్వితీయసప్తమాధిపతులతోడ కూడియున్నను, ఆభుక్తియందు దేహతాపమును, శిరోరోగమును, కలహమును, మనోవ్యాకులమును, వ్యాధిభయమును కలుగును. అదోషపరిహారార్థమై మృత్యుంజయజపము చేయవలెయును. అపమృత్యు నాశనమునకుగాను తిలదానమియ్య వలెయును. ఆదానవిధి ఎట్లనిన:—మాఖశుద్ధ పౌర్ణమియందుగాని, రోగోత్పత్తి కలిగియున్నపుడుగాని, శనిపీడాభయము సంభవించినపుడుగాని ఉత్పాతాదుల దర్శనము కలిగినపుడుగాని. యింటియందుగాని, దేవాలయమునందుగాని శుద్ధప్రదేశమునందు గోమయముచేత భూమిని శుద్ధిచేసి ఎఱ్ఱని వస్త్రమును పరచి దానిపై నూగులురాసిపోసి దానిమీాద దక్షిణాభి ముఖముగా తిలపిష్టనిర్మితమైన మృత్యుప్రతిమను యుంచి రక్తవస్త్రాద్యలంకారములుచేసి యథావిధిగా సంకల్పముచేసి పూజచేయుట కొఱకై.

ధ్యానం.

శ్లో॥ దంష్ట్రాకరాళవదనం ఘోరరూపం భయంకరం ।
దండపాశధరం దేవం దక్షిణాభి ముఖంసదా ।
ఏవంధ్యాత్వాపరం మృత్యో దిరి మంత్రేణ పూజయేత్ ।
రక్తగంధాక్షతైః పుష్పైః కృసరాన్నం నివేదనైః ।
తతో బ్రాహ్మణ మాహూయ వేదవేదాంగ పారగం ।
దక్షిణాభి ముఖస్థాయ దద్యాన్మంత్రమిమం పఠన్ ॥ 44

తా. పైచెప్పిన ప్రకారముగా ధ్యానముచేసి మంత్ర - పూర్వకముగా పూజచేసి రక్తగంధాక్షత పుష్పాదులను సమర్పించి ధూపదీప నైవేద్యాదులను ఒసంగి అదే ప్రకారముగా వేదవేదాంగ పారంగతుడైన బ్రాహ్మణుడు దక్షిణాభి ముఖుడై యుండగా మంత్ర పఠనతోడ దానమిచ్చుటకు గాను.

మంత్రః॥

శ్లో॥ మృతంసంజ్ఞ మహాకాయ కర్మసాక్షి స్సప్రాణాంసదా ।
తవదానేన మాంత్రాహి మృత్యురోగాది సంకటాత్ ।
దత్త్వైవంతు తతోదద్యా ద్దక్షిణాః స్వర్ణపంచకం ।
దానప్రతిష్ఠా సిద్ధ్యర్థం దాతు శ్శ్రేయోఽభి వృద్ధయే ।
అనేన విధి నాయస్తు మృత్యుదానం సమాచరేత్ ।
మహాపాతకయుక్తోవాఽ యుక్తోవా చోపపాతకైః ।
మిత్రహావా కృతఘ్నోవా నాస్తికోవాపి హింసకః ।
సర్వపాప వినిర్ముక్త స్సజీవేచ్ఛరదాంశతం ।
ఇహాభుక్త్వా ఖిలాన్ భోగానంతే యమపురం వ్రజేత్ ।
దివ్యమాల్యాంబరధరో దివ్యాభరణ భూషితః ।
సురూపస్సు భగశ్శ్రీమాన్ దివ్యస్త్రీభి స్సమన్వితః ।
తత్రస్థితైర్మహా భాగైస్తూయమానో దివానిశం ।
రమిత్వా జల్పమేకంతు తతో విష్ణుపురం వ్రజేత్ ॥
ఇతిరుద్ర యామిళే తిలపిష్ఠ మృత్యుదానవిధిః॥  45

తా. పైనచెప్పినట్టుగా మంత్రపఠనము తోడ యథా విధి ప్రకారముగా దానము చేసిన యెడల సర్వారిష్ట శాంతి యగును. మరియు ఇహలోక సుఖముల నన్నిటిని యనుభవించిన పిమ్మట యమలోకమున కేగును. దివ్యమాల్యాంబర ధరుడును, దివ్యాభరణ భూషితుండును, సుందరాకారుండును,

సౌభాగ్యవంతుడును, శ్రీమంతుడును, దివ్యస్త్రీలతో గూడిన వాడునునై ఆలోకమందు సర్వభోగములను ఒకకల్పకాలము అనుభవించిన పిమ్మట విష్ణులోకముచేరును. ఈప్రకారముగా రుద్రయామిళ గ్రంథమునందు తిలపిష్టమృత్యుదాన విధి చెప్ప బడియున్నది.

కుజదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర అశ్వదానం.

శ్లో॥ లగ్నషష్టాష్టరాశిస్థే వ్యయేవా నీచ రాశిగే।
దశాధిపేనసంయుక్తే శత్రువృద్ధి ర్మహద్భయం।
విదేశ గమనం చైవ నానారోగం తథైవచ।
హృద్రోగమాన హానిశ్చ చతుష్పాజ్జీవ నాశనం।
తద్దోష పరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్।
అశ్వదానం ప్రకుర్వీత సర్వారిష్ట వినాశనం॥ 46

తా. కుజదశలో బుధ భుక్తియందు బుధుడు 1-6-8-12 రాసులయం దున్నను లేక తన నీచరాశిని పొందియున్నను, దశానాథునితోడ కలిసియున్నను, ఆకాలమందు శత్రువృద్ధియు, విశేషభయమును, విదేశగమనంబును, నానావిధరోగసంభవ మును, హృదయసంబంధ మగు రోగపీడయు, మానహానియు, పశ్వాదిజీవరాసుల నాశంబును, కలుగును. ఆదోషపరిహారా ర్థమై సూర్యప్రార్థన చేయవలెయును. అశ్వదానముకూడ యథావిధిగా చేసినపిమ్మట సర్వారిష్టములు నశించును.

కూర్మపురాణే॥

శ్లో॥ ఏతదశ్వదానంచికీర్షుః పురుషః - గ్రహణాదిపుణ్యకా లేషు - ఉపద్రవ కాలేషువా - దేవాలయాది పుణ్యదేశేషు - గోమయానులేపిత రంగవల్ల్యాదిరచిత భూభాగోపరి - సర్వ లక్షణలక్షితం స్నాతమశ్వం ప్రాఙ్ముఖం నిధాయ - రక్తవస్త్రేణ

సంవేష్ట్య పంచపల పరిమిత రౌప్యేణ - స్వర్ణేనరాఖురాః కృత్వా అశ్వఖురేషు నిధాయ సువర్ణ నక్షత్ర మాలాంకంఠే నిధాయ। ముక్తమాలాం లాంగులే విన్యస్య। ఏవంరచయిత్వా దానసంకల్పం కుర్యాత్॥ ఏవం గుణే త్యాది - మాయాకృతానాం సర్వేషాం పాపానాం నివృత్తించ - సర్వోపద్రవ నానారోగ నివారణార్థం సర్వమంగళావాప్తిం - ఆయురారోగ్యసిద్ధిం ఉత్తరత్ర అశ్వరోమసంఖ్యాది సమ్మిత దివ్యవర్ష పర్యంతం - సూర్యలోక నివాస సిద్ధ్యర్థం - సకలాభీష్టప్రదాయక శ్రీసూర్యనారాయణప్రీతిం కామయమానః - కూర్మ పురాణోక్త ప్రకారేణ అశ్వదానం కరిష్యే ఇతి సంకల్ప్య॥ అశ్వపూజాం కుర్యాత్ - అశ్వాయనమః ఇతి మంత్రేణ షోడశోపచారపూజాం కృత్వా ప్రార్థనాం కుర్యాత్॥ 47

తా. బుధప్రీతిగా అశ్వదానముచేయుటయందు దిచ్ఛగల పురుషుడు గ్రహణాది పుణ్యకాలములయందు గాని, ఉపద్రవకాలములయందుగాని దేవాలయాది పుణ్యప్రదేశమందు గోమయముచేత భూమిని అలికి ముగ్గులుపెట్టి ఆశుద్ధభూమియందు సర్వలక్షణలక్షితముగా ఎట్టినిగుఱ్ఱమును తూర్పుముఖముగానిలిపి రక్తవస్త్రముధరించి ఐదుపల పరిమితిగల బంగారు వెండి యాభరణములచేత నలంకరించి దానసంకల్పముచేసి కూర్మ పురాణోక్తప్రకారముగా అశ్వదానముచేయుటకొఱకై అశ్వపూజచేసి మంత్రములతోడ షోడశోపచార పూజచేసి ప్రార్థన చేయవలెయును.

శ్లో॥ గంధర్వ కులజాతస్త్వం మాభూయ కులదూషకః।
బ్రాహ్మణస్యచ సూర్యస్య సోమస్య వరుణస్యచ।
ప్రభావశ్చ హుతాశస్య వర్ధయస్వతు రంగమ।

తేజసా చైవ సూర్యస్య మునీనాం తపసా తథా ।
రుద్రస్య బ్రహ్మ చర్యేణ పవనస్య బలేనచ ।
స్మరత్వం రాజపుత్రత్వం కౌస్తుభంచ మణిం స్మర ।
యాంగతిం బ్రహ్మహాగచ్ఛేత్పితృహా మాతృహా తథా ।
భూమ్యర్థా నృతవాదీచ క్షత్రియస్య పరాఙ్ముఖః ।
సూర్యాచంద్రమసౌ వాయు ర్యావత్పశ్యంతి దుష్కృతిం ।
వ్రజత్వం తాంగతిం క్షిప్రం తచ్చపాపం భవేత్తవ ।
వికృతిం మాయమేఛేత్వం యుద్ధేధ్వాని తురంగమ ।
రిపూన్విజిత్య సమరే సహభర్త్రా సుఖీభవ ॥

ఇత్యశ్వం సంప్రార్థ్య॥

శ్లో॥ అహితాగ్నిం విప్రం శ్రీసూర్యనారాయణ స్వరూపం ।
వస్త్రాంగుళీయ కర్ణాభరణాద్యైః అభ్యర్చ్య దద్యాత్ ॥

దానమంత్రః॥

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస్త్వం శుభదరాజ్ఞాం విజయదాయక ।
సూర్యవాహనమస్తుభ్య మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

అస్మై.............ఇమంసర్వాలంకారశోభిత గంధపుష్పాద్యలంకృత సూర్యదేవతాక మశ్వం పూర్వోక్త ఫలకామస్తుభ్య మహం సంప్రదదేనమమేతి కర్ణదేశే దద్యాత్ ॥

మయాచికీర్షుః అశ్వదాన ప్రతిష్ఠాసిద్ధ్యర్థందక్షిణాదానం కరిష్యేతి సంకల్ప్య। తతశ్శతనిష్కాః - పంచవింశతి నిష్కావా దక్షిణాం దద్యాత్ ॥ యస్యేత్యాది ॥ ఇతి కూర్మపురాణోక్త ప్రకారేణ అశ్వదానవిధిః ॥ 46

తా. ఈప్రకారము మంత్రపూర్వకముగా ప్రార్థనచేసి సూర్యనారాయణ స్వరూపుడైన బ్రాహ్మణుని యథావిధిగా పూజచేసి దానమంత్రపఠనచేసి నూరువరహాలుగాని లేక ఇరు

వదియైదువరహాలుగాని దక్షిణయిచ్చి అశ్వదానము చేసిన యెడల సకలారిష్టములు నాశన మగును. ఈవిధముగా కూర్మ పురాణమునందు అశ్వదానవిధి చెప్పబడి యున్నది.

కుజదశాయాం కేతుభుక్తౌ కేతుప్రీతికర ఛాగదానం.

జ్యోతిషార్ణవే॥

శ్లో॥ కుజేష్వ్యంత ర్గతే కేతౌ షష్ఠాష్ట వ్యయరాశిగే ।
పాపగ్రహేణసంయుక్తే మారక స్థానసంయుతే ।
విషచోరారి బాధాచ నిద్రాలస్యం తథైవచ ।
దారాపుత్రాది పీడాచ ఆప్తబంధు విరోధితా ।
అన్యగేహప్రవాసశ్చ అపమృత్యు ర్భవిష్యతి ।
తద్దోషపరిహారార్థం శ్రీరుద్ర జపమాచరేత్ ।
ఛాగదానం ప్రకుర్వీత పశ్చాచ్ఛాంతి మవాప్నుయాత్ ।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ।
రవిదశాయాంశని భుక్తివత్ ॥ 49

తా. కుజదశలో కేతుభుక్తియందు కేతువు ౬-౮-12 రాసులయందున్నను, పాపగ్రహములతో కూడియున్నను, మారక స్థానములను పొందియున్నను, ఆకాలమందు విషభీతియు, చోరబాధయు, శత్రుపీడయు, నిద్రాలస్యమును, భార్యా పుత్రాదిపీడయును, ఆప్తబంధువిరోధమును, అన్యగృహవాస మును, అపమృత్యుభయమును, కలుగును. ఆదోషపరిహారా ర్థమై శ్రీరుద్రజపము చేయువలసినది. అదేప్రకారముగా ఛాగ దానము చేసిన పిమ్మట శాంతికలుగును. యామళోక్త ప్రకార ముగా సూర్యదశలో శనిభుక్తియందు చెప్పినరీతిగా ఛాగదాన విధిననుసరించవలెయును.

## కుజదశాయాం శుక్రభుక్తౌ శుక్రప్రీతికర దుర్గాదానం.

పారాశర్యే॥

శ్లో॥ కుజేష్వంతర్గతేశుక్రే షష్ఠాష్ట వ్యయరాశిగే ।
తద్భుక్తౌవ్యాధిదుఃఖంచ కలహం ప్రాణపీడనం ।
తద్దోషపరిహారార్థం వనదుర్గా జపంచరేత్ ।
దుర్గాదానంప్రకుర్వీత దానేనారోగ్య మాదిశేత్ ।
చంద్రదశాయాంగురు భుక్తివత్ ॥ 50

తా. కుజదశలో శుక్రభుక్తియందు శుక్రుడు 6-8-12 రాసులయందున్నయెడల ఆభుక్తియందు వ్యాధిభయమును, దుఃఖసంభవమును, కలహమును, ప్రాణపీడనయు కలుగును. ఆదోషపరిహారార్థమై వనదుర్గాజపమాచరించవలయును. దుర్గాదానము చేసిన పిమ్మట ఆరోగ్యము కలుగును. చంద్రదశలో గురుభుక్తియందు చెప్పినరీతిగా దానవిధి ననుసరించవలసినది.

## కుజదశాయాం రవిభుక్తౌ పద్మదానం.

జ్యోతిషసంహితాయాం॥

శ్లో॥ లగ్నషష్ఠాష్టరాశిస్థే వ్యయేవా పాపరాశిగే ।
మారకేశేనసంయుక్తే పైత్యరోగాది సంభవం ।
తాపజ్వరాదిపీడాచ వ్రణబాధా తథైవచ ।
తద్దోషపరిహారార్థం పద్మదానం చకారయేత్ ॥ 51

తా. కుజదశలో రవిభుక్తియందు సూర్యుడు 1-6-8-12 రాసులయందున్నను, పాపరాశియందున్నను, లేక మారకాధిపతితో కలసియున్నను, ఆకాలమందు పైత్యరోగాది సంభవమును, తాపజ్వరాదిపీడయు, వ్రణబాధయు కలుగును.ఆదోషపరిహారార్థమై పద్మదానము యియ్యవలెయును.

## పద్మదానవిధిః.

యామళే॥

శ్లో॥ శ్రుణువత్స ప్రవక్ష్యామి పద్మదానమ ముత్తమం।
సూర్యప్రీతికరం నిత్య మాయురారోగ్య దాయకం।
వాతపైత్యకఫోద్భూత సర్వరోగోపశాంతిదం।
అతిసారాది గుల్మాది గ్రహణీ శోభనం భవం।
యత్మోరుచ్యగ్నిమాంద్యాది విషకృత్రిమసంభవం।
తత్సర్వం నశ్యతి క్షిప్రం పద్మపద్మదాన ప్రభావతః।
దుస్థానస్థ గ్రహోద్భూత సర్వారిష్ట హారక్షమం।
పద్మదానమితిఖ్యాతం కాంతిపుష్టి బలప్రదం।
తస్మాద్దానప్రకుర్వీత జీవితార్థీ సుభక్తితః॥ 52

తా. సూర్యప్రీతికరముగా ఎల్లపుడును ఆయురారోగ్యము నిచ్చునదియును, వాత, పైత్య, కఫాదులవలన కలిగెడు సర్వరోగములయొక్క ఉపశాంతిచేయునదియును, అతిసారము, గుల్మము, గ్రహిణీ రోగ సంభవము, మాంద్యము, విషభీతి, కృత్రిమసంభవము మొదలగు రోగములనన్నిటిని నాశముచేయునదియును, దుస్థానములయందున్న గ్రహముల మూలకముగా కలుగునటువంటి సకలవిధ అరిష్టములను నాశముచేయునదియును, యగు దానములలో నుత్తమదానం బైన పద్మదానమును జీవితమునందు ఇచ్ఛగల పురుషుడు చేసిన యెడల కాంతియు, పుష్టియు, బలమును కలుగును.

శ్లో॥ త్రిజన్మనక్షత్రే వ్యతీపాతే భానుభౌమార్కవాసరే।
అష్టమ్యాంచ చతుర్దశ్యాం నుమాయాం క్షుద్రసంజ్ఞితే।
దుస్స్వప్నాద్భుతసంభూత దోషకాలే విశేషతః।
స్వగృహే శుద్ధదేశేతు గోమయా లేపితే తతః।

ప్రస్థతండులరాశౌతు పద్మదష్ట దళంలిఖేత్ ।
తన్మధ్యే కారయేద్వృత్తం రక్తవస్త్రం ప్రసాదయేత్ ।
తత్ర పద్మం వినిక్షిప్య సువర్ణేన వినిర్మితం ।
నిష్కద్వాదశకేనైవ తదర్ధార్ధమానతః ।
ద్రవ్యాభావేను సారేణ హీనాధిక మథాచరేత్ ।
షడంగుళాన్వితం వృత్తం దళాష్టక సమన్వితం ।
వస్త్రోపరివినిక్షిప్య సౌరాష్టాక్షర మంత్రతః ।
రక్తగంధాక్షతైః పుష్పైః నైవేద్యాంతంసమర్పయేత్ ।
ప్రాగాదిష్వష్టపత్రేషు చైత్రై ర్నామభి రర్చయేత్ ।
దివాకరాయసూర్యాయ రోగజాల హరాయిచ ।
సర్వప్రాణివినాశాయ మార్తాండ యాథభానవే ।
త్రయీమయాయ మిత్రాయ నామభిస్సహ్యగర్భయేత్ ।
తతో హోమం ప్రకుర్వీత ఆచార్యస్తు విధానతః ।
అర్కకాష్ఠైస్తిలాద్యైశ్చ హునే దష్టోత్తరం శతం ।
సౌరాష్టాక్షరమంత్రేణ సమిద్ధోమం సమాచరేత్ ।
ఉద్వయంతి తిలహోమంచ చిత్రం దేవాజ్యహోమకం ।
ఆచార్యమర్చయేద్రక్త వస్త్రగంధా రిదిభూషణైః ।
ప్రాఙ్ముఖో దఙ్ముఖాయైవ దద్యాన్మంత్రేణ భక్తితః॥ 53

తా. జన్మనక్షత్రమందును, వ్యతీపాతమందును, భాను, మంగళ, శనివారములయందును, అష్టమియందును, చతుర్దశి యందును, క్షుద్రకాలముల యందును దుస్వప్నాదులు కలిగి నటువంటి క్రూరకాలములయందును తనయింటిలో శుద్ధప్ర దేశమందు గోమయముచేత భూమిని అలికి పైనచెప్పిన రీతిగా బంగారుతో చేయబడిన సువర్ణపద్మమును బియ్యపురాశిపైన యుంచి షోడశోపచారపూజలుచేసి సౌరాష్టాక్షరమంత్రముల

చేత పూజించి తిలహోమము చేసి ఆచార్యుని రక్తవస్త్రగంధాది భూషణముల చేత నలంకరించి తూర్పుముఖముగా యున్న బ్రాహ్మణునకు ఉత్తరాభిముఖుడై భక్తితోడ దానమంత్రములను.

దానమంత్రః॥

శ్లో॥ మృత్యుంజయదిడానాథ మహారోగ వ్రతంతుమా।
స్వర్ణపద్మప్రదానేన త్రాహిత్రాహి మహాభయాత్।
వాతపిత్తకఫోద్భూత గ్రహణ్యాద్యామయాకులం।
పద్మదానేన తత్సర్వం వినాశయదివాకర।
తతస్తుదక్షిణాదానం యథావిత్తానుసారతః।
ఏవంయఃకురుతే దానం నిరోగీ జాయతే ధ్రువం।
అరుచిగ్రహణీరోగ జాలాద్యైః పరివర్జితః।
బలకాంతియుతోమర్త్య స్సుఖీభవతు సర్వదా॥ 54

ఇతి పద్మదాన విధిః.

తా. పైచెప్పిన రీతిగా పఠించి, యథాశక్తి దక్షిణసహితముగా పద్మదానమిచ్చినయెడల నిశ్చయముగా రోగములేనివాడును, అరుచిలేనివాడును, గ్రహిణిరోగము మొదలగువాటినుండి పరివర్జితుడైనవాడును, బలయుక్తుడును, దేహకాంతిగలవాడును, ఎల్లకాలము సుఖము ననుభవించువాడును యగును ఈప్రకారముగా జ్యోతిషసంహితయందు పద్మదాన విధి చెప్పబడియున్నది.

కుజదశాయాం చంద్రభుక్తౌ చంద్రపీడికర దుర్గాదానం.

నారదియే॥

శ్లో॥ కుజేప్యంతర్గతే చంద్రే నీచారి క్షేత్రసంయుతే।
పాపగ్రహేణసంయుక్తః క్షీణచంద్ర స్తథైవచ।
మారకేశేనసంయుక్తే మారకం భవతిధ్రువం।

అథవా శ్లేష్మరోగాది పాండురోగాది సంభవః ।
తద్దోషపరిహారార్థం దుర్గాదానేన శామ్యతి ।
చంద్రదశాయాం గురుభుక్తివత్ ॥ 55

తా. కుజదశలో చంద్రభుక్తియందు చంద్రుడు నీచ క్షేత్రమందుగాని, శత్రుక్షేత్రమందుగాని, యున్నను, పాపగ్రహములతో కలిసియున్నను లేక క్షీణచంద్రుడైనను, మారకాధిపతితో కలిసియున్నను ఆ భుక్తియందు నిశ్చయముగా మారకము సంభవించును. అథవా శ్లేష్మరోగములును, పాండురోగమును కలుగును. ఆదోష పరిహారార్థమై దుర్గాదానము చేయవలయును. చంద్రదశలో గురుభుక్తియందు చెప్పినరీతిగా దానవిధి ననుసరించ వలసినది.

రాహుదశాయాం రాహుప్రీతికర స్వర్ణలోహదానం.

యామశే॥

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి రాహుప్రీతి కరంపరం ।
సువర్ణలోహపాత్రంతు దానానా ముత్తమోత్తమం ।
దుస్థానస్థో భవేద్రాహు ర్నానోపాధికరోయతః ।
స్వదేశభ్రమణం చైవ స్వజనైః కలహం తథా ।
మిత్రభేదం శత్రుభయం మానద్రవ్యాది నాశనం ।
అస్త్రశస్త్రభయంసర్ప విషభీతిం తథైవచ ।
తథైవ దుర్జనభయం కరోత్యేవం నసంశయః ।
తస్మాత్తద్దోషశాంత్యర్థం దానమేతత్సమాచరేత్ ॥ 56

తా. దుస్థానములయందున్న రాహువు అనేకవిధములయిన కష్టములను కలుగచేయును. స్వదేశభ్రమణమును, స్వజనులతోడ కలహమును, మిత్రభేదమును, శత్రుభయమును, మానహానియు, ద్రవ్యనాశమును, అస్త్రభీతియు, శస్త్రభయ

మును, సర్పగండమును, విషపీడయు, దుర్జనభయమును నిస్సంశయముగా కలుగును. ఆదోషపరిహారమై దానములన్నిటిలోను యుత్తమంబై స్వర్ణలోహ దానమును రాహుప్రీతి కరముగా చేయవలెయును.

శ్లో॥ మందవారే భౌమవారే పంచపర్వసువాపునః ।
భూమాగోమయవిప్తాయాం దేవాగారే గృహేపివా ।
తిలరాశిం వినిక్షిప్య హ్యేథకప్ర మితం శుభం ।
తస్మిన్ సూర్పాకార లోహస్వర్ణ రాహుంన్యసేచ్ఛుభం ।
వస్త్రేణాచ్ఛాద్యతంధ్యాయే త్తతః పూజాంసమాచరేత్ ॥57

తా. శనివారమునందును మంగళవారమునందును పంచపర్వకాలములయందును దేవాలయమందుగాని, గృహమునందుగాని, శుద్ధప్రదేశమునందు భూమిని గోమయముచేత అలికి, తిలరాశినిపోసి దానిమీద ఇనుముచేతచేయబడిన చాటనుంచి బంగారపు రాహుప్రతిమనుపెట్టి శుభవస్త్రాభరణాదుల చేత నలంకరించి ధ్యానించి పూజచేయవలెను

ధ్యానం॥

శ్లో॥ కరాళవదనఃఖడ్గ చర్మశూలవరాన్వితః ।
నీలసింహాసనస్థశ్చ రాహు స్తత్రప్రశస్యతే ।
ఏవంధ్యాత్వాశయానశ్చిత్రేతి మంత్రేణ పూజయేత్ ।
కేతకీరజసామిత్ర నీలగంధై స్తథాక్షతైః ।
పుష్పైః ధూపైశ్చ దీపైశ్చ లవణో పాతపాయసైః ।
తతోబ్రాహ్మణమాహూయ దద్యాన్మంత్రమిమంపఠన్ ।
తిలరాశిం స్వర్ణలోహపాత్ర ఘృతం పణీశ్వరం ।
దదామిదోషనాశాయ- సర్వకామార్థ సిద్ధయే ।
ఇతిదత్వాయథాశక్తి దద్యాద్వై దక్షిణాం నరః ।

అనేనవిధినాలోహ స్వర్ణదానం కరోతియః ।
రాహుదోషవినిర్ముక్త స్సుఖీవేచ్ఛ రదాంశతం ॥ 58
ఇతి యామళే రాహుప్రీతికర స్వర్ణ లోహ దానవిధిః.

తా. పైన చెప్పిన రీతిగా ధ్యానముచేసి సింహాసన ఖడ్గ చర్మశూలవరచర్మస్థ సువర్ణప్రతిమను యథాశక్తి దక్షిణసహితముగా యామళోక్త ప్రకారముగా బ్రాహ్మణునికి దానమియ్యవలెయును. అట్లు చేసిన పిమ్మట సమస్తదోషములు నశించును. సర్వకామార్థ సిద్ధియు లభించును.

రాహుదశాయాం రాహుభుక్తౌ రాహుప్రీతికర నాగదానం.
హోరాసారే॥

శ్లో॥ రాహోరంతర్గతేరాహౌ షష్ఠాష్టవ్యయరాశిగే ।
క్రూరగ్రహేణ సంయుక్తే మారక స్థానసంయుతే ।
తదాహృద్రోగ మూర్ఛాస్యా చ్చాతుర్థి కపిశాచకైః ।
సర్వకార్యేషు సర్వేషు రాహుర్విఘ్న ప్రదాయకః ।
శూద్రస్త్రీ విధవాహంతా బ్రహ్మద్వేషీచ జాయతే ।
తద్దోషపరిహారార్థం నాగదానం చకారయేత్ ।
దుర్గాజపంచకుర్వీత రాహుప్రీతి కరంభవేత్ ॥ 59

చంద్రదశాయాం కుజభుక్తివత్.

తా. రాహుదశలో స్వభుక్తియందు రాహువు 6-8-12 రాసులయందున్నను, క్రూరగ్రహములతో చేరియున్నను,మారక స్థానములయందున్నను ఆకాలమందు హృదయసంబంధమగు రోగబాధయు, మూర్ఛయు, చాతుర్థిక పిశాచపీడయు, సర్వకార్యములయందును, సర్వకాలమందును, రాహువువల్ల విఘ్నమును, శూద్రస్త్రీ లేక విధవాహతమును, బ్రహ్మద్వేషమును కలుగును. ఆదోషపరిహారార్థమై నాగదానము చేయ

వలెయును. దుర్గాజపము చేసిన పిమ్మట రాహుప్రీతి కలుగును. చంద్రదశలో కుజభుక్తియందు చెప్పిన రీతిగా దానవిధి ననుసరించవలసినది.

రాహుదశాయాం గురుభుక్తౌ గురుప్రీతికర స్వర్ణదానం.

హోరాసారే॥

శ్లో॥ రాహోరంతర్గతేజీవే షష్ఠాష్టవ్యయస్థితే ।
నీచేవా క్రూరరాశిస్థే పాపగ్రహ సమన్వితే ।
బుద్ధివైకల్యమాప్నోతి పుత్రదారాది పీడనం ।
హృద్రోగం పైత్యరోగంచ ఉన్నతాత్పతనం తథా ।
తద్దోషపరిహారార్థం శతరుద్ర జపంచరేత్ ।
స్వర్ణదానం ప్రకుర్వీత హ్యపమృత్యు నివారణం ।
యామళోక్త విధానేన విధిం విధివదాచర ।
రవిదశాయాం గురుభుక్తివత్ ॥ 60

తా. రాహుదశలో గురుభుక్తియందు గురువు 6-8-12 స్థానములయందున్నను, నీచులతోడ కలసియున్నను, క్రూర రాసులయందున్నను పాపగ్రహములతో కూడియున్నను, ఆకాలమందు బుద్ధివైకల్పమును, భార్యాపుత్రాదిపీడయు, హృదయ సంబంధ మగు రోగబాధయు, పైత్యరోగమును, ఉన్నత స్థలమునుండిపడుటయు, సంభవించును. ఆదోషపరిహారార్థమై శతరుద్రజపము చేయవలెయును. స్వర్ణదాన మిచ్చినపిమ్మట అపమృత్యుభయము నివారణ యగును. యామళోక్త ప్రకారముగా రవిదశలో గురుభుక్తియందు చెప్పిన రీతిగా దానవిధి ననుష్ఠింప వలసినది.

రాహుదశాయాం శనిభుక్తౌ శనిప్రీతికర ఛాగదానం.

జ్యోతిషార్ణవే॥

శ్లో॥ రాహోరంతర్గతేమందే నీచారి క్షేత్రసంస్థితే।
మారకగ్రహసంయుక్తే షష్ఠాష్టవ్యయరాశిగే।
కలహం రాజవిద్వేషం బంధునాశం తథైవచ।
సమానజనశోకంచ చతుష్పాజ్జీవనాశనం।
ప్రమేహం క్షయగుల్మాది శూలహృద్రోగకం భవేత్।
తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్।
ఛాగదానం ప్రకుర్వీత శాంతిర్భోత్యసంశయః।
రవిదశాయాం శనిభుక్తివత్॥ 61

తా. రాహుదశలో శనిభుక్తియందు శని నీచక్షేత్రమందున్నను, శత్రుక్షేత్రమందున్నను, మారక గ్రహసంబంధము కలిగియున్నను, షష్ఠాష్టమ వ్యయరాసులయందున్నను, ఆభుక్తియందు కలహమును, రాజద్వేషమును, బంధునాశమును, సమానజనశోకమును, పశ్వాదిజీవనాశమును, ప్రమేహము, క్షయము, గుల్మము, శూలము, హృద్రోగము మొదలగు రోగబాధయు, కలుగును. ఆదోషపరిహారార్థమై విష్ణుసహస్రనామ జపము చేయవలెయును. ఛాగదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతికలుగును. రవిదశలో శనిభుక్తియందుచెప్పిన రీతిగా ఛాగదానవిధి ననుష్ఠింపవలెయును.

రాహుదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర శ్రీమూర్తిదానం.

వృద్ధపారాశర్యే॥

శ్లో॥ రాహోరంతర్గతేసౌమ్యే నీచేవాస్తం గతోపివా।
రవిరాహ్వార్కిభౌమైశ్చ సంయుక్తో దుష్టరాశిగః।
కాలమృత్యుభయంచైవ హింసాదారిద్ర్యపీడనం।

తద్దోషపరిహారార్థం విష్ణుసాహస్రకం జపేత్ ।
శ్రీమూర్తిదానం కుర్వీత శాంతిమాప్నోత్యసంశయః ॥ 62

తా. రాహుదశలో భుక్తినాథుడగు బుధుడు నీచ రాశియం దున్నను, అస్తంగతుడైనను, రవి, రాహు, శని, కుజులతో చేరి దుష్టరాశియం దున్నను, ఆకాలమందు మృత్యుభయమును, హింసయు, దారిద్ర్యపీడయు కలుగును. ఆదోష పరిహారార్థమై విష్ణుసహస్రనామ జపము చేయవలెయును. శ్రీమూర్తిదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతికలుగును.

మత్స్యపురాణే. శ్రీమూర్తిదానవిధిః.— మనురువాచ:—

శ్లో॥ దేవదేవదయాసింధో త్వత్తస్సర్వం శ్రుతంమయా ।
శ్రీమూర్తిదానమాహాత్మ్యం కదాచి దపిస్మృతం ।
కింపుణ్యంకుత్ర వాకార్యం విధానం కీదృశంవద ॥ 63

తా. ఓ దేవదేవా ! దయాసింధో, ఎల్ల సంగతులు నాకు శ్రుతపరుచుము శ్రీమూర్తిదాన మాహాత్మ్యమును దానిని చేయుటవల్ల కలిగెడు పుణ్యమును, చేయవలసిన విధానమును నా కెఱింగింపుము.

మత్స్యః॥

శ్లో॥ ఏవముక్తస్తు మనునా మత్స్యః ప్రోవాచతం మనుం ।
సాధుపృష్టంత్వయారాజన్ సాలగ్రామస్తు వైభవం ।
దానంచవిధివత్తస్య దేశకాలా ఫలంచయత్ ।
సర్వంసమ్యక్ప్రవక్ష్యామి సావధాన మనాశ్శృణుః ।
సాలగ్రామశిలాయస్మిన్ దేశేవసతిసర్వదా ।
తద్దేశవాసినాన్యాణాం పాపలేశో నవిద్యతే ।
సాలగ్రామశిలాస్రస్త జలబిందుః కళేబరే ।
యస్యకస్యాపిపతతి దేహినో మనుజేశ్వర ।

సగోఘ్నోవా కృతఘ్నోవా బ్రహ్మహా భ్రూణహాపివా ।
గురుదారాభిమర్శీవా స్తేయీవాసర్వ కిల్బిషైః ।
విముక్తోవిష్ణుభవన మనవద్య మనామయం ।
అవాపిగన్య్సమనఘం యోగ్ధినా మపిదుర్లభం ।
పునరావృత్తి రహితం ప్రాప్నుయాన్నాత్రసంశయః ।
సాలగ్రామశిలాయస్య గేహేవసతిచక్రయుక్ ।
తదేవవైకుంఠమితిప్రవదంతి మనీషిణః ।
సాలగ్రామశిలాయత్ర తులసీయత్రతిష్ఠతి ।
యత్రపద్మవనానిస్యుః తత్ర సన్నిహితోహరిః ।
సాలగ్రామశిలాయత్ర వర్తతే చక్రవన్హితో ।
తత్ర సర్వానితీర్థాని వసంత్యత్రనసంశయః ।
తస్మాత్కురుమహారాజ సాలగ్రామప్రదానకం ।
సద్యస్తీరే గృహేవాపి యత్రవారమతేమనః ।
తత్రభూమిం సమాలిప్య గోమయేన సవారిణా ।
తత్రపద్మసమాలిఖ్య రజోభిః పంచవర్ణకైః ।
తస్మిన్దారుమయం పీఠం తామ్రంవాపి నిధాయతు ।
పట్టవస్త్రం సమాస్తీర్య తస్మిన్పీఠేనవంశుభం ।
తస్యోపరిన్యసేన్మూర్తిం మత్స్యకూర్మాదికాం శుభాం ।
కేశవాది చతుర్వింశ రూపాంవాతి మనోహరాం ।
చక్రశుద్ధిం శిలాశుద్ధిం వర్ణశుద్ధిం పరీక్ష్యచ ।
యామూర్తిర్లక్ష్యతేయస్యాంశిలాయాంతత్రతాంయజేత్ ।
ప్రణవాదిచతుర్థ్యంతం నామమాత్రేణ వాగ్యతః ।
ఆసనాదిసుమాంతంతు పూజాంకృత్వా యథావిధి ।
శ్రీరామాష్టోత్తర శతనామభిః పాపహారిభిః ।
నృసింహనామభిర్వాపి కృష్ణనామభిరేవవా ।

అష్టోత్తరశతేనాథ పూజాం సమ్యగ్విధాయచ ।
ధూపదీపైశ్చనైవేద్యైః ప్రీణయిత్వాతు కేశవం ।
మంత్రేణానేనవిధివ ద్దద్యాదుదక పూర్వకం ।
బ్రాహ్మణాయ సుశీలాయ శ్రోత్రియాయ విశేషతః ।
దక్షిణాంనిష్కమర్ధంవా పాదంవా శక్తితోర్పయేత్ ।
ఏవందత్వా విధానేన సాలగ్రామ శిలాంనరః ।
అయనే విషువే వాపి గ్రహణద్వితయేపివా ।
ద్వాదశ్యామథసంక్రాంతౌ వివాహాదిషుకర్మసు ।
యజ్ఞోత్సవేషుచ తథా గృహగ్రామ ప్రవేశనే ।
బ్రహ్మహత్యాదికం పాపం మహత్తత్సమమేవచ ।
అతిపాపం చానుపాప ముపపాతకమేవచ ।
సంకిలీ కరణంచైవ మలినీకరణం తథా ।
అపాత్రీ కరణంచైవ జాతిభ్రంశ కరం తథా ।
ప్రకీర్ణకంచనిర్హృత్య శుద్ధస్ఫటికసన్నిభః ।
ఇహభుక్త్వాఖిలాన్ భోగాన్ పుత్రపౌత్రాది సంయుతః ।
దేహాంతే దివ్యమారుహ్య విమానం సూర్యసన్నిభం ।
దివ్యమాల్యాంబరధరో దివ్యగంధానులేపనః ।
దివ్యనారీగణైర్దివ్య చామరైరభివీచితః ।
దేవగంధర్వసిద్ధైశ్చ స్తూయమానో నిరంతరం ।
ప్రాప్యవిష్ణుపురంతత్ర చిరకాలం వసేన్నరః ।
తత్రత్యానఖిలాన్ దివ్య భోగాన్ భుక్త్వాయథేప్సితం ।
కర్మక్షయాదిహాగత్యా ప్రతాపహతశాత్రవః ।
రూపసౌభాగ్యసహిత సప్తద్వీపాధిపోభవేత్ । ౬౪

శ్రీమత్స్యపురాణే శ్రీమూర్తిదానవిధిః.

తా. మనువుచే ఈరీతిగా చెప్పబడినటువంటి మత్స్యుడు ఆమనువును గురించి, అయ్యా, రాజా, ఈవిషయము నీచేత చక్కగా ప్రశ్నింపబడినది. సాలగ్రామవైభవమును, విధిప్రకారముగా దాని దానమును, దేశకాలఫలములను, ఇవియన్నియు, చెప్పుతున్నాను. సావధానముగా వినుము. ఏదేశమునందు సాలగ్రామము యుండునో, ఆసమీపమునందు నివసించుచున్న జనులకు లేశమాత్రము పాపము కలుగనేరదు. సాలగ్రామశిల నుండి జారిపడినట్టి జలబిందువు ఎవనియొక్క దేహమును స్పర్శించునో, ఓరాజా, అట్టిమనుజుడు, గోహత్యచేసిన వాడైనను, కృతఘ్నుడైనను, బ్రహ్మహత్య, భ్రూణహత్యాదులను చేసిన వాడైనను, గురుభార్యతో సంయోగము చేసిన వాడైనను, దొంగతనము చేసినవాడైనను, సమస్తపాపములచేతను విడువబడినవాడై, దోషరహితమైనదియు, పునరావృత్తిరహితమైనదియు, పాపులచే పొందకూడనిదియు, యోగులకు కూడ దుర్లభమైనట్టిదియు నగు విష్ణులోకమును పొందుచున్నాడు. ఈవిషయమునందు ఎంతమాత్రమును సంశయములేదు. గాకను చక్రముతోగూడినట్టి సాలగ్రామశిల ఎవనిగృహమునందుండునో, ఆగృహమే వైకుంఠమని విద్వాంసులు చెప్పుదురు. సాలగ్రామశిల, తులసీవృక్షము, కమలవనము, ఎచటనుండునో అచ్చట విష్ణువు సన్నిహితుడుగా నుండును. గాకను సమస్త తీర్థములు అచ్చట వసించును. గనుక ఓ, మహారాజా, నదీతీరమందుగాని, అథవా తనగృహమునందే గాని, ఇట్టి మహిమ గల సాలగ్రామమును దానము చేయవలెయునని ఎవనికి ఇచ్ఛ కలుగునో, అతడు, ఆగ్నేయ్యప్రదేశముల యందలి భూమిని నీళ్లతోగూడిన గోమయముచేత నలికి, పంచవర్ణములు గల

పిండితో పద్మమువ్రాసి దానిమీద మానుపీఠముగాని, తామ్ర పీఠముగానివేసి, క్రొత్తపట్టువస్త్రమునుకప్పి, దానిమీద మత్స్య కూర్మాది చక్రములు కలిగిన శుభ మగు కేశవాది యిరువది నాలుగు రూపములు గల అత్యంత మనోహరముగా, చక్రశుద్ధి, శిలాశుద్ధి, వర్ణశుద్ధి గల ఈమూర్తిని యుంచి యథావిధిగా ధ్యానాదిషోడశోపచారపూజలచేత పూజింప వలెయును, పాప హారకము లగు రామాష్టోత్తరనామములచేతగాని, నృసింహాష్టోత్తర నామములచేతగాని, కృష్ణాష్టోత్తర నామములచేతగాని, చక్కగా పూజచేసి ధూపదీపనైవేద్యములచేత సంతోషపరచి, ముందు చెప్పెడి మంత్రముచేత, సదాచారనిష్ఠుడగు, శ్రోత్రియుడును అగు బ్రాహ్మణునికొఱకై విధిననుసరించి ఉదక పూర్వకముగా దాన మియ్యవలెయును. యథాశక్తి కనుగుణముగా, నిష్కముగాని, నిష్కార్ధముగాని, దానిలో సగముగాని దక్షిణ యివ్వవలెయును (నిష్కమనగా ముక్కాలు తులము.) ఈప్రకారముగా ఈసాలగ్రామశిలను ఏమనుష్యుడు, అయిన కాలములయందుగాని, విషుకాలములయందుగాని, గ్రహణ పర్వములయందుగాని, ద్వాదశి, సంక్రాంతులయందుగాని, వివాహాదికర్మములయందుగాని, యజ్ఞోత్సవములయందుగాని, గృహ గ్రామప్రవేశములయందుగాని ఇచ్చునో, అట్టిమనుజుడు బ్రహ్మహత్యాదులవల్ల కలిగిన దోషములనుండియు అతిపాతకము, అనుపాతకము, ఉపపాతకము, సంకలీకరణము, మలినీకరణము, అపాత్రీకరణము, జాతిభ్రంశకరము, ప్రకీర్ణకము మొదలగు పాపములనుండి పరిహరింపబడినవాడై ఇహలోకమందుగల సమస్త భోగభాగ్యములను, పుత్రపౌత్రాదులతోడ ననుభవించి దేహాంతమందు సూర్యకాంతిని బోలు దివ్యవిమానారూఢుడై, దివ్య

మాల్యాంబరధరుడై, దివ్యగంధానులేపనుడై, దివ్యచామరములచేత వీచెడి దివ్యస్త్రీసమూహముతో గూడినవాడై దేవగంధర్వసిద్ధులచే ఎల్లపుడును పొగడ్తనొందుచు విష్ణుపురమును పొంది అచ్చట చిరకాలము వసించు వాడగును. అచట దేవతాసంబంధ మగు భోగభాగ్యములను ఇష్టానుసారముగా ననుభవించి కర్మక్షయమైన పిమ్మట హతశత్రుడగు సప్తద్వీపాధిపతియైన రాజుగా జన్మించును. ఈప్రకారముగా మత్స్యపురాణమునందు శ్రీమూర్తిదానవిధి చెప్పబడియున్నది.

-[ రాహుదశాయాం కేతుభుక్తౌ కేతుప్రీతికర నాగదానం. ]-

శ్లో॥ రాహోరంతర్గతే కేతౌ భ్రమణం రాజవిప్లవం।
వాతజ్వరాదిరోగంచ క్షుద్రశూన్యాది రోగకృత్ ।
దారాపుత్రాదిరోగంచ కేతౌ పాప యుతేపివా।
తద్దోషశమనార్థాయ నాగదానం చకారయేత్ ।
యామళోక్త విధానేన విధిం విధివదాచర।
చంద్రదశాయాం కుజభుక్తివత్॥ 65

తా. రాహుదశలో కేతుభుక్తియందు బుద్ధివికారమును, రాజబాధయు, వాతజ్వరాదిరోగసంభవమును, క్షుద్రసంబంధమగు శూన్యాదిరోగభయమును, భార్యాపుత్రపీడయు కేతువు పాపగ్రహసంబంధము కలిగియుండగా సంభవించును. ఆదోషపరిహారార్థమై చంద్రదశలో కుజభుక్తియందు చెప్పినరీతి యామళోక్త ప్రకారముగా నాగదానము చేయువలెయును.

-[ రాహుదశాయాం శుక్రభుక్తౌ శుక్రప్రీతికరదుర్గాదానం. ]-

శ్లో॥ రాహోరంతర్గతే శుక్రే షష్ఠాష్ట వ్యయరాశిగే।
పాపగ్రహేణసంయుక్తే నీచారి క్షేత్రగేపివా।
కుక్షిబాధశిరోరోగః నేత్రరోగో మనోవ్యథా।

తద్దోషపరిహారార్థం దుర్గాదానేన శామ్యతి ।
ఏవంయః కురుతేదానం ఆయురారోగ్య వర్ధనం ।
చంద్రదశాయాం గురుభుక్తివత్ । 66

తా. రాహుదశలో శుక్రభుక్తియందు శుక్రుడు6-8-12 రాసులయందున్నను, పాపగ్రహసంబంధము కలిగియున్నను, నీచశత్రుక్షేత్రములయందున్నను, ఆకాలమందు కుక్షిబాధయు, శిరోరోగంబును, నేత్రరోగమును, మనోవ్యథయును, కలుగును. ఆదోషపరిహారార్థమై దుర్గాదానముచేసిన యెడల శాంతికలుగును. ఈప్రకారముచంద్రదశలో గురుభుక్తియందు చెప్పిన విధి ననుసరించి దానమిచ్చినయెడల ఆయురారోగ్యాభివృద్ధికలుగును.

-[ రాహుదశాయాం రవిభుక్తౌ రవిప్రీతికర తిలపద్మదానం. ]-

శ్లో॥ రాహోరంతర్గతే సూర్యే వ్యయస్థే నీచరాశిగే ।
త్రిషష్ఠలాభపయుతే మారకేశేన సంయుతే ।
తద్భుక్తౌపితరంహంతి ద్రవ్యనాశో పశుక్షయః ।
శరీరేరోగపీడాస్యాత్సమాన జననాశనం ।
తద్దోషపరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్ ।
తిలపద్మప్రదానం స్యాత్సర్వారిష్టవినాశనం॥ 67

తా. రాహుదశలో సూర్యభుక్తియందు సూర్యుడుపండ్రెండవ యింటియందున్నను నీచరాశియందున్నను 3-6-11 స్థానాధిపతులతోడకలిసియున్నను, మారకాధిపతితోడ కలిసియున్నను, ఆభుక్తియందు పితృగండమును, ద్రవ్యనాశమును, పశుక్షయమును, శరీరమందు రోగపీడయు, సమానజననాశనంబును, కలుగును ఆదోషపరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలెయును. తిలపద్మ దానమిచ్చుటవలన సకలవిధ అరిష్టములు నశించును.

హేమాద్రౌ॥

తిలపద్మ దానరచనా.

శ్లో॥ ఏతద్దానంచికీర్షుః గ్రహణాదిపుణ్యకాలేషు। స్వగృహే గోమయానులేపి తరంగవల్ల్యాది విరచిత భూభాగోపరి। ద్రోణ మాత్రతిలైః। అష్టదళపద్మం విలిఖ్య। తదుపరి తిలపూరిత తామ్రపాత్రం నిక్షిప్య। తదుపరి పలత్రయార్థమిత సువర్ణేన అష్ట దళపద్మం నిధాయ। కుంకుమవర్చితం వస్త్రద్వయేన సంవేష్ట్య। ఏవం రచయిత్వా యజమానః దేశకాలౌ సంకీర్త్య దాన సంకల్పం కుర్యాత్॥ 68

తా. సూర్య ప్రీతికరముగా తిలపద్మ దానమిచ్చుటయం దిచ్ఛగల పురుషుడు గ్రహణాది పుణ్య కాలములయందు స్వగృహమున గోమయముచేత నలికి రంగవల్ల్యాదులను పెట్టిన భూప్రదేశమునందు నూగులలో అష్టదళపద్మము లిఖించి దాని మీద నూగులతో నిండియున్న తాంబ్రపాత్రమునుంచి అందు మీద మూడుతులముల బంగారుతో చేయబడిన అష్టదళపద్మము నుంచి కుంకుమము పెట్టబడిన రెండువస్త్రములను యుంచి దాన మిచ్చునట్టి యజమానుడు దేశకాలాదుల ననుసరించి దాన సంకల్పము చేయవలెయును

శ్లో॥ మమ ఇహజన్మ నిజన్మాంతరేషు సంభావితానాం।
గురుభార్యా గమన పశు యోనిరేతో విసర్జన।
గురుసమర్పిత ద్రవ్యహరణా దీనాం మూత్రకృచ్ఛ్ర।
నిదానభూతానాంసర్వేషాం పాపానాంనివృత్తిద్వారా।
శరీరేవర్తమాననానారోగ నివృత్త్యర్థందృఢకాయతయా।
శతవర్ష జీవిత్వ సిద్ధ్యర్థం సకలాభీష్ట ప్రదాయక ॥ 69

—{ శ్రీసూర్యనారాయణ ప్రీత్యర్థం బోధాయనోక్త ప్రకారేణ తిలపద్మదానం కరిష్యేతి సంకల్ప్య॥ }—

తా. నాకు ఈజన్మమందును, జన్మాంతరములయందును సంభవించిన గురుభార్యా గమనదోషమువల్లను, పశుయోని యందు రేతస్సు విసర్జించిన దోషమునను, గురువునకు సమ ర్పించిన ద్రవ్యము నపహరించిన దోషమువల్లను గలుగదగిన మూత్రకృచ్ఛ్రాది రోగములను, సకలవిధపాపములను నివర్తిం చుటకొఱకును, శరీరమందు ఈకాలమందు కలిగియున్న నానా విధరోగబాధలుతొలగి, ధృఢశరీరము వచ్చుటకును, పూర్ణా యుస్సు కలుగుటకును, కోరినకోరికలెల్లను సిద్ధించుటకును, సూర్యనారాయణప్రీతికొఱకై బోధాయనోక్త ప్రకారముగా తిలపద్మదానము చేయుటకై సంకల్పము చేయవలెయును.

శ్లో॥ తత్పద్మే సూర్యమావాహ్య - సూర్యాయనను ఇతి మంత్రేణ రక్తగంధపుష్పాక్షత పరమాన్న నైవేద్యాదిభి ష్షోడ శోపచారపూజాం కుర్యాత్ ॥ అహితాగ్నిం విప్రం వస్త్రా దై రభ్యర్చ్య దద్యా ద్దానమాత్రః ॥ 70

తా. ఆపద్మమందు సూర్య భగవానుని, ఆవాహనచేసి, సూర్యాయనమః మొదలగు మంత్రములచేత రక్తగంధపుష్ప, అక్షతలతోడ పూజించి పరమాన్న నైవేద్యాదులతోడ షోడ శోపచారపూజలుచేసి అహితాగ్నిని, బ్రాహ్మణుని వస్త్రాదులచేత అభ్యర్చించి:—

శ్లో॥ ఖగఃపూషాపతంగోర్కః ద్వాదశాయాత్మా త్రయీతనుః ।
పద్మేనానేన దత్తేన ప్రీతస్తరణి రస్తుమే ।

అస్మై బ్రాహ్మణాయ శ్రీసూర్యనారాయణ స్వరూపాయ, శ్రీసూర్యనారాయణ ప్రీత్యర్థం - భూభాగోపరిగో, మయాను

లేపిత - రంగవల్ల్యాదిరచిత ద్రోణపరిమిత - తిలనిర్మితం తిల పూరిత తామ్రపాత్రోపరిస్థిత పలపరిమాణ స్వర్ణనిర్మిత వస్త్ర వేష్టిత స్వర్చితం పద్మాధిష్ఠితం సర్వలక్షణ లక్షితం - స్వర్చితం తిలపద్మం పూర్వోక్త ఫల కామయమాన - ఇతిదత్వా దేయ ద్రవ్య తృతియాంశం దక్షిణాం దద్యాత్ । బోధాయనోక్త తిలపద్మ దానవిధిః । 71

తా. పైనచెప్పిన రీతిగా దానమంత్రములను పఠించి శ్రీసూర్యనారాయణ స్వరూపుడైన బ్రాహ్మణుని శ్రీసూర్య నారాయణ ప్రీత్యర్థముగా భూభాగముమీద గోమయముచేత నలుకబడి రంగవల్ల్యాదులు రచించి మూడుతూములు నూగు లచే నింపబడిన తాంబ్రపాత్రమీాద మూడుతులముల పరి మాణ బంగారుతో చేయబడి, వస్త్రముచేత నలంకరింపబడి భక్తితోడపూజింపబడి, సర్వలక్షణలక్షితములతో గూడినట్టి తిలపద్మమును పూర్వోక్త ఫలములు సిద్ధించుటకొఱకై దాన మాల్యములో తృతీయాంశము దక్షిణతో కూడ బ్రాహ్మణునకు దానమియ్యవలెయును. ఇట్లు బోధాయనోక్త ప్రకారముగా తిలపద్మదానవిధి చెప్పబడియున్నది.

[రాహుదశాయాం చంద్రభుక్తౌ చంద్రప్రీతికర వహ్నిదానం.]

జ్యోతిషార్ణవే॥

శ్లో॥ రాహోరంతర్గతే చంద్రే నీచషష్ఠాష్టరాశిగే ।
క్రూరగ్రహేణ సంయుక్తే మారకగ్రహ సంయుతే ।
తద్భుక్తావతిసారాదీ క్షయరోగాది సంభవం ।
తద్దోషపరిహారార్థం వహ్నిదానం చకారయేత్ । 72

తా. రాహుదశలో చంద్రభుక్తియందు చంద్రుడు నీచరాశియందున్నను, 6-8 రాసులయందున్నను, క్రూరగ్రహ

ములతోడ కలిసియున్నను, మారక లక్షణములతో గూడిన గ్రహసంబంధము కలిగియున్నను, ఆభుక్తియందు అతిసారాది క్షయరోగసంభవము కలుగును. ఆదోషపరిహారార్థమై అగ్ని ప్రతిమా దానమియ్యవలెయును.

హేమాద్రౌ॥

వహ్నిమూర్తి దానరచనా.

ఏతద్దానంచికీర్షు రయనాది పుణ్యకాలేషు । ఉపద్రవ కాలేషువా దేవాలయాది పుణ్యదేశేషు భూభాగోపరిరక్త వస్త్రంప్రసార్య,తత్ర విభవానుసారేణఫలమితేన,అర్ధపలమితేన వానువర్ణేన అగ్ని ప్రతిమాంకారయిత్వా - నిధాయ - రక్త వస్త్రేణ సంవేష్ట్య ఏవంరచయిత్వా దానసంకల్పం కుర్యాత్ ॥

తా. వహ్నిమూర్తి దానముచేయ నిచ్ఛగల పురుషుడు అయనాది పుణ్యకాలముల యందును, గ్రహణాది ఉపద్రవ కాలముల యందును, దేవాలయాది పుణ్యదేశములయందు శుద్ధమైన భూప్రదేశంబున రక్తవస్త్రమునుపరచి దానికితగినట్టుగా మహావైభవముతోడ బంగారు అగ్నిప్రతిమనుచేసి స్థాపించి రక్తవస్త్రము ధరించి దానసంకల్పము చేయవలెయును.

శ్లో॥ ఏవంగుణేత్యాది మమ ఇహజన్మని పూర్వజన్మని।
సంభావితానాంస్మార్తాగ్ని నిర్వాపత్రేతాగ్నినిర్వాపాదీనాం।
అతిసారాది రోగనిదాన భూతానాం పాపానాం।
నివృత్తిద్వారా మమ శరీరే వర్తమాన అతిసారరోగ।
నిరాకరణార్థం సర్వమంగళా వ్యాప్త్యర్థం।
శ్రీవహ్నిప్రీత్యర్థం బోధాయనోక్త ప్రకారేణ।
వహ్నిమూర్తిదానం కరిష్యే ॥ ఇతిసంకల్ప్య॥ 74

తా. ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ ఇత్యాది సంకల్పముతో తాను ఈజన్మమందును పూర్వజన్మమందు చేసిబడినట్టియు, స్మార్తాగ్ని, త్రేతాగ్నులను, ఆర్చినట్టియు, పాపములును, అతిసారాది రోగములును తొలగి శరీరమందు ఇపుడు కలిగియున్న అతిసారాది రోగము నివర్తియై సర్వమంగళములు లభించుటకొఱకై శ్రీవహ్ని ప్రీత్యర్థముగా బోధాయనోక్త ప్రకారముగా వహ్నిమూర్తి దానమిచ్చుటకై సంకల్పము చేయవలెయును

ధ్యాయేత్॥

శ్లో॥ జ్వాలాజ్వాలాంకులాం రక్తచందనేన విభూషితాం।
రక్తేనవాససాచ్ఛన్నాం మేషస్యోపరి సంస్థితాం।
పింగభ్రూశ్మశ్రుకేశాఢ్యాం పింగాక్షిత్రికయాన్వితాం।
చతుర్భుజాంశక్తివర స్రువాభయ ధరాంశివాం।
రక్తమాల్యేన సంవీతాం ముక్తాదామ పరిష్కృతాం।
కనకాచల వర్ణాభ్యాం ద్వాదశార్క ప్రభానిభాం।
వహ్నిమూర్తిం చింతయామి సర్వసంపత్ప్రదాయినీం॥
ఏవంధ్యాత్వా అగ్నిర్మేనమ ఇతిమంత్రేణ।
వాగ్నిందూత మితివైదిక మంత్రేణవా।
రక్తగంధాద్యైః షోడశోపచారపూజాం కృత్వా।
బ్రహ్మవిద్యావిశారదం విప్రమాహితాగ్నిం।
వస్త్రాంగులీయకర్ణా భరణాద్యైరభ్యర్చ్య।
దద్యాద్దానమంత్రః॥ 75

తా. పైనచెప్పిన ధ్యానమంత్రములను పఠించి భక్తితోడ ప్రార్థించి రక్తగంధాదులతోడ షోడశోపచారపూజ చేసి బ్రహ్మవిద్యా విశారదుడును, అహితాగ్ని సంస్కారము

లను చేయువాడును యోగు బ్రాహ్మణునకు వస్త్రము, ఉంగు రము, కర్ణాభరణాదులను యిచ్చి పిమ్మట ఈక్రింద చెప్పెడి ప్రకారముగా ధ్యానమంత్రములను చెప్పి,

శ్లో॥ త్రేతాయాంపోగ్ని వర్ణ స్త్వ మంతశ్చ రసివై నృణాం।
త్వంవేధపాపసంఘాతం రోగాదీంశ్చ వినాశయ।
అస్మై అహం ఇమాం భూభాగో పరి ప్రసారిత।
రక్తవస్త్రోపరిస్థిత స్వర్ణనిర్మితాం సర్వలక్షణలక్షితాం॥

స్వర్చితాం వహ్నిప్రతిమాం యథానుపూర్వోక్త ఫలకా మస్తుభ్యమహం, సంప్రదదేనమ మేతిదత్వా - యథాశక్తి దక్షిణం దద్యాత్॥ ఇతి బోధాయనోక్త వహ్నిదానవిధిః. 76

తా. భక్తితోడ పూజించి భూభాగముమీద నుంపబడి రక్తవస్త్రములను సమర్పింపబడి, బంగారుతో చేయబడి సర్వ లక్షలక్షితంబై ప్రకాశించుచూ, పూజింపబడినట్టి అగ్నిప్రతి మను పూర్వోక్త ప్రకారము ఫలము సిద్ధించుటకొఱకై యథా శక్తి దక్షిణతోడ బ్రాహ్మణునకు దానమియ్యవలెయును. ఇట్లు బోధాయనోక్తప్రకారముగా వహ్నిదానవిధి చెప్పబడియున్నది.

—[రాహుదశాయాం కుజభుక్తౌ కుజప్రీతికరనాగదానం.]—

శ్లో॥ రాహోరంతర్గతే భౌమే నీచమస్థాష్ట రిష్ఫగే।
ద్యూనేనాపాపసంయుక్తే రాజద్వేషో మహద్భయం।
వ్రణచోరాగ్ని బాధాస్యాత్ స్ఫోటకాది జ్వరస్తథా।
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్యం సు పూజయేత్।
నాగదానం ప్రకుర్వీత సర్వారిష్ట వినాశనం।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర॥ 77

చంద్రదశాయాం కుజభుక్తివత్.

తా. రాహుదశలో కుజభుక్తియందు కుజుడు నీచస్థాన మందున్నను, 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తమ రాసులయందున్నను, పాపగ్రహములతో కూడియున్నను, ఆ భుక్తియందు రాజద్వేషమును, విశేషభయమును, వ్రణ బాధయు, చోరభయమును, అగ్నిభీతియు, స్ఫోటకాది జ్వర సంప్రాప్తియు, కలుగును. ఆదోష పరిహారార్థమై సుబ్రహ్మణ్య పూజ చేయవలెయును నాగదానము చేసిన పిమ్మట సకలవిధ అరిష్టములు నశించును. యామళోక్త ప్రకారముగా చంద్ర దశా కుజభుక్తియందు చెప్పిన విధి ననుసరించి దానము చేయ వలెయును.

—[ గురుదశాయాం గురుప్రీతికర స్వర్ణపద్మదానం. ]—

యామళే।

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి గురుప్రీతి కరంపరం।
స్వర్ణపద్మమితిఖ్యాతం దానానా ముత్తమోత్తమం।
దుస్థానస్థ స్సురాచార్యః కరోతి వివిధాపదః।
రాజామాత్య భయంశత్రు భయంమృత్యు భయంతథా।
బలవద్వైరమత్యంతం కార్యారంభేషు విఘ్నతాం।
కార్యాణాంచైవ వైఫల్యం తస్మాత్తద్దోషశాంతయే।
దానమేతత్తుకర్తవ్యం సర్వసౌభాగ్యవృద్ధయే।
జన్మర్క్షే గ్రహయోగేవా గురువారే విశేషతః।
దేవాలయే గృహేవాపి గోమయాలేపి తేస్థలే।
ద్రోణత్రయమితైశ్శాలి ధాన్యైరాశింతు కారయేత్।
తత్రస్వర్ణమయంపద్మం కర్షద్వయ వినిర్మితం।
దశాష్టకసమాయుక్తం కర్ణికా కేసరాన్వితం।
పీతవస్త్రేణసంవేష్ట్య ధ్యాత్వా సమ్యక్ప్రపూజయేత్। 73

తా. దానము లన్నిటిలోను యుత్తమమైనటువంటి దియు, గురుప్రీతికరముగా నుండునట్టిదియు నగు స్వర్ణపద్మదాన విధిని బృహస్పతి దుస్థానములయం దుండుటవల్లకలిగెడు వివిధ అరిష్టములు తొలగుటకొఱకై చెప్పుచున్నాను. గురువు దుస్థానములయం దున్నయెడల రాజభయమును, మంత్రులవల్ల పీడయు, శత్రుభీతియు, మృత్యుభయమును, బలవంతులవిశేష ద్వేషమును, కార్యారంభమునందు విఘ్నమును, కార్యముల యందు నిష్ఫలంబును, కలుగును. ఆదోషపరిహారార్థమై స్వర్ణ పద్మ దానము చేసినయెడల సర్వసౌభాగ్యములు లభించును. జన్మ నక్షత్రమునందుగాని, గ్రహ యోగములయందుగాని, విశేషముగా గురువారము సందుగాని, దేవాలయమునందైనను, లేక యింటియం దైనను, గోమయముచేత శుద్ధిచేయబడిన భూప్రదేశమునందు మూడుతూములు వడ్లు రాశిచేసి అచట బంగారుతో చేయబడిన పద్మమును, నాలుగున్న రూకఎత్తుతూ నిక గలదిగాను, ఎనుబదిమూలలు గలదై, కర్ణికాదిపద్మ విశేష ములతో గూడి, పీతవస్త్రమును ధరింపచేసి ధ్యానించి యథా విధిగా పూజింపవలెయును.

ధ్యానం॥

శ్లో॥ వరాక్షమాలాదండంచ కమండలం ధరంవిభుం।
పుష్యరాగాన్వితం పీతవస్త్రగంధానులేపనం ।
ఏవంధ్యాత్వాచ ఏవాపిత్రేతి మంత్రేణ పూజయేత్ ।
పీతగంధాక్షతైః పుష్పైః ప్రాగాద్యష్ట దళేథవా ।
పూజయేన్నాభిస్తేవ్వతై ర్వక్ష్యమాణై ర్నమోంతకైః॥

తా. పైచెప్పిన మంత్రములచేత ధ్యానించి ఏవాపిత్రేతి

మంత్రములచేత పూజించి పీతగంధాక్షతాది పుష్పములను సమర్పించి నామపూజ చేయవలెయును.

సామాని॥

శ్లో॥ దేవాచార్యో వాక్పతిశ్చ గీర్వాణ మతిదాయకః।
ఋగ్వేదాధి పతిశ్చైవ శిక్రామాత్యో గురుస్తథా।
జీవఆంగీరసశ్చైవ హ్యష్టభిర్నామభిక్రమాత్।
ఏభిస్సంపూజ్యధూపాదీన్ దత్వావదక్ష్యన్నముత్తమం।
నివేద్యవిప్రంసంపూజ్య పీతవస్త్రానులేపనైః।
దద్యాదనేనమంత్రేణ తత్పద్మం జలపూర్వకం। 80

తా. దేవాచార్యః, వాక్పతిః, గీర్వాణమతిగాయకః, ఋగ్వేదాధిపతిః, శిక్రామాత్యః, గురుః, జీవః, ఆంగీరసః, ఈప్రకారముగా అష్టనామపూజచేసి ధూపదీపాదినైవేద్యాదులను సమర్పించి అటుపిమ్మట బ్రాహ్మణుని పూజించి పీతవస్త్రము నిచ్చి జలపూర్వకముగా పద్మమును దానముచేయుటకొఱకై దానమంత్రమును పఠించి,

మంత్ర॥

శ్లో॥ శాలిధాన్యోపరిగతం సౌవర్ణ స్వర్ణితంగురుం।
దదామిసర్వకామార్థ సిద్ధింమే సర్వదాకురు।
ఇతిదత్వాదక్షిణాంచ దద్యాద్విత్తాను సారతః।
అనేనవిధినాస్వర్ణ పద్మదానం సమాచరేత్।
సర్వపాపవినిర్ముక్త స్సర్వకంటకవర్జితః।
అవ్యాహతప్రతాపశ్చ బుద్ధిమాన్నీతిమానపి।
గ్రహదోషవినిర్ముక్త స్సుఖీభవతిమానవః।
ఇతియామళే గురుప్రీతికర స్వర్ణపద్మదానవిధిః॥ 81

తా. సకలవిధకామార్థములును ఎల్లప్పుడును కలుగుట

కొఱకై శాలిధాన్యము పైన యుంచబడిన బంగారుపద్మమును యథాశక్తి దక్షిణతోడ విధిప్రకారముగా బ్రాహ్మణునకు దాన మిచ్చిన యెడల సర్వపాపములుతొలగి సకలవిధపీడలు నివర్తియై కొట్టబడని ప్రతాపమును, బుద్ధియు, నీతియు కలిగి మానవుడు విశేషసుఖము ననుభవించును. ఇట్లు యామళ గ్రంథమునందు గురుప్రీతికరంబైన స్వర్ణపద్మదానవిధి చెప్పబడియున్నది.

[గురుదశాయాంగురుభుక్తౌ గురుప్రీతికరస్వర్ణప్రతిమాదానం.]

శ్లో॥ గురోరంతర్గతే జీవే నీచేవాస్తం గతేపివా।
ద్విసప్తమాష్టమేరిప్ఫే షష్ఠేవా పాపసంయుతే।
తద్భుక్తౌ జ్వరరోగాది పాండురోగాది సంభవం।
ధననాశోమానహాని రపమృత్యు భయంభవేత్।
తద్దోషపరిహారార్థం శ్రీరుద్రజపమాచరేత్।
సువర్ణప్రతిమాదానం కుర్యాచ్ఛాంతి మవాప్నుయాత్॥

తా. గురుదశలో స్వభుక్తియందు గురువు నీచయందున్నను, అస్తంగతుడై యున్నను, ద్వితీయసప్తములయందున్నను, 6-8-12 రాసులయందున్నను, పాపగ్రహసంబంధము కలిగియున్నను, ఆభుక్తియందు జ్వరప్రాప్తియు, పాండురోగాది సంభవమును, ధననాశమును, మానహానియు, అపమృత్యు భయమును కలుగును. ఆదోషపరిహారార్థమై శ్రీరుద్రజపము చేయవలెయును. బంగారు ప్రతిమదానముచేసిన పిమ్మట శాంతి కలుగును.

యామళే॥

సువర్ణప్రతిమాదానం.

శ్లో॥ బృహస్పతేస్తుప్రతిమాదానం వక్ష్యామిసాంప్రతం।
బలహీనోగురౌకార్యం దానమేతన్నరైశ్శుభం।

జన్మర్క్షేగ్రహయోగేవా గురువారే విశేషతః।
దేవాలయే గృహేవాపి గోమయేనోపలిప్యచ।
చణకై రాఢకమితైః రాశిం కృత్వాథతత్రితు।
పీతవస్త్రం సంప్రసార్య యథాశక్తి సువర్ణతః।
కృత్వాబృహస్పతే స్తస్య ప్రతిమాలం క్షణాన్వితాం।
ధ్యాత్వాప్రాణప్రతిష్ఠాంతు కృత్వాసమ్యక్ప్రపూజయేత్॥

తా. జన్మనక్షత్రమందుగాని, గ్రహయోగమునందుగాని, లేక విశేషముగా గురువారమునందుగాని, దేవాలయమునందైనను, లేక యింటియందైనను, గోమయముచే నలుకబడిన ప్రదేశమున ఒకతూముడు సనిగెల ధాన్యరాశిచేసి అందు పీత వస్త్రమును యథాశక్తి సువర్ణదక్షిణనుబెట్టి సర్వలక్షణములతోగూడిన బృహస్పతిప్రతిమను దానమిచ్చుటకొఱకై ప్రాణ ప్రతిష్ఠచేసి యథావిధిగా పూజచేయవలసినది.

ధ్యానం॥

శ్లో॥ పీతాంభరధరస్స్రగ్వీ సాక్షసూత్రకమండలం।
చతుర్భుజో దేవగురు ప్రసన్నో వరదస్సదా।
ధ్యాత్వాబృహస్పతే అతియదర్య ఇతిమంత్రతః।
పీతగంధాక్షతైఃపుష్పైః దధ్యన్నేవచ పూజయేత్।
తతో బ్రాహ్మణమాహూయ దద్యాన్మంత్రమిమంపఠన్॥

మంత్రః॥

శ్లో॥ పీతాంబరః పీతవపుఃకిరీటీచతుర్భుజో దేవగురుః ప్రశాంతః।
దధాతి దండంచ కమండలం య స్తథాక్ష
సూత్రం వరదోస్తుమ్యహాం॥
ఇతిదత్వాదక్షిణాంతు దద్యాద్విత్తానుసారతః।
అనేనవిధినాయస్తు దానమేతత్సమాచరేత్।

గురుదోషవినిర్ముక్తః పుత్రపౌత్ర సమన్వితః ।
రూపవాన్ సుభగశ్శ్రీమాన్ జీవేద్వర్ష శతంనరః ॥ 84
ఇతియామళే సువర్ణప్రతిమాదానవిధిః

తా. పైచెప్పిన మంత్రములచేత ధ్యానముచేసి పీత గంధాక్షత పుష్పాదులచేత పూజించి నైవేద్యాదుల నొసంగి బ్రాహ్మణునకు దానమిచ్చుటకొఱకై మంత్రపఠన చేయవలె యును. ఇట్లు మంత్రములను పఠించి యథాశక్తి దక్షిణతోడ విధ్యుక్త ప్రకారముగా దానము చేసినయెడల గురుదోషము నివృత్తియై పుత్రపౌత్రాభివృద్ధికలిగి, రూపవంతుడును, మంచి భాగ్యవంతుడును, కీర్తివంతుడును, నూరుసంవత్సరముల ఆయుష్షు గలవాడును, అనగా పూర్ణాయుర్దాయము గల వాడును యగును. ఇట్లు యామళమునందు బంగారుప్రతిమా దానవిధి చెప్పబడియున్నది.

[గురుదశాయాం శనిభుక్తౌ శనిప్రీతికర కృష్ణమృగదానం.]

జ్యోతిషార్ణవే॥

శ్లో॥ గురోరంతర్గతేమందే నీచారి క్షేత్రసంస్థితే ।
షష్ఠాష్టమవ్యయగతే మారకగ్రహసంయుతే ।
తత్కాలే వాతరోగేణ కుక్షిశూలేన బాధ్యతే ।
స్థాననాశోమానభంగో హ్యపమృత్యు భయంభవేత్ ।
తద్దోషపరిహారార్థం దానంకృష్ణమృగస్యవై ।
మృత్యుసూక్తం పఠేద్యస్తు హ్యపమృత్యు నివారణం॥ 85

తా. గురుదశలో శనిభుక్తియందు శనినీచక్షేత్రమం దున్నను, శత్రుక్షేత్రమందున్నను, 6-8-12 రాసులయం దున్నను, మారకలక్షణములతో గూడిన గ్రహసంబంధము కలిగియున్నను, ఆకాలమందు వాతరోగములును, కుక్షిబా

ధయము, స్థాననాశమును, మానభంగమును, అపమృత్యుభయ
మును కలుగును. ఆదోషపరిహారార్థమై నల్లనిమృగదానము
చేయవలెయును. మృత్యుసూక్తము పఠించిన యెడల అప
మృత్యువు నివారణ యగును.

హేమాద్రౌ॥ కృష్ణమృగదానరచనా.

శ్లో॥ ఏతద్దానం చికీర్షుకర్తా అయనాది పుణ్యకాలేషువా।
ఉపద్రవకాలేషువా। దేవాలయాది పుణ్యదేశేషు। స్వగృ
హేవా। దశపలపంచపలసార్ధ ద్విపలపరిమితేనవా। తామ్ర
నిర్మితపృష్ఠం రజితశృంగోపేతం। కృష్ణమృగం ఆఢకత్రయపరి
మిత తండులరాశ్యుపరి ప్రాఙ్ముఖం నిధాయ। వస్త్రేణసంవేష్ట్య।
తస్యచతురుషుపాదేషు దధిమధ్వాజ్యక్షీరపూరితాని చత్వారి
కాంస్యపాత్రాణినిక్షిప్య। ఏవం రచయిత్వా దానసంకల్పం
కుర్యాత్॥ ఏవంగుణేత్యాదిమమఇహజన్మని। సంభావితానాం
దేవద్రవ్య హరణస్వామి ద్రోహాదీనాం వాతాది రోగనిధాన
భూతానాం సర్వేషాం పాపానాం నివృత్యర్థం సర్వమంగళా
వాప్త్యర్థం శ్రీమహావిష్ణుప్రీత్యర్థం బోధాయనోక్త ప్రకారేణ
కృష్ణమృగదానం కరిష్య ఇతి సంకల్ప్య॥:—ఓం కృష్ణ
మృగాయనమః ఇతిమంత్రేణ గంధాద్యైష్షోడశోపచారపూజాం
కృత్వా। మృగస్యపశ్చిమేభాగే స్థండిలేగ్నిం ప్రతిష్ఠా। ఆజ్య
భాగాంతంకృత్వా। ఆపాయో భూమీతిమంత్రేణ అష్టావింశతి
సంఖ్యా కపాలాశసమిద్ధోమం। తవవాయువృథస్యేతి మంత్రేణ
అష్టోత్తరశతంసంఖ్యయా ఆజ్యహోమంచకృత్వా। స్విష్టకృదా
దిహోమశేషసమాప్య। బ్రాహ్మణం సుశీలవయోరూపవిద్యా
వినయాన్వితం వస్త్రాద్యైరభ్యర్చ్య దద్యాద్దానమంత్రః॥:— 86

తా. కృష్ణమృగదానమిచ్చుటయందు దిచ్ఛగల పురుషుడు

అయనాది పుణ్యకాలములయందును, ఉపద్రవకాలములయం దును, దేవాలయాది పుణ్యదేశమందైనను లేక తనయింటియం దైనను పదిపలములుగాని, లేక ఐదుపలములుగాని అథవా దానిలో సగము అనగా 2½ పలముగాని పరిమిత గలిగి పృష్ఠ భాగము తామ్రముతో చేయబడి వెండికొమ్ములు గల బం గారు కృష్ణమృగమును మూడుతూముల బియ్యపురాశిమీద పూర్వాభిముఖముగానుంచి వస్త్రముచే నలకరించి దాని యొక్క నాలుగుపాదములయందును, పెరుగు, తేనె, నెయ్యి, పాలుతో నిండిన నాలుగు కాంస్యపాత్రలుపెట్టి ఈప్రకార ముగా రచియించి దానసంకల్పము చేయవలెయును. ఏవం గుణ, విశేషణవిశిష్టాయాం శుభతిథౌ మొదలగు సంకల్ప మంత్రములును పఠించి, ఈజన్మమందును, జన్మాంతరమందును సంభవించిన దేవద్రవ్యము నపహరించినట్టియు, స్వామిద్రోహ ము చేసినట్టియు దోషములవల్ల కలిగెడు వాతాదిరోగము ములును, సకలవిధపాపములును, నివర్తియై సకలశుభములు కలుగుటకొఱకును, శ్రీమహావిష్ణు ప్రీతికరముగను, భోదాయ నోక్త ప్రకారముగా కృష్ణ మృగదానము నిచ్చుటకై సంక ల్పము చేయవలెయును. ఓం కృష్ణ మృగాయనమః మొదలగు మంత్రములచే గంధ, అక్షతాదులను సమర్పించి షోడశోప చారములుచేసి ఆ మృగముయొక్క పశ్చిమభాగమునందు అగ్ని ప్రతిష్ఠచేసి ఆవాహనాది పూజలుసలిపి సమిచ్చర్వాజ్య ద్రవ్య ములచేత నూటఎనిమిది వాయుమంత్రములతోడ ఆజ్యహో మముచేసి స్విష్టకృత్ మొదలయిన హోమశేషమును సమాప్తి చేసి సుశీలము గలవాడును, వయస్సుగలవాడును, రూప వంతుడును, విద్యావంతుడును, వినయవంతుడునుయగు బ్రాహ్మ

ఘుని వస్త్రాదులచేత పూజించి కృష్ణ మృగదానమిచ్చుటకొఱకై దానమంత్రమును పఠించవలెయును.

దానమంత్రః॥

శ్లో॥ అంతశ్చరసిభూతానాం వాయోత్వం లోకపావన।
వామనస్యప్రదానేన వాతవ్యాధి వినాశయ॥

అస్మై అహం గోమయానులేపిత రంగవల్యాది రచిత భూభాగోపరికల్పిత ఆఢకత్రయపరిమిత తండులరాశ్యుపరిస్థితం తామ్రపృష్ఠం రజితశృంగోపేతం। వస్త్రవేష్టిత స్వర్చితం। వాయుదేవతాకం కృష్ణమృగం పూర్వోక్త ఫలకాముస్తుభ్యమిదం సంప్రదదేవ మమేతి దత్వా యథాశక్తి దక్షిణాం దద్యాత్ ఇతిబోధాయనోక్త కృష్ణ మృగదాన పద్ధతిః॥ 87

తా. పైనచెప్పిన ప్రకారము, 'అంతశ్చరసిభూతానాం, వాతవ్యాధి వినాశయ' యనెడి దానమంత్రమును పఠించి, గోమయముచే నలుకబడి, రంగవల్యాదులచే రచింపబడిన భూప్రదేశమునీద మూడుతూముల బియ్యపురాశి మీదుగా నుంచబడిన తాంబ్రపుపిరుదులు గలదియు, వెండికొమ్ములు గలదియు, వస్త్రముచే నలంకరింపబడినదియు, పూజింపబడినదియు, వాయుదేవతా ప్రీతికరంబైనదియు నగు కృష్ణమృగమును, పూర్వోక్త ఫలముల నొసంగుటకొఱకై యథాశక్తి దక్షిణతోడ బ్రాహ్మణునకు దానమియ్యవలెయును. ఇట్లు బోధాయనోక్త ప్రకారము కృష్ణ మృగదానపద్ధతి చెప్పబడియున్నది.

[ గురుదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర మకరదానం. ]

శ్లో॥ జీవస్యాంతర్గతేసౌమ్యే షష్ఠాష్ట వ్యయరాశిగే।
నీచేవాబలహీనేవా దేహజాడ్యం వినిర్దిశేత్।
తద్దోషపరిహారార్థం మకరం దానముచ్యతే। 88

తా. గురుదశలో బుధభుక్తియందు బుధుడు 6-8-12 రాసులయందున్నను, నీచరాశియందున్నను, బలహీనుడైనను ఆభుక్తియందు దేహజాడ్యము కలుగును. ఆదోషపరిహారార్థమై మకరప్రతిమాదానము చేయవలెయును.

హేమాద్రౌ॥

ఏతదానంచికీర్షుః । అయనాది పుణ్యకాలేషు । ఉపద్రవ కాలేషువా । దేవాలయాది పుణ్యదేశేషు । రంగవల్ల్యాదిరచిత భూభాగో పరిజలపాత్రం విన్యస్య। తదుపరిద్విత్రిపలమిత యథా శక్తి రజతేన మకరప్రతిమాంకారయిత్వా । రత్నపుచ్ఛాం స్వర్ణనేత్రా రూప్యకటింరూప్య జిహ్వాంకారయిత్వా । నీలవస్త్ర ద్వయేనసంవేష్ట్య । అగ్రపాదద్వయపురోభాగే ఘృతపూరిత తాంమ్రచషకేవిన్యస్య దాతాదాన సంకల్ప్య కుర్యాత్ ॥ 89

తా. ఈదానమిచ్చుటయందిచ్ఛగల పురుషుడు అయనాది పుణ్యకాలములయందును, ఉపద్రవకాలములయందును, దేవాలయాది పుణ్యప్రదేశములయందు రంగవల్ల్యాదులు రచించిన భూప్రదేశమున జలపాత్రమునుంచి, దానిమీద రెండు మూడుపలములు యథాశక్తి ననుసరించి వెండితో చేయబడిన మకరప్రతిమనుయుంచి దానికి రత్నపుపిరుదులును, బంగారు నేత్రములును, వెండినడుమును, వెండినాలికెయు చేయించి మొదటి రెండుపాదములకు పూర్వభాగమందు నేతితో నింపిన తాంబ్రపు భరణియందుంచి, దానమిచ్చునటువంటి యజమానుడు దానసంకల్పము చేయవలెయును.

శ్లో॥ ఏవం గుణేత్యాది మమ ఇహజన్మని ।
సర్వేషాం పాపానాం నివృత్తిద్వారా ।
మమ శరీరే వర్తమాన రోగహర ।

మకరదానం కరిష్య ఇతి సంకల్ప్య॥
తత్పూజా హోమాదికం కర్తుమాచార్యం వృణుయాత్ ।
ఆచార్యః పునస్సంకల్ప్య కృతం వరుణదేవతాక ।
మకరప్రతిమాం నీలగంధ పుష్పాద్యైరభ్యర్చ్య ।
పూజాస్థానస్య పశ్చిమదిగ్భాగే స్థండిలేగ్నిం ప్రతిష్ఠాప్య ।
ఇమంమే వరుణేతి మంత్రేణ ఆజ్యహోమం ।
తత్వాయామీతి మంత్రేణ చరుహోమం ।
ఆహేడమానో ఇతిమంత్రేణ సమిద్ధోమం ।
ఏవంప్రత్యేక మష్టోత్తరశత సంఖ్యయాకృత్వా ।
స్విష్టకృతాది హోమశేషం సమాప్య ।
తతో యజమానఃతం మకరం సంపూజ్య ।
ఆచార్యం వస్త్రాంగుళీయ కటకకుండలాద్యై ।
రభ్యర్చ్య దద్యా ద్దానమంత్రః॥ 90

తా. ఏవంగుణ, విశేషణ, విశిష్టాయాం శుభతిధౌ మొదలుగాగల సంకల్పముచెప్పి ఈజన్మమందును జన్మాంతరమునందును చేయుబడిన సకలవిధపాపములును నివర్తియై శరీరమందు ఇపుడు కలిగియున్న రోగము పరిహారమగుట కొఱకై మకరదానము చేయుటకుగాను సంకల్పము చేసి ఆటుపిమ్మట పూజ హోమాదులనుచేసి, వరుణదేవతా ప్రీత్యర్థం మకరప్రతిమకు నీలగంధ పుష్పాదులను సమర్పించి పూజాస్థానమునకు పశ్చిమ భాగమునందు అగ్నిప్రతిష్ఠచేసి ఇమంమే వరుణేతిమంత్రముల తో ఆజ్యహోమము చేసి తత్వాయామీతి మంత్రములతో చరుహోమముచేసి ఆహేడమానో ఇతి మంత్రములచేత సమిధ హోమముచేసి ఇవన్నియు ప్రత్యేకప్రత్యేకముగా నూటఎనిమిది హోమములుచేసి స్విష్టకృత్ మొదలగు హోమములను

నమూ ప్తిచేసి అటుపిమ్మట దానమిచ్చునట్టి కర్త ఆమకరమును పూజించి అటుపిమ్మట ఆచార్యునకు, వస్త్రము, ఉంగురము, కటకకుండలములుయిచ్చి దానమంత్రమును పఠించవలెయును.

శ్లో॥ జలాధిదేవదేవేశ పశ్చిమాశావతవిభో।
సంభవద్వ్యాధినాశంమే కరుదానేన తోషితః।
అస్మై బ్రాహ్మణాయ అలంకారసహిత మకరదానప్రతిమా।
ఘృతపూరిత తామ్రచ పాత్రాన్వితాం।
మమ పూర్వోక్తఫల కామస్తుభ్యమహం।
సంప్రదదే నమమేతి దత్వాదాన సాద్గుణ్యార్థం।
స్వశక్తిదక్షిణాం దద్యాత్ యన్వేతాది। 91
ఇతి బోధాయనోక్త మకరదానపద్ధతిః॥

తా. పైనచెప్పి ధ్యానమంత్రములను పఠించి బ్రాహ్మణునకు అలంకార సహితముగా మకరప్రతిమను, నేతితో నింపబడిన తాంబ్రపాత్రముతో కూడ దానమియ్య వలెయును. పూర్వోక్తఫలములు సిద్ధించి దానము సఫలము నొందుట కొఱకై యథాశక్తిదక్షిణకూడ యివ్వవలెయును. ఇట్లుబోధాయనోక్త మకరదానపద్ధతి చెప్పబడియున్నది.

-[ గురుదశాయాం కేతుభుక్తౌ కేతుప్రీతికర మేషదానం. ]-

శ్లో॥ గురోఽంతర్గతే కేతౌ పాపైర్యుక్తే నిరీక్షితే।
క్రూరగ్రహేణ సంయుక్త దోషస్థాన గతోపివా।
తద్భుక్తౌ రాజకలహం ధననాశం తథైవచ।
శిరోభ్రమణ రోగాది కుక్షిశూలాది రోగకృత్।
పాండ్వాది విషరోగాది కర్మాన్వితఫలంత్విదం।
తద్దోషపరిహారార్థం శివలింగార్చనం చరేత్।
మేషదానం ప్రకుర్వీత శాంతి మాప్నోత్యసంశయః॥ 92

తా. గురుదశలో కేతుభుక్తియందు కేతువు పాపులతో కలిసియున్నను లేక చూడబడినను, క్రూరగ్రహ సంబంధము కలిగియున్నను, దోషస్థానముల యందున్నను ఆభుక్తి యందు రాజకలహమును, ధననాశమును, బుద్ధివికారమును, రోగపీడయు, కుక్షిరోగమును, శూలరోగ భయమును, పాండ్వాది విషరోగసంభవమును, పూర్వార్జిత కర్మఫలము ననుసరించి కలుగును. ఆదోషపరిహారార్థమై శివలింగార్చనము చేయవలెయును. మేషదానము చేసిన పిమ్మట నిస్సంశయముగా శాంతి కలుగును.

కర్మవిపాకే॥

ప్రత్యక్షమేషదాన రచనా.

శ్లో॥ ఏతద్దానం చికీర్షుః అయనాది పుణ్యకాలేషు ।
దేవాలయేషు పుణ్యదేశేషువా ।
గోమయానులేపిత రంగవల్ల్యాది రచిత ।
భూభాగోపరి అవ్యంగం తరుణం మేషం ।
ప్రాఙ్ముఖం నిధాయ స్వర్ణశృంగరౌప్య ।
ఖురముక్తా లాంగులై రలంకృత్య ।
కౌశేయవస్త్రేణ సంవేష్ట్య సంభారాన్ ।
సంపాద్య సంకల్పం కుర్యాత్ ॥ 93

తా. ఈదాన మిచ్చుటయం దిచ్ఛగల పురుషుడు అయనాది పుణ్యకాలముల యందుగాని, దేవాలయము నందుగాని, పుణ్యభూమియందుగాని, గోమయముచేత శుద్ధిచేయబడి రంగవల్ల్యాదులచే రచింపబడిన భూప్రదేశము మీద సర్వాంగముల తోడ గూడినదియు, లేతవయస్సు గలదియునగు మేకను, తూర్పుముఖముగా నిలిపి, దానికి బంగారుకొమ్ములు, వెండిగొరి

సెలు ముత్యాలతోక చేయించి అలంకరించి పట్టువస్త్రము కప్పి కావలసిన సామగ్రులను సంపాదించి సంకల్పము చేయవలెయును.

శ్లో॥ మమ పూర్వజన్మని ఇహాజన్మని జన్మాభ్యా ।
సాజ్జన్మప్రభృతి యేతత్క్షణ పర్యంతం ।
పూర్వజన్మకృత విప్రద్రవ్యహారణాది దోషనివృత్త్యర్థం ।
శరీరే ఆయురారోగ్య సిద్ధ్యర్థం ।
ఉమామహేశ్వర ప్రీత్యర్థం మేషదానంకరిష్యేతిసంకల్ప్య।
ఛాగదానవద్విధిం విధాయ పూజాహోమాదికం కుర్యాత్ ॥

తా. పూర్వజన్మము నందును, ఈ జన్మమునందును, జన్మాంతర ప్రభృతి ఈక్షణపర్యంతము, పూర్వజన్మమందు చేయబడిన బ్రాహ్మణుని ద్రవ్యమపహరించుట మొదలగు దోషములు నివర్తియగుటకును, శరీరమందు ఆయురారోగ్యసిద్ధి కలుగుట కొఱకును, ఉమామహేశ్వర ప్రీత్యర్థముగా మేషదానమిచ్చుటకు సంకల్పముచేసి ఛాగదాన విధి ప్రకారముగా పూజాది హోమములు చేయవలెయును.

దానమంత్రః॥

శ్లో॥ దేవానాంయన్ముఖం హవ్యవాహ స్సర్వపూజితః ।
తస్యత్వం వాహనం పూజ్యదేవై స్సేంద్రైర్మహర్షిభిః ।
త్వత్ప్రదానేన మే దేవః వరుణస్సంప్రసీదతు ॥

అస్మై అహం గోమయానులేపిత । రంగవల్ల్యాదిరచిత - భూభాగోపరిస్థిత - ఆఢకత్రయ పరిమిత । ముద్గరాశ్య పరిస్థితం- తామ్రపృష్ఠ స్వర్ణశృంగరౌప్యఖుర ముక్తాలాంగూల వస్త్రవేష్టిత స్వర్చితం అగ్నిదేవతాకం మేషం పూర్వోక్తఫలకామ

స్తుభ్యమిదం సంప్రదదేనమ మేతివత్వా । యథాశక్తి దక్షిణాం దద్యాత్ । తదంగ శివలింగదానం కుర్యాత్ ॥
యథాశక్తి బ్రాహ్మణ భోజనం కుర్యాదితి ।
భోదాయనోక్త మేషదాన విధిః॥ 95

తా. పైన చెప్పిన ప్రకారముగా దానమంత్రములను పఠించి గోమయముచేత నలుకబడి, రంగవల్ల్యాదులచే రచింపబడిన భూభాగము మీద మూడుతూముల ఉద్దులరాశిమీద నుంచబడిన తాంబ్రపాత్రము గలదియు, బంగారు కొమ్ములు గలదియు వెండిగొరిసెలుగలదియు ముత్యములతో చేయబడిన తోకగలదియు, వస్త్రముచే నలంకరింప బడినదియు, పూజ చేయబడినదియు, నగు మేకదానము అగ్నిదేవత ప్రీత్యర్థముగా పూర్వోక్తఫలములు సిద్ధించుట కొఱకై యథాశక్తిదక్షిణతో కూడ యియ్యవలెయును. అటుపిమ్మట శివలింగదానముచేసి యథాశక్తిగా బ్రాహ్మణసంతర్పణచేయవలెయును. ఇట్లు భోదాయనోక్త ప్రకారముగా మేషదానవిధి చెప్పబడియున్నది.

— { గురుదశాయాం శుక్రభుక్తౌ శుక్రప్రీతికర లక్ష్మీ నారాయణ దానం. } —

శ్లో॥ జీవస్యాంతర్గతేశుక్రే నీచే మూఢ పరాజితే ।
పాపిన స్తేనసంయుక్తే వష్ఠరిప్ఫాష్ఠగేపివా ।
తద్భుక్తౌ పశునాశశ్చ రాజకోపో భవిష్యతి ।
యత్నకార్యవినాశశ్చ రక్తస్రావాది పీడనం ।
ప్రాణహానించకురుతే వ్యాసమృత్యు భయంతథా ।
తద్దోషపరిహారార్థం యథావిద్యుక్త మార్గతః ।
లక్ష్మీనారాయణందానంకుర్యాచ్ఛాంతిమవాప్నుయాత్ ॥
చంద్రదశాయాం బుధభుక్తివత్. 96

తా. గురుదశా శుక్రభుక్తియందు శుక్రుడు నీచుడైనను, అస్తంగతుడైనను, పరాజయము నొందినవాడైనను, పాపగ్రహములతో కలిసియున్నను,6-8-12రాసులయందున్నను, ఆభుక్తియందు పశునాశమును, రాజకోపమును, యత్నకార్య భంగమును, రక్తస్రావాదిపీడయు, ప్రాణహానియు, అపమృత్యు భయమును కలుగును. ఆదోషపరిహారార్థమై యథావిధిగా లక్ష్మీనారాయణ దానముచేసిన పిమ్మట శాంతియగును. చంద్రదశా భుధభుక్తిచెప్పిన విధిననుసరించి దానము చేయవలెయును.

గురుదశాయాం రవిభుక్తౌ రవిప్రీతికర ఛాగదానం.

శ్లో॥ జీవస్యాంతర్గతేసూర్యే షష్ఠాష్టవ్యయరాశిగే
ద్వితీయద్యూనగేవాపి శత్రురాశిషు సంస్థితే ।
తద్భుక్తౌ జ్ఞాతికలహః పైత్యరోగాది సంభవః ।
పితృమాతృవియోగశ్చ ధననాశో భవేద్ధ్రువం ।
జ్వరాతిసారగుల్మాది క్షయరోగ భయంతథా ।
తద్దోషపరిహారార్థం భాస్కరప్రార్థనం చరేత్ ।
ఛాగదానం ప్రకుర్వీత హ్యాయురారోగ్య వర్ధనం ॥
రవిదశాయాం శనిభుక్తిం ॥ 97

తా. గురుదశలో సూర్యభుక్తియందు సూర్యుడు 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తమములయం దున్నను, శత్రురాశియం దున్నను, ఆభుక్తియందు జ్ఞాతికలహమును, పైత్యరోగాది సంభవమును, మాతాపితృవియోగంబును, ధననాశమును నిశ్చయముగా కలుగును. గాకను జ్వరబాధయు, అతిసారరోగమును, గుల్మాది క్షయరోగప్రాప్తియు గలుగును. ఆదోషపరిహారార్థమై సూర్య ప్రార్థన చేయవలె

యును. నల్లని మేకను దానమిచ్చిన పిమ్మట ఆయురారోగ్యాభి వృద్ధి కలుగును. రవిదశా శనిభుక్తియందు చెప్పినరీతిగా దానమియ్యవలెయును.

[ గురుదశాయాం చంద్రభుక్తౌ చంద్రప్రీతికర ఛాగదానం. ]

శ్లో॥ జీవస్యాంతర్గతే చంద్రే రిప్ఫ షష్టాష్టరాశిగే ।
క్షీణేవా బలహీనేవా పాపగ్రహయుతేపివా ।
తద్భుక్తౌ జలగండస్స్యాత్ శీతజ్వర భయంతథా ।
మనఃఖేదో మానభంగో హ్యపమృత్యు భయంభవేత్ ।
తద్దోష పరిహారార్థం ఛాగదానం సమాచరేత్ ।
రవిదశాయాం శనిభుక్తివత్ ॥ 98

తా. గురుదశలో చంద్ర భుక్తియందు చంద్రుడు ౬-8-12 రాసులయందున్నను, క్షీణుడైనను, బలహీనుడైనను, పాపగ్రహములతోడ కలిసి యున్నను, ఆభుక్తియందు జలగండమును, శీతజ్వరపీడయు, మనోదుఃఖమును, మానభంగమును, అపమృత్యు భయమును కలుగును. ఆదోష పరిహారార్థమై ఛాగదానము చేయువలెయును. రవిదశా శని భుక్తియందు చెప్పినవిధి ననుసరించ వలెయును.

[ గురుదశాయాం కుజభుక్తౌ కుజప్రీతికర స్వర్ణదానం. ]

శ్లో॥ జీవస్యాంతర్గతే భౌమే నీచషష్టాష్ట రిప్ఫగే।
ద్విసప్తమాధిపయుతే గృహిణీ రోగసంభవం ।
పైత్యగుల్మాది రోగాశ్చ ఉన్నతాత్పతనం తథా ।
వ్రణరోగాది బాధాచ మృత్యునాభీతి మాప్నుయాత్ ।
తద్దోష పరిహారార్థం స్వర్ణదానం సమాచరేత్ ।
రవిదశాయాం గురుభుక్తివత్ ॥ 99

తా. గురుదశలో కుజభుక్తియందు కుజుడు నీచరాశి యందున్నను, 6-8-12 స్థానముల యందున్నను, ద్వితీయసప్తమాధి పతులతోడ కలిసియున్నను, ఆభుక్తియందు గృహిణి రోగసంభవమును, పైత్యవికారమును, గుల్మాది రోగభయము ను, ఉన్నతస్థళమునుండి క్రిందికి పడుటకు, వ్రణబాధయు, రోగపీడయు, మృత్యుభయమును కలుగును. ఆదోషపరిహారార్థమై స్వర్ణదానము చేయవలెయును. సూర్యదశా గురుభుక్తి యందు చెప్పిన విధి ననుసరించి దానమియ్య వలెయును.

గురుదశాయాం రాహుభుక్తౌ రాహుప్రీతికర మహిషదానం.

శ్లో॥ గురోరంతర్గతే రాహౌ ధనకోణప సంయుతే ।
నీచారిక్షేత్ర సంయుక్తే త్రిషడా యాంత్యరాశిగే ।
తద్భుక్తౌ క్షేత్రనాశంచ కలహం రాజవిద్వరం ।
అపస్మార పిశాచాద్యై రపమృత్యు భయంభవేత్ ।
తద్దోష పరిహారార్థం మాహిషం దానమాచరేత్ ॥ 100

తా. గురుదశలో రాహుభుక్తియందు రాహువు ధనాధిపతితోడ కలిసియున్నను, కోణాధి పతులతోడ కలిసి యున్నను, నీచక్షేత్ర మందున్నను, శత్రు క్షేత్ర గతుడైనను, 3-6-11-12 రాసులను పొందియున్నను, ఆభుక్తియందు క్షేత్ర నాశమును, కలహమును, రాజనిష్ఠూరమును, అపస్మార పిశాచాదుల వల్ల అపమృత్యుభయమును కలుగును. ఆదోషపరి హారార్థమై గేదెదానము యియ్యవలెయును.

యామళే॥

శ్లో॥ భయకాలేతు సంప్రాప్తే హ్యమాయాం పాతవైధృతౌ।
అష్టమ్యాంచ చతుర్దశ్యాం తిథాకష్టదినేషుచ ।
స్వగృహే శుద్ధదేశేచ మాహిషం దానమాచరేత్ ।

సర్వావయవసంయుక్తం పూర్ణమష్టాంగ మక్షతం ।
సైరిభం వాహనం మృత్యోఃపదమ్ము చేతిచ ।
వామాగ్రపాదేనిక్షిప్య మాషమాఢక మాత్రకం ।
దక్షాగ్రపాతేనిక్షిప్య తథాకృష్ణ తిలాన్ శుభాన్ ।
దక్షపృష్ఠే భవేన్ముద్గం చణకంవామపాదతః ।
దక్షిణాభిముఖంకృత్వా మహిషం మహిషీసుతం ।
కాంసపాత్రం తిలైఃపూర్య యమమూర్తిం వినిక్షిపేత్ ।
సువర్ణేన సురూపేణ ద్విభుజం దండపాణినం ।
వామహస్తే కుఠారంచ రక్తాక్షం ఘోరరూపిణం ।
నీలవస్త్రావృతంసాక్షా త్వదంష్ట్రం ముక్తకేశినం ।
పృష్ఠదేశే విశేషేణ మహిషస్య ప్రయత్నతః ।
పరే ఇమాం సమంత్రేణ రక్తగంధాక్షతాదిభిః ।
తైలాక్తకృసరన్నాద్యైః నైవేద్యాంతం సమాచరేత్ ।
అపేతమృత్యురమృతం మంత్రైః కుర్యాత్ప్రదక్షిణం ।
తతోబ్రాహ్మణ మభ్యర్చ్య రక్తవస్త్రాను లేపనం ।
దక్షిణాభిముఖస్థంతం పూజయే త్ప్రాఙ్ముఖస్తథా ।
దద్యాదనేనమంత్రేణ మృత్యుచ్ఛేద పరాయణః ॥ 101

తా. ఉపద్రవకాలమందును, అమావాస్య, వ్యతీపాత, వైధృతి, అష్టమి, చతుర్దశి, మొదలగు దినములయందును, స్వంతగృహమునందు శుద్ధప్రదేశమున ఎనుము దానము చేయవలెయును. పూర్ణమైన సర్వావయవములు గలదియు, అష్టాంగములయందును గాయము మొదలగు నవిలేనిదియు, మృత్యువాహనము నగు ఎనుపపోతును గంధవస్త్రాదులచేతను, రక్తపుష్పములచేతను మృత్యోః పదమును, బుఙ్మంత్రముచేతను చక్కగా పూజించి ముందటి కుడిపాదమునందు తూముడు

ఉద్దులను, ఎడమపాదమునందు తూముడు నల్లనినూగులును వెనుకటి ఎడమపాదమునందు తూముడు పెసలును, అదే కుడి, పాదమునందు తూముడు సనిగెలునుయుంచి దక్షిణాభిముఖముగా— నూగులచే నింపబడిన కంచుపాత్రయందు బంగారుతో సురూపముగాను, రెండుభుజములు గలదిగను, కుడిచేతియందు దండాయుధమును, ఎడమచేతియందు గొడ్డలియు, ధరించినదిగను, ఎఱ్ఱనికండ్లు గలదియును, నీలవస్త్రముచే కప్పబడినదియును, కోరలుగలదియును, విచ్చబడిన వెంట్రుకలు కలదియును యగు యమప్రతిమనుయుంచి "పరేఇవాంసం" యనెడి మంత్రములచేత రక్తగంధాక్షతాదులచే పూజించి నూగులనూనెతో కలుపబడిన అన్నము నైవేద్యముచేసి "అపేత మృత్యుర్మమృతం" యను మంత్రముచేత ప్రదక్షిణముచేసి పూజావసానమందు రక్తవస్త్ర గంధాదులచే బ్రాహ్మణుని పూజించి దక్షిణాభిముఖుడుగానుండు బ్రాహ్మణునకు, పూర్వాభిముఖుడుగానుండి క్రిందచెప్పబోవు మంత్రములతో మృత్యు పరిహారముకొఱకై దానమియ్యవలెయును.

మంత్ర॥

శ్లో॥ స్వర్ణరౌప్య ఖురశృంగ సంయుతం।
ధాన్యరాశి సహితంచ సన్నిభం।
కాంస్యపాత్ర తిలపూర్ణగంయమం।
సర్వలక్షణయుతం దదామ్యహం।
మృత్యురోగభయ భీతిసంకటా।
దుష్టహస్తితి భయాది దోషతః।
త్రాహిమాం సకల సంపదంతదా।

పుష్టికీర్తి మతులాం ప్రయచ్ఛమే ॥
ఇతిమంత్రం త్రిరుచ్చార్య దత్వా సైరిభమాదృతః ।
దక్షిణాం పంచదశకం పంచవాత్రీణి వాపునః ।
అశక్తస్వర్ణమేకంవా దద్యాత్సాద్గుణ్య సిద్ధయే ।
విప్రం విసర్జయేత్పశ్చా దంతతస్వస్తి వాచయేత్ ।
ఏవంయః కురుతేదానం మాహిషంచ యథావిధి ॥
ఇతియామళే మహిషదానవిధిః ॥ 102

తా. పైన చెప్పబడిన మంత్రమును మూడుతూరులు యుచ్చరించి ఆఎనుపపోతును 15-5 అథవా 3గాని అశక్తుడుగా నుండువాడు ఏక సువర్ణమునుగాని దానముసిద్ధించుట కొఱకై దానమియ్య వలెయును. అటుపిమ్మట బ్రాహ్మణుని పంపించి స్వస్తివాచన చేయవలెయును. ఈమహిషదానమును యథావిధిగా చేయునట్టి పురుషుడు మృత్యువు చేత విడువబడిన వాడగును. ఇట్లు యామిళ గ్రంథమునందు మహిషదాన విధి చెప్పబడియున్నది.

[శనిదశాయాం శనిప్రీతికర స్వర్ణయుక్త ఆయసపాత్రదానం.]

యామళే.

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి శనిప్రీతికరం పరం ।
స్వర్ణమాయస పాత్రాఖ్యం దానానాముత్తమోత్తమం।
బలహీనశనీఃకుర్యా దరిష్ట స్థానసంస్థితః ।
రోగపీడాం మృత్యుభయం ధనమానాది సంక్షయం ।
బంధుపీడాం స్వగోత్రేణ కలహం కృషినాశనం ।
ఉద్యోగ నాశనం పుత్ర దారహానిం తథైవచ ।
రాజ్యనాశం స్థాననాశం పశ్వాది క్షయమేవచ ।
బలవజ్జన వైరశ్చతథాన్య దపిపీడనం ।

తస్మాత్తద్దోష శాంత్యర్థం అభీష్ట ఫల సిద్ధయే ।
దానమేతత్ప్రకర్తవ్యం శని సంతుష్టి కారణం ॥ 103

తా. దానములన్నిటిలోను ఉత్తమమైనటువంటి బంగారు శని ప్రతిమతో గూడిన ఇనుము పాత్రదానము శని ప్రీతికరముగా నివ్వవలెయును. ఆవిధి ఎట్లనిన:— బలహీనుడగు శని దుస్థానములయందుండగా, రోగపీడయు, మృత్యుభయమును, ధననాశమును, మానభంగమును, బంధుపీడయు, స్వజనులతోడ కలహమును, కృషి నష్టమును, ఉద్యోగ నాశమును, భార్యా పుత్ర వినాశమును, రాజ్యనాశమును, స్థాననాశమును, పశ్వాదులకు హానియు బలవంతులతోడ విరోధమును, కలుగును. ఆదోషపరిహారార్థమై దానమిచ్చిన యెడల మనోభీష్ట సిద్ధియగును. శని ప్రీతుడగును.

శ్లో॥ జన్మర్క్షే గ్రహయోగేవా మందవారే విశేషతః ।
దేవాలయేనదీతీరే గోష్ఠేవా భవనాంగణే ।
గోమయేనోప లిప్యోర్వ్యాం మాషరాశిం వినిక్షిపేత్ ।
ఆఢక ప్రమితం తత్ర ధనురాకార మాయాసం ।
తదాకారసమం స్వర్ణరూపం కర్షత్రుతీయకం ।
రూపంనిక్షిప్య సంవేష్ట్య నీలవస్త్రేణ చింతయేత్ ॥ 104

తా. జన్మనక్షత్రము నందుగాని, గ్రహ యోగమునందుగాని, విశేషముగా శనివారము నందుగాని, దేవాలయమందైనను, నదీతీరమందైనను, గోష్ఠియందైనను, తనయింటియందైనను, గోమయముతో నలుకబడిన శుద్ధ ప్రదేశమునందు తూముడు ఉద్దులను యుంచి అందు ధనుస్సు ఆకారమును వ్రాసి యాకారమునకు సమముగా స్వర్ణ రూపము నుంచి నీల వస్త్రమును ధరింప చేసి.

ధ్యానం॥

శ్లో॥ ఇంద్రనీల ద్యుతిశ్శూలీ వరదో గృధ్రవాహనః ।
చాపబాణ ధరస్సౌరిః ధ్యేయో౽ర్క తనయ స్సదా ।
ఏవంధ్యాత్వా వాహావిధిః తస్మిన్ పూజాం సమాచరేత్।
శన్నో దేవీతి మంత్రేణ నీలగంధాక్షతా దిభిః ।
సంపూజ్య నామభిశ్చాష్ట దిక్షుపాత్రేప్రపూజయేత్ ॥ 105

తా. పైన చెప్పబడిన ధ్యానమంత్రములను పఠించి విధి ప్రకారముగా ఆవాహన చేసి పూజ చేయవలెయును, శన్నో దేవి రభిష్టయే - ఆపోభవంతు పీతయే - మొదలగు మంత్ర ములచేత నీలగంధ అక్షతాదులను సమర్పించి అష్టదిక్కులకు ను క్రమముగా నామపూజ చేయవలెయును.

నామాని॥

శ్లో॥ కోణశ్శనైశ్చరో మందః ఛాయా హృదయ నందనః ।
మార్తాండ జశ్చ సౌరిశ్చ పాతంగీ గ్రహ ఏవచ ।
ఏతైస్సంపూజ్య-ధూపాదీన్ దత్వా కృసమోదనం ।
నివేద్య విప్రమాహూయ దరిద్రం వేదపారగం ।
అభ్యర్చ్యవస్త్రమాల్యాద్యై ర్దద్యాన్మంత్రమిమంపఠన్॥

తా. కోణః, శనైశ్చరః, మందః, చాయా హృదయ నందనః, మార్తాండః, సౌరిః, పాతంగీ, మొదలగు నామముల తోడ పూజచేసి ధూపదీప నైవేద్యాదులను సమర్పించి పిమ్మట దరిద్రుడును, వేద పారాయణుడును యగు బ్రాహ్మణునకు ఆవాహనాది షోడశోపచారములు చేసి వస్త్రమాల్యాదుల నొసంగి అటు పిమ్మట దాన మంత్ర పఠనచేయవలెయును.

మంత్రః॥

శ్లో॥ స్వర్ణాయ సేననిర్దిష్టం మామరాశ్యా పరిస్థితం ।

కృష్ణ వస్త్రావృతం సూర్య పుత్రాకారం దదామ్యహం।
ఇతిదత్వాదక్షిణార్థం కృష్ణధేనుం ప్రదాపయేత్ ।
శాంతిసూక్త జపేత్పశ్చాద్యజమాన స్సమాహితః ।
అనేనవిధినాయస్తు దానమేత త్ప్రయచ్ఛతి ।
శనిదోష వినిర్ముక్త స్సుఖీభవతి మానవః ।
ఇతియామళే శనిప్రీతికర స్వర్ణాయస పాత్రదానవిధిః॥ 107

తా. పైనచెప్పిన ప్రకారముగా దాన మంత్రమును పఠించి యథాశక్తి దక్షిణ సహితముగా నల్లని ఆవును దాన మియ్యవలెయును, శాంతిసూక్త జపము చేసిన పిమ్మట యజమానునకు శని దోషము నివృత్తియై సుఖము కలుగును. ఈప్రకారముగా యామిళమునందు శనిప్రీతికరంబగు స్వర్ణ పాత్రదానవిధి చెప్పబడియున్నది.

—[ శనిదశాయాం శనిభుక్తౌ శనిప్రీతికర తిలదానం. ]—

దైవజ్ఞభూషణే॥

శ్లో॥ శనేరంతర్గతేమందే రిప్ఫషష్ఠాష్టశత్రుభే ।
ధనద్యూన స్థితేనీచే పాపగ్రహ నిరీక్షితే ।
తద్భుక్తౌ జ్వరసంప్రాప్తిః వాతరోగ భయం తథా ।
రాజద్వారే కార్యనాశో ధనక్షేత్రాది నాశనం ।
అపమృత్యుభయంచైవ శత్రుబాధా తథైవచ ।
తద్దోషశమనార్థాయ తిలదానం సమాచరేత్ ॥ 108

తా. శనిదశలో భుక్తినాథుడగు శని 6-8-12 స్థానముల యందున్నను, శత్రుక్షేత్రమందున్నను, ద్వితీయ సప్తమముల యందున్నను, నీచరాశియందున్నను, పాపగ్రహ వీక్షణ కలిగి యున్నను, ఆభుక్తియందు జ్వరప్రాప్తియు, వాతరోగభయ

మును, రాజమూలకముగా కార్యనాశమును, ధనక్షయమును, క్షేత్రనాశమును, అపమృత్యుభయమును, శత్రుబాధయు కలుగును. ఆదోషపరిహారార్థమై తిలదానము చేయవలెయును.

హేమాద్రౌ॥

ఏతద్దానం చికీర్షుః గ్రహణాది పుణ్యకాలేషు। ఉపద్రవకాలేవా - దేవాలయాది పుణ్యదేశేషు గోమయాను లేపిత రంగవల్ల్యాది రచిత భూభాగోపరికుశైః కృష్ణైర్వాపరుకాదిరహితై స్తిలైర్ద్వాత్రింశదంగుళోత్సేధం। యథాసంభవ విస్తారం పురుషమాత్రాయతం నిమ్నోన్నత వర్జితం। రాశిం సమలం కృత్వా వస్త్రేణా వేష్ట్య। తదుపరిషువర్ణేన అష్టాంగుళమాత్రం సమచతురశ్రం మాధవప్రతిమాం కృత్వా వినస్య - వీతవస్త్రేణా వేష్ట్య మాధవప్రతిమాయా శ్చతుర్దిక్షు క్షౌద్రపయోదధి ఘృతపూరితాన్ - స్రగ్ధాతు చందనసంయుతాన్ వస్త్రవేష్టితాన్ చతురః - కుంభాన్ క్రమాన్నిధాయ- ఏవం రచయిత్వా దానసంకల్పం కుర్యాత్ ॥ 109

తా. ఈదానమిచ్చుటయందు దిచ్ఛగల పురుషుడు, గ్రహణాది పుణ్యకాలములయందును, ఉపద్రవకాలములయందును, దేవాలయాది పుణ్యదేశములయందును, గోమయముతో నలుకబడి రంగవల్ల్యాదులతో రచించిన భూప్రదేశముమీద నూగుల పిండిచేత 32 అంగుళములపొడుగు గల పురుషాకార బొమ్మను చేసి నూగులరాశిమీద కూర్చుండబెట్టి నీలవస్త్రమును ధరింపచేసి విష్ణుప్రీతికరముగా దానము చేయుటకై సంకల్పము చేయవలెయును.

ఏవంగుణేత్యాది మమ ఇహజన్మని జన్మాంతరేషు కామతోకామతశ్చకృత సకలపాపక్షయద్వారా సర్వమంగళా వా

ప్త్యర్థం ఇహాలోక ధృఢతయా శతవర్ష జీవిత్వ సిద్ధ్యర్థం । అప
మృత్యునివారణార్థం శ్రీమాధవప్రీత్యర్థం యమప్రోక్త తిల
రాశిదానంకరిష్యే ఇతి సంకల్ప్య। మాధవం పూజయేత్ ॥ 110

తా. ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ
మొదలుగా గల సంకల్పముచెప్పి తాను ఈజన్మమందును,
జన్మాంతరములయందును, కామమువల్ల చేయబడిన సకలవిధ
పాపములును నివర్తియై సకలవిధశుభములు లభించుటకొఱ
కును, దేహధృఢముకలిగి పూర్ణాయుర్దాయము సిద్ధించుటచేత
అపమృత్యువు నివారణ యగుటకును శ్రీమాధవప్రీత్యర్థముగా
యమప్రోక్త తిలరాశి దానమిచ్చుటకొఱకై సంకల్ప్యముచేసి
మాధవపూజ చేయవలెయును.

ధ్యానం॥

శ్లో॥ ఆరభ్యవామోర్ధ్వకరాత్తపసవ్య క్రమేణతు ।
శంఖచక్రేగదాపద్మే దధానో మాధవోఽచ్యుతః ॥

ఏవం విధం మాధవం ధ్యాత్వా - ఓం మాధవాయ
నమః - ఇతి షోడశోపచారం కృత్వా - ఓం తిలరాశయేనమః,
ఇతి తిలరాశించనం పూజ్య । శోత్రియం విప్రం కర్ణాభరణాం
గులీయ వస్త్రాద్యైరభ్యర్చ్య దద్యాద్దానమంత్రః ॥ 111

తా. పైచెప్పిన ప్రకారముగా ధ్యానముచేసి ఓం మాధ
వాయనమః, మొదలగు గాగల నామపూజసలిపి, షోడశోప
చారములుచేసి, ఓం తిలరాశియేనమః మొదలగు నామముల
చేత తిలరాశిని పూజించి శోత్రియబ్రాహ్మణునకు చెవికి ఆభరణ
ములును, ఉంగురములు, వస్త్రములు మొదలగువాటినియిచ్చి
దానమంత్రపఠనచేత దానమియ్యవలెయును.

శ్లో॥ అజ్ఞానాద్యథదివారో భాన్మోహాద్వా జన్మజన్మని।
ఆర్జితం యన్మయాకించి దుష్కృతం మధుసూధన।
తత్సర్వం విలయంయాతు తవదానేనమాధవ॥

అస్మై— ఇమాంగోమయాను లేపిత యథాసంభవ విస్తార చతుర్దిగవస్థిత క్షౌద్రపయోదధి ఘృతపూరిత। గంధ వస్త్రాద్యలంకార తిలరాశిమధ్యస్థితాం। సర్వలక్షణలక్షితాం। మాధవప్రతిమాం పూర్వోక్త ఫలం కామయమానస్తుభ్యమ హంసంప్రదదేన మమేతి। తిలరాశిమేవంప్రదద్యాత్॥ 112

తా. జన్మజన్మాంతరములయందు నాయొక్క దుష్కృతమువల్ల ఆర్జింపబడిన సమస్తపాపములను తొలగుటకొఱకై, గోమయముచే నలుకబడిన ప్రదేశమునందు పాలు, పెరుగు నెయ్యి మొదలగు వస్తువులతోడను, గంధవస్త్రాదులతోడను అలంకారము చేయబడిన నూగులరాశి మధ్యయం దుంచబడిన సర్వలక్షణలక్షితుడై నటువంటి మాధవప్రతిమను, పూర్వము చెప్పిన ఫలములను పొందుటకొఱకై దానమియ్యవలెయును.

[శనిదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర మహిషిదానం.]

శ్లో॥ శనేరంతర్గతేసౌమ్యే లగ్నాత్షష్ఠరాశిగే।
ద్వ్యూనేవాధనసంయుక్తే పాపైర్యుక్తేచ వీక్షితే।
తద్భుక్తౌ జ్ఞాతికలహం ధననాశం తథైవచ।
పైత్యజ్వరాదిబాధాస్యా త్పాండురోగాది సంభవః।
తద్దోషపరిహారార్థం మహిషీదాన మాచరేత్।
ఏవంయఃకురుతేమర్త్యః ఆయురారోగ్య వర్ధనం।
రవిదశాయాం రాహుభుక్తివత్॥ 113

తా. శనిదశలో బుధభుక్తియందు బుధుడు లగ్నమునకు 6-౮-12 స్థానములయందున్నను, ద్వితీయ సప్తమరాసుల

యందున్నను, పాపగ్రహములతో కూడియున్నను లేక చూడ బడినను ఆభుక్తియందు జ్ఞాతికలహమును, ధననాశమును, పైత్యజ్వరరోగభయమును, పాండురోగాది సంభవమును కలుగును. ఆదోషపరిహారార్థమై ఎనుము దానముచేయవలెయును, ఈదానము చేసినపిమ్మట నరులకు ఆయురారోగ్యాభివృద్ధి కలుగును. రవిదశలో రాహుభుక్తియందు చెప్పిన విధిప్రకారముగా దానమియ్యవలెయును.

[ శనిదశాయాం కేతుభుక్తౌ కేతుప్రీతికర సువర్ణతిలదానం. ]

శ్లో॥ శనేరంతర్గతే కేతౌ షష్ఠాష్టవ్యయ రాశిగే ।
క్రూరగ్రహేణసంయుక్తే ద్వితీయద్యూనగేపివా ।
స్త్రీనాశః పుత్రనాశశ్చ యత్నకార్య వినాశనం ।
గ్రహణీజ్వరబాధాచ చింతావ్యాధి భయంభవేత్ ।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ మథార్చయేత్ ।
సువర్ణంసతిలందత్వా విద్వాన్ఛాంతి మవాప్నుయాత్ ॥

తా. శనిదశలో భుక్తినాథుడగు కేతువు 6-8-12 రానులయందున్నను, క్రూరగ్రహములతోడ కలిసియున్నను, ద్వితీయ సప్తమములయందున్నను, ఆభుక్తియందు స్త్రీనాశమును, పుత్రనాశమును, యత్నకార్యభంగమును, గ్రహణీజ్వరబాధయు, మనోవ్యాకులమును, వ్యాధిభయమును కలుగును, ఆదోషపరిహారార్థమై మృత్యుంజయజపము చేయవలెయును. బంగారు నూగులదానము విధిప్రకారము చేసినయెడల శాంతి కలుగును

రుద్రయామళే॥

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి తిలకాంచన సంజ్ఞికం ।
దానంమహాపాపహరం సర్వసౌభాగ్యదాయకం ।

శక్రాయోక్తం స్వపుత్రాయ కశ్యపేన మహాత్మనా ।
పృతచ్ఛిదేవి శేషేణ బ్రహ్మహత్యా నివృత్తయే ।
దాతురాయుష్కరం యత్తు సర్వాభయ నిబర్హణం ।
అలక్ష్మిదోషశమన మమంగళవినాశనం ।
ద్వాదశాష్టమజన్మాది దుష్టస్థాన స్థితైర్గ్రహైః ।
సూచితారిష్టశమనం శనర్కాంగార కాదిభిః ।
దాన మేతత్ప్రక ర్తవ్యం నరైః కలుషభీరుభిః ।
జన్మర్క్షే సంక్రమేచైవ హ్యేకాదశ్యాం విశేషతః ।
వైధృతౌచ వ్యతీపాతే విషువేద్వాదశీదినే ।
మహారోగోత్పత్తికాలే హత్యాద్య ఘసముద్భవే ।
ఏవమాదిషు కాలేషు దానమేతత్సమాచరేత్ ॥ 15

తా. జన్మనక్షత్రమందును, సంక్రమణాది పుణ్యకాలములయందును, విశేషముగా ఏకాదశియందును, వైధృతి, వ్యతీపాత, ద్వాదశి మొదలగు దినములయందును మహారోగము సంభవించినకాలమందును, బ్రహ్మహత్యాదిదోషములను నివర్తించి, ఆయుర్వృద్ధి చేయునదియును, సర్వభయ నివారణ చేయునదియును, దరిద్రదోష శమనము చేయునదియును, అశుభనాశము చేయునదియును, జన్మాదిగా ద్వాదశాష్టాది దుస్థానములయందున్న గ్రహములవల్ల సూచింపబడిన అరిష్టములను తొలగించునదియును, శని, రవి, కుజులువల్ల కలిగెడి దోషములను తొలగించునదియును యగు సువర్ణతిలదానము చేయవలెయును.

శ్లో॥ కురుక్షేత్రాది తీర్థేషు గంగాద్యాసు సరిత్సుచ ।
గోష్ఠేచాయ తనేవాపి రమ్యేచైవ గృహాంగణే ।
పూర్వోద క్ప్రణాంభూమిం గోమయేనోపలిప్యచ ।

కుశానా స్తీర్యోదగ్రగాన్- తత్రసిద్ధార్థ సంయుతాన్ ।
తత ద్రోణ శతైః కృష్ణైః తిలైర్ధాన్యాది సర్జితైః ।
రాశింకృత్వాతు తన్మూర్ధ్ని సువర్ణ పరిమాణతః ।
జాంబూనదం వినిక్షిప్య సునూత్నే క్షౌమవాససా ।
తద్రాశిం సమ్యగావేష్ట్య కుశానా స్తీర్య సర్వశః ।
తస్యపశ్చిమ దిగ్భాగే వ్రీహిభిర్వేది కాంశుభం ।
విధాయ తత్రకలశం స్థాపయేత్ప్రియతశ్శుభం ।
తస్మిన్ నావాహ్య దేవేశం వరుణం యాదసాంపతిం ।
తస్మిన్నాస్తీర్య వసనం కౌస్తుభం సుమనోహరం ।
తస్మిన్ నిష్క ప్రమాణేన సువర్ణేన వినిర్మితాం ।
ప్రత్యేకం సూర్యవాయ్వగ్ని జలపర్జన్య వాక్పతీః ।
ఇంద్రావిష్ణూ మృత్యుయమౌ బ్రహ్మాణంచయథాక్రమం।
సంస్థాప్య తత్తన్మంత్రైశ్చతాం త్రిశైర్వాపి వైదికైః ।
సంపూజ్యనామ మంత్రైర్వా గంధపుష్పాక్షతాదిభిః ।
తత్తత్ప్రీతికరై రన్నైర్నైవేద్యం పరికల్పయేత్ ।
తత స్తత్పశ్చిమే భాగే ప్రతిష్ఠాప్య హుతాశనం ।
చతురంతం కర్మకృత్వా ప్రధానం హోమమాచరేత్ ।
అర్కాజ్య పాయసద్రవ్యై రాసత్యే నేతిమంత్రతః ।
వాయుమంత్రేణ పాలాశ సమిదన్నాజ్యకైర్హునేత్ ।
అగ్నిమంత్రేణ చాశ్వత్థ సమిత్తిల ఘృతైస్తథా ।
ఆపోహిష్ఠేతి మంత్రేణ దధ్యన్నాజ్య వటైర్హునేత్ ।
పర్జన్యాయేతి మంత్రేణ పాలాశై స్సాజ్యకైస్తథా ।
బృహస్పతేతి మంత్రేణహవ్యాజ్యా న్యాశ్వత్థకైర్హునేత్ ।
ఇంద్రావిష్ణూపి బతమితి మనునాజ్యా న్నఖాదిరైః ।

వైకంకతైస్సాజ్యతిలైర్వ్యాహృత్యా సమంత్రేణ హావయేత్ ।
యమాయేతి ఋచాజ్యాన్నశమీభిర్జుహుయాత్తథా ।
పాలాశపరమాన్నాద్యైర్గృహ్ణా తేతిమంత్రతః ।
తతస్స్విష్టకృతం హుత్వా హోమశేషం సమాపయేత్ ।
తత్కుంభసలిలైస్స్నాతః కర్తాశుక్లాంబరావృతః ।
ప్రదక్షిణత్రయం కృత్వా గృహీత కుసుమాంజలిః ।
ఇమముచ్చారయన్మంత్రం పూజయే తిలకాంచనే ।
వస్వాదిత్యమరుద్రుద్ర నాగ వేదాంగ దిక్పతీన్ ।
బ్రహ్మాణం భాస్కరం విష్ణుం కాలమీశం ప్రజాపతిం ।
సంపూజ్యైతాన్నామమంత్రైర్విప్రయాహూయసాదరం।
కుటుంబినం దరిద్రంచ యువానం చాగ్నిహోత్రిణం।
పాదౌ ప్రక్షాళ్య వస్త్రాద్యైరలంకృత్య స్వశక్తితః ।
తస్మైదద్యాద్విధానేన ప్రయతస్తిలకాంచనం ।
మంత్రైరేభిర్వక్ష్యమాణైస్సకుశం సాక్షతోదకం ॥ 116

తా. కురుక్షేత్రాది తీర్థముల యందుగాని, గంగాది పుణ్యనదులయందు గాని, ఆవుల దొడ్డియందుగాని, దేవాలయముల యందుగాని, మనోహర మైనటువంటి గృహాంగణము నందుగాని, పూర్వాభి ముఖముగా కూర్చుండుటకు గాను, భూప్రదేశమును గోమయము చేత నలికి, అచట దర్భలనుఉత్తరాగ్రములుగా పరచి, శక్త్యాను సారము తూముల నల్లనూగులు పురుగులచే కట్టబడిన కండెలు లేనట్టి దానిని రాశి చేసి, దానిమీద యథాశక్తి బంగారునుంచి, పట్టు వస్త్రములు గప్పి, దానికి పశ్చిమ భాగమునందు వడ్లరాశిచే ఒక అరుగునునిర్మించి దానిమీద వరుణ కలశమునుంచి దానికి వస్త్రము కప్పి నిష్క-ప్రమాణము బంగారుచే చేయబడిన సూర్య, వాయు, అగ్ని,

జల, పర్జన్య, బృహస్పతి, ఇంద్రావిష్ణు, మృత్యు, యమ, బ్రహ్మ, ప్రతిమలను యథాక్రమముగా స్థాపించి వేదోక్త మగు మంత్ర తంత్రముల చేతను, గంధ పుష్పాక్షాదుల చేత ను విధ్యుక్తముగా పూజ చేసి వారి వారికి ప్రియములగు నైవేద్యాదులను సమర్పింప వలెయును. పూజావసానమందు దానికి పశ్చిమభాగమున అగ్ని ప్రతిష్ఠచేసి చతురంతముగా అగ్ని ముఖమును చేసిన పిమ్మట "ఆసత్యేన" యనెడి మంత్ర ముచే, జిల్లెడు సమిధలు, నెయ్యి, పరమాన్నము మొదలగు ద్రవ్యములతోడ ప్రధాన హోమము చేయవలెయును. అదే ప్రకారముగా మోదుగసమిధలు, అన్నము, నెయ్యి మొదలగు ద్రవ్యములతో, వాయుమంత్రము చేతను, అశ్వత్థ సమిధలు, నూగులు నెయ్యి, మొదలగు ద్రవ్యములతో అగ్ని మంత్రము చేతను, పెరుగు, నెయ్యి, మఱ్ఱి సమిదలు మొదలగు ద్రవ్యము లతో "ఆపోహిష్ఠేతి" జల మంత్రము చేతను, మోదుగ సమి దలు, నెయ్యి మొదలగు ద్రవ్యములతో "పర్జన్యాయేతి" యనెడి పర్జన్య మంత్రము చేతను, అశ్వత్థ సమిధలు, నెయ్యి మొదలగు ద్రవ్యములతో "బృహస్పతేతి" యనెడి గురు మంత్రము చేతను, ఖాదిర సమిధలు, నెయ్యి, అన్నము, మొద లగు ద్రవ్యములతో "ఇంద్రావిష్ణూపిబత" యనెడి ఇంద్రా విష్ణు మంత్రముచేతను, ఎఱ్ఱ మద్ది సమిధలు, నెయ్యి, నూగులు మొదలగు ద్రవ్యములతో "మృత్యు" మంత్రము చేతను, శమీవృక్ష సమిధలు, నెయ్యి, అన్నము మొదలగు ద్రవ్యముల తో "యమాయ" యనెడి యమమంత్రము చేతను, మోదు గసమిధలు, పరమాన్నము, నెయ్యి మొదలగు ద్రవ్యములతో "బ్రహ్మణాతే" యనెడి బ్రహ్మమంత్రము చేతను. హోమము

చేసి స్విష్టికృత్ హోమానంతరం హోమశేషమును సమా ప్తించ వలెయును. పిమ్మట దానకర్త తెల్లని వస్త్రములను ధరించి కలశోదకములచేత స్నానముచేసి అగ్నికి ముమ్మారు ప్రదక్షిణముచేసి రెండు చేతులను జోడించుకొని పువ్వుల నుంచుకొని.

"శ్లో॥ వసూన్వాదిత్యమ రుద్గస్రనాద వేదాంగ దిక్పతీన్ ।
బ్రహ్మాణం భాస్కరం విష్ణుం కాలమీశం ప్రజాపతిం ।
దుష్టారిష్ట వినాశాయా ప్రణమామి ముహుర్ముహుః॥"

తా. యని మంత్రపఠనచేసి కుటుంబము గలవాడును, బీదవాడును, యౌవనస్థుడును, దారాగ్ని గలవాడును, యగు బ్రాహ్మణుని వరించి పాదప్రక్షాళనచేసి శక్త్యానుసారముగా వస్త్రాదులచే నలంకరించి ఆబ్రాహ్మణునికొఱకై విధ్యుక్తముగా,

"శ్లో॥ తిలాః కాశ్య వసంభూతా స్తిలావిష్ణ్వంగ సంభవాః ।
తిలాఃపాప హరాయస్మా త్తస్మాత్పూవ్తో భవామ్యహం ॥
హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః ।
కార్తికేయస్యసహజం తస్మాత్పూవ్తో భవామ్యహం ॥
హత్యాదిపాపశమనం కథితం తిలకాంచనం ।
యస్మాత్తస్మాత్తత్ప్రదానా త్పాపాత్పూవ్తో భవామ్యహం॥

తా. పైమంత్రపఠనచేత తిలకాంచన దానమును కుశాక్షతాదులతోడ యివ్వవలెయును. గాకను దానసిద్ధికొఱకై యథాశక్తి అనగా పదినిష్కములుగాని లేక దానిలో సగము కాని ధనలోభత్వములేక దక్షిణయియ్యవలెయును. ఈవిధి ప్రకారముగా ఒకటేభోజన ఈతిలకాంచ దానమును చేసిన యెడల, బ్రహ్మహత్య, గురుభార్యాగమనము, బ్రాహ్మణ ద్రోహము, సురాపానము, మాతాపితృద్రోహము మొదలగు పాప

ములనుండి విముక్తుడై, ఆయురారోగ్యసంపన్నుడును, పుత్ర పౌత్ర సమన్వితుడునునై, దేహాంతమునందు కోటిసూర్య ప్రకాశమానమగు దివ్యదేహమును పొంది సూర్యమండల మును భేదించుకొని పుణ్యలోకములయందంతటను యథేష్టము లగు భోగభాగ్యముల ననుభవించి దివ్యసూర్యులచే పొగడ బడినవాడై పునర్జన్మరహిత మగు పరమపదమును పొందువా డగును. నూగులచే ద్వీపమును వెలిగించినవాడును, నూగు లతో (నూగులనూనెతో) స్నానము చేయువాడును, తిలదానము చేయువాడును, తిలములను భక్షించువాడును, తిలహోమము చేయువాడును, సమస్త పాపములచే విడువబడుచున్నాడు. ఇట్లు వాధూలసంహితయందు తిలకాంచనదానవిధి చెప్పబడి యున్నది.

మంత్రాః॥

శ్లో॥ తిలాఃకాశ్యపసంభూతా స్తిలావిష్ణ్వంగ సంభవాః।
తిలాఃపాపహరాయస్మా త్తస్మాత్పాతో భవామ్యహం।
హిరణ్యగర్భ గర్భస్థం హేమబీజం విభావసోః।
కార్తికేయస్యసహజం తస్మాత్పాతో భవామ్యహం।
హత్యాదిపాపశమనం కథితం తిలకాంచనం।
యస్మాత్తస్మాత్తత్ప్రదానాత్పాపాత్పాతో భవామ్యహం।
దత్త్వైవందానసాద్గుణ్య సిద్ధయే దక్షిణాం నరః।
దశనిష్కంతదర్థంవా విత్తశాఠ్య వివర్జితః।
అనేనవిధినాదత్వా తిలకాంచన ముత్తమం।
త్రిసృష్టపిచసంధ్యాసు చైకస్మిన్నేవవాసరే।
బ్రహ్మహాముచ్యతేపాపాత్ స్తేయీవా గురుతల్పగః।
విప్రద్రోహీసురాపాయీ మాతృహాపితృహింసకః।

ఆయు రారోగ్యసంపన్నః పుత్రపౌత్ర సమన్వితః ।
దేహాంతేదీప్యమానోసౌ భిత్వా మార్తాండమండలం ।
పుణ్యలోకేషు సర్వేషు భుక్త్వాభోగా న్యథేప్సితాన్ ।
కాలంహ్యుషిత్వాతదనునిత్యసూరి భిరించితం ।
పునరావృత్తిరహితం ప్రాప్నుయా త్పరమంపదం ।
తిలోద్వర్తీతిలస్నాయీ తిలద స్తిలభక్షకః ।
తిలహోమీచసావేభ్యో ముక్తోభవతి మానవః ।
ఇతివాధూలసంహితాయాం తిలకాంచనదానవిధిః ॥ 119

తా. పైచెప్పిన ప్రకారముగా దానమంత్రములను పఠించి స్వర్ణతిలదానమును విధిప్రకారము యిచ్చినయెడల బ్రహ్మహత్యాదిదోషములును, బ్రాహ్మణద్రోహమువల్లను,సురాపానము చేసి నందువల్లను, మాతాపితృవులను హింసించినందువల్లను కలిగిన సమస్త పాపములును తొలగి, ఆయురారోగ్య సంపన్నుడై, పుత్రపౌత్రాభివృద్ధి నొంది, దేహాంతమునందు మార్తాండమండలమువలె శోభించు నటువంటి దివ్యతేజస్సు గలిగి పుణ్యలోకములయందు సకలవిధభోగసౌఖ్యముల నను భవించి పునర్జన్మము లేక పరమపదము సిద్ధించును. తిలహోమము చేయుటవలన పాపములు నశించి ముక్తికలుగును. ఈప్రకారముగా వాధూలసంహితయందు స్వర్ణతిలదానవిధి చెప్పబడియున్నది.

[శనిదశాయాం శుక్రభుక్తౌ శుక్రప్రీతికరఛాగాదిపంచకదానం]

శ్లో॥ శనేరంతర్గతే శుక్రే, నీచ మూఢ పరాజితే ।
లాభేపాప సమాయుక్తే షష్ఠాష్ట వ్యయరాశిగే ।
ద్వితీయ ద్యూనగేవాపి క్రూరక ద్రేక్కాణ సంయుతే ।
తద్భుక్తౌ దేహపీడాస్యా దథవా ధననాశనం ।

కళత్రనాశనం దుఃఖం బంధు ద్వేషస్తథైవచ।
మిత్రబంధు విరోధశ్చ సమాన జననాశనం।
తద్దోష పరిహారార్థం ఛాగపంచక మాచరేత్ ॥ 120

తా. శనిదశలో శుక్రభుక్తియందు శుక్రుడు నీచరాశి యందున్నను, అస్తంగతుడైనను, గ్రహాయుద్ధమునందు అపజయము నొందిన వాడైనను, ఏకాదశ స్థానమందున్నను, పాప గ్రహములతో కూడి యున్నను, 6-8-12 రాసులయందున్నను ద్వితీయ సప్తమరాసుల యందున్నను, క్రూర ద్రేక్కాణము లయందున్నను, ఆభుక్తి యందు దేహపీడయు, ధననాశంబును, భార్యావియోగంబును, దుఃఖమును, బంధుద్వేషమును, ఆప్త బంధువిరోధమును, సమానజన నాశనంబును, కలుగును, ఆదోష పరిహారార్థమై ఛాగపంచక దానము యియ్యవలెయును.

దానకల్పే॥

శ్లో॥ ఛాగకంబళ కార్పాస తిలాయః ఖండసాజ్ఞికం।
ఛాగాదిపంచకమితి జ్ఞాతవ్యంచ బుధోత్తమైః।
రవిదశాయాం శనిభుక్తివత్ ॥ 121

తా నల్లని మేకపోతు, తెల్లని కంబళి, ప్రత్తి, బాణలి ఈఐదు దుర్దానములును ఛాగాదిపంచక మని పండితోత్తముల చేత చెప్పబడి యున్నది. సూర్యదశలో శనిభుక్తి యందు చెప్పిన పద్ధతి ననుసరించ వలసినది.

శనిదశాయాంరవిభుక్తౌరవిప్రీతికర స్వర్ణగర్భి తకూశ్మాండదానం.

శ్లో॥ శనేరంతర్గతే సూర్యే వికలా వస్థసంయుతే।
షష్ఠాష్టమవ్యయగతే నీచే శత్రు పరాజితే।
ద్వితీయద్యూనపయుతే తద్భుక్తౌ మరణం ధ్రువం।

అథవా శూలరోగాని గుల్మరోగాది సంభవః ।
శిరోభ్రమణ రోగాది పైత్యరోగోద్భవం భయం ।
ధననాశో జ్ఞాతి నాశః మాతాపితృ వినాశనం ।
తద్దోష పరిహారార్థం సూర్యప్రార్థన మాచరేత్ ।
స్వర్ణగర్భిత కూశ్మాండదానే నారోగ్యమావిశేత్ ॥ 122

**తా.** శనిదశలో సూర్యభుక్తియందు సూర్యుడు వికలావస్థయందున్నను, 6-8-12 రాసులయందున్నను, నీచరాశియందున్నను, శత్రుక్షేత్ర మందున్నను, అపజయము నొందినవాడైనను, ద్వితీయ సప్తమాధిపతులతోడ కలిసియున్నను ఆభుక్తియందు నిశ్చయముగా మరణము కలుగును. శూలరోగప్రాప్తియు, గుల్మరోగాది సంభవమును, బుద్ధివికారమును, పైత్యరోగమును, ధననాశనమును, జ్ఞాతినాశనమును, మాతాపితృవియోగంబును, కలుగును ఆదోష పరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలెయును. బంగారుతో నింపబడిన గుమ్మడికాయదానమిచ్చుట వలన శాంతికలుగును.

రుద్రయామలే॥

శ్లో॥ స్వర్ణగర్భితకూశ్మాండ దానం వక్ష్యామ్యతఃపరం ।
కూశ్మాండనిసమాదాయ స్థూలాని సుదృఢానిచ ।
ప్రత్యేకం నిష్కమేకైకం తేషుద్వాదశనున్యసేత్ ।
ఏవంకృత్వాతు తులసీ మూలే సమత లేమతః ।
గోమయేనోపలిప్యోర్వీం చతురశ్రం యథాతథా ।
తండులైర్ద్వా దశప్రస్థైః కారయిత్వా చమండలం ।
కమలం ద్వాదశదళం కుంకుమేన లిఖేత్తతః ।
తస్యోపరిన్యసే ద్వస్త్రం తత్ర చందనమండలే ।
నరసింహా కృతిం దేవం లిఖేత్తత్ర విచక్షణః ।

శంఖచక్రగదాఖడ్గ మునలాదిభిరన్వితం।
వజ్రాధికనఖస్పృష్ఠం సుప్రసన్నముఖాంబుజం।
మండలాంతర్గతంవిష్ణుం శ్రీభూమి సహితం విభుం।
బ్రహ్మాద్యై రఖిలై ర్దేవై స్తూయమానం ముదాన్వితైః।
సనకాద్యైశ్చ సేంద్రైశ్చ కిన్నరైరప్సరోగణైః।
యోగపట్టపినద్ధాంగ ముద్యదాదిత్య సన్నిభం।
ధ్యాయం నారాయణం దేవం తద్విష్ణో రితి మంత్రకః।
షోడశై రుపచారైశ్చ సమభ్యర్చ్య యథావిధి।
మండలాగ్రేతు కూశ్మాండ ఫలాన్యా దిత్యసంఖ్యయా।
సతిలాజ్యానులిప్తాని వస్త్రైరాచ్ఛాదనానిచ।
నిధాయాంత స్సువర్ణాని విప్రానావాహ్యయుదుర్గతాన్।
తత్సంఖాకాన్ వస్త్రగంధ పుష్పాదిభిర దార్చితాన్।
కృత్వా తేభ్య స్సువిధిన ద్దద్యాన్మంత్ర మిమంపఠన్॥ 123

తా. శనిదశా రవిభుక్తియందు సూర్యదోష పరిహారార్థమై బూడిదగుమ్మడికాయిని, పండ్రెండుఫలముల బంగారు సూర్యప్రతిమను యుంచి, షోడశోపచారపూజలను చేసి వస్త్రాభరణ సహితముగా బ్రాహ్మణునకు దానమిచ్చుటకొఱకై బ్రాహ్మణునకు ఆవాహనాది పూజచేసి వస్త్రగంధపుష్పాదుల నిచ్చి విధిప్రకారముగా దానమంత్రములను పఠించి.

మంత్రః॥

శ్లో॥ స్వర్ణగర్భితకూశ్మాండ మహామంత్ర ఫలప్రదం।
పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థం తుభ్యం సంప్రదదేశుభం।
తత్రైవం దక్షిణాందద్యా న్నిష్కంసాద్గుణ్యసిద్ధయే।
ఏవంకృతవత స్తస్య ఇహామంత్ర ఫలద్వయం।

హా స్తస్థితం జగన్సర్వం నాత్ర కార్యా విచారణా ।
దత్తమాత్ర మిదందానం తారయేత్సకలాపదః ॥ 124
ఇతి శ్రీ విష్ణుయామళే స్వర్ణగర్భిత కూశ్మాండదానవిధిః ॥

తా. ఫలము నిచ్చునదియును, పుత్రపౌత్రాభివృద్ధి కలిగించునదియును, సకల సంపదల నిచ్చునదియును, యగు స్వర్ణగర్భితమగు బూడిదగుమ్మడికాయను దక్షిణ సహితముగా దానమిచ్చినయెడల సకల ఆపదలు తొలగును. ఈప్రకారముగా విష్ణుయామళమందు దానవిధి చెప్పబడియున్నది.

[శనిదశాయాం చంద్రభుక్తౌ చంద్రప్రీతికర శ్వేతధేనుదానం.]

శ్లో॥ శనేరంతర్గతేచంద్రే షష్ఠాష్టవ్యయరాశిగే ।
క్షీణేవాపాపసంయుక్తే ద్వితీయద్యూనరాశిగే ।
ఖలద్రేక్కాణసంయుక్తే తద్భుక్తౌమాతృనాశనం ।
శీతవ్యాధిభయంచైవ హ్యుదరేవ్యాధిసంభవం ।
ధననాశం ధాన్యనాశం చతుష్పాజ్జీవనాశనం ।
తద్దోషపరిహారార్థం శ్వేతాంగాందాన మాచరేత్ ।
రవిదశాయాం చంద్రభుక్తివత్ ॥ 125

తా. శనిదశలో చంద్రభుక్తియందు చంద్రుడు 6-8-12 రాసులయందున్నను, క్షీణుడైనను, పాపగ్రహ సంబంధము కలిగియున్నను, ద్వితీయ సప్తమరాసుల యందున్నను, పాపద్రేక్కాణముల యందున్నను ఆభుక్తియందు మాతృనాశనమును, శీతవ్యాధిభయమును, ఉదరరోగప్రాప్తియు, ధననాశంబును, ధాన్యనాశమును, పశ్వాది జంతునాశనమును, కలుగును. ఆదోషపరిహారార్థమై తెల్లని ఆవును దానమియ్యవలెయును. సూర్యదశా చంద్రభుక్తియందు చెప్పిన దానవిధి ననుసరించ వలెయును.

—[శనిదశాయాం కుజభుక్తౌ కుజప్రీతికర మహిషీదానం.]—

శ్లో॥ శనేరంతర్గతే భౌమే నీచారి క్షేత్రరాశిగే ।
నీచేవాప్యష్టమేరాశౌ ఖలద్రేక్కాణ సంయుతే ।
క్రూరషష్ఠ్యంశసంయుతే క్రూరగ్రహనిరీక్షితే ।
రిప్ఫేవ్యాదశగే ద్యూనే ద్వితీయే సంస్థితే యది ।
తత్కాలే భ్రాతృగండస్స్యాత్సమాన జననాశనం ।
ఉన్నతాత్పతనం చైవ విషశస్త్రాగ్నిజం భయం ।
భూనాశో ధాన్యనాశశ్చ భృత్యవర్గ వినాశనం ।
తద్దోషపరిహారార్థం మహిషీదాన మాచరేత్ ।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర॥
రవిదశాయాం రాహుభుక్తివత్. 126

తా. శనిదశలో కుజభుక్తియందు కుజుడు నీచక్షేత్రమం దున్నను, శత్రుక్షేత్రమం దున్నను, అష్టమరాశియం దున్నను, పాపద్రేక్కాణమం దున్నను, క్రూరషష్ఠ్యంశాధి పతితో గూడియున్నను, క్రూరగ్రహవీక్షణ కలిగియున్నను, 6-12 రాసులయం దున్నను, ద్వితీయ సప్తమములయం దున్నను, ఆకాలమందు సహోదరగండమును, సమాన జననాశంబును, ఉన్నతస్థలమునుండి పడుటయు, విషభీతియు, శస్త్రబాధయు, అగ్నిభయమును, భూనాశమును, ధాన్యనాశమును, తనసేవకు లకు హానియు కలుగును. ఆదోషపరిహారార్థమై ఎనుము దాన మియ్యవలెయును. యామళోక్త ప్రకారముగా రవిదశా రాహు భుక్తియందుచెప్పిన విధిననుసరించి దానము చేయవలెయును.

[శనిదశాయాం రాహుభుక్తౌ రాహుప్రీతికర నాగదానం.]

శ్లో॥ శనేరంతర్గతే రాహౌ భూమ్యాదిగ్రహ సంయుతే ।
కోణేవారిష్ఫసంయుక్తే పాపగ్రహయుతేష్టమే ।

క్రూరద్రేక్కాణసంయుక్తే తద్భుక్తౌ ద్రవ్యనాశనం।
వాతరోగభయం చైవ విషసర్పాదిజం భయం।
పిశాచజ్వరబాధాచ క్షుద్రశూన్యాది సంభవః।
తద్దోషశమనార్థాయ నాగదానం చకారయేత్।
యామళోక్త ప్రకారేణ విధిం విధి వదాచర॥
చంద్రదశాయాం కుజభుక్తివత్. 127

తా. శనిదశలో రాహుభుక్తియందు రాహువు భూమాది గ్రహములతో కూడియున్నను, పంచమ నవమములయందున్నను, 6-8 రాసులయందున్నను, పాపగ్రహములతోడ కలిసియున్నను, క్రూరద్రేక్కాణములయందున్నను, ఆభుక్తియందు ద్రవ్యనాశనమును, వాతరోగభయమును, విషసర్పాది జంతుభయమును, పిశాచబాధయు, జ్వరపీడయు, శూన్యాది క్షుద్రబాధలును కలుగును. ఆదోషపరిహారార్థమై నాగదానము చేయవలెయును. యామళోక్త ప్రకారముగా చంద్రదశలో కుజభుక్తియందుచెప్పిన విధి ననుసరించవలెయును.

[శనిదశాయాంగురుభుక్తౌ గురుప్రీతికరస్వర్ణనిర్మితఛాగదానం.]

శ్లో॥ శనేరంతర్గతే జీవే ఖలద్రేక్కాణసంయుతే।
క్రూరషష్ఠ్యంశపయుతే నీచారి క్షేత్రరాశిగే।
తత్కాలేపాపసంయుక్తే షష్ఠాష్టవ్యయరాశిగే।
ద్వితీయ సప్తమాధీశ సంయుతే బలవర్జితే।
తద్భుక్తౌ పుత్రమరణం గురుపుత్రాది నాశనం।
ధననాశో ధాన్యనాశః స్థాననాశ స్తథైవచ।
పిత్తపాండ్వాది రోగైశ్చ పీడ్యమాన స్తథాభువి।
తద్దోషశమనార్థాయ త్రియంబక జపం చరేత్।
స్వర్ణేదనిర్మిత ఛాగదానే నారోగ్యమా విశేత్।

యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ॥
రవిదశాయాం శనిభుక్తివత్. 128

తా. శనిదశలో గురుభుక్తియందు గురువు పాపద్రేక్కాణమునం దున్నను, క్రూరషష్ట్యంశాధిపతితో కలిసియున్నను, నీచరాశియం దున్నను, శత్రుక్షేత్రమందున్నను, ఆకాలమందు పాపగ్రహములతో కూడియున్నను, 6-8-12 రాసులయం దున్నను, ద్వితీయ సప్తమాధిపతులతోడ కలిసియున్నను, బలహీనుడైనను, ఆభుక్తియందు పుత్రమరణమును, గురునాశనమును, పుత్రాదినాశనమును, ధనహానియు, ధాన్యనాశమును, స్థాననాశమును, పిత్తరోగమును, పాండ్వాదివ్యాధిభయమును, దేహపీడయు కలుగును. ఆదోషపరిహారార్థమై త్రియంబక జపము చేయువలెయును. బంగారుతో చేయబడిన మేకను దానమిచ్చినయెడల ఆరోగ్యము కలుగును. యామళోక్త ప్రకారముగా రవిదశా శనిభుక్తిలోచెప్పిన విధి ననుసరించి దానమియ్యవలెయును.

—[ బుధదశాయాం బుధప్రీతికర స్వర్ణపాత్రదానం. ]—

యామళతంత్రే॥

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి బుధప్రీతి కరంపరం ।
స్వపాత్ర మితిఖ్యాతం దానానా ముత్తమోత్తమం ।
దుష్టస్థాన స్థితేసౌమ్యే వాగ్బంధం జనయత్యసౌ ।
వాతరోగం శ్లేష్మరోగం దైన్యం సర్వాంగవేదనాం ।
తస్మాత్తద్దోష శాంత్యర్థం దానమేతత్సమాచరేత్ ॥ 129

తా. దానము లన్నిటిలోను శ్రేష్ఠమైనటువంటి బంగారు పాత్రదానము బుధప్రీతికరముగా నిచ్చుటకై దానవిధిని చెప్పుచున్నాడు. దుష్టస్థాన మందున్న బుధుడు నోటి

మాట బంధింప బడుటయును, వాతరోగమును, శ్లేష్మరోగము ను, దీనత్వమును, అన్ని యవయవములయందును బాధయు కలు గును. ఆదోష పరిహారార్థమై బంగారు కలశదాన మియ్య వలెయును.

శ్లో॥ జన్మర్క్షే బుధవారేవా గ్రహయోగే విశేషతః ।
అన్యేషు పుణ్యకాలేషు గృహే దేవాలయేథవా ।
గోమయే నోపలిప్యోర్వ్యాం ముద్గరాశిం విధాయచ ।
ఆఢకప్రమితం తత్రపాత్రం స్వర్ణవినిర్మితం ।
చతురశ్రం యథాశక్తి కల్పితం లక్షణాన్వితం ।
పీతవస్త్రేణ సంవేష్ట్య పూజయే ధ్యాన పూర్వకం ॥ 130

తా. జన్మనక్షత్రము నందుగాని బుధవారము నందు గాని విశేషముగా గ్రహయోగ సమయముల యందుగాని, లేక ఇతర పుణ్యకాలముల యందుగాని, యింటియందుగాని దేవాలయమునందు గాని ఒక తూముడు పెసలు రాశినిపోసి దానిమీద స్వర్ణనిర్మిత పాత్రమునుంచి యథాశక్తిగా సర్వ లక్షణ సహితముగా పీతవస్త్రమును ధరించి ధ్యానపూర్వకము గా పూజింపవలెయును.

ధ్యానం॥

శ్లో॥ సింహారూఢం చతుర్బాహుం ఖడ్గచర్మగదాదిక ।
ధారయంతం మహాసౌమ్యం ధ్యాయేత్సర్వార్థ సిద్ధయే ।
ధ్యాత్వైవముద్బుధ్యస్వేతి మంత్రేణాథ ప్రపూజయేత్ ।
కుంకుమాంకిత గంధైశ్చ దుత్తూర కుసుమైరపి ।
ప్రాగాదిషు చతుర్దిక్షు నామభిః పూజయేత్క్రమాత్ ।

తా. సింహము నెక్కినవాడును, నాలుగు భుజములు గలవాడును, ఖడ్గము, చర్మము, గద మొదలగు వాటిని ధరిం

చినవాడును, సహాసౌమ్య స్వభావముగలవాడును యగు బుధుని సకల విధ ఫల పురుషార్థములు సిద్ధించుట కొఱకై ధ్యానించి మంత్రములచే పూజించి కుంకుమ గంధ పుష్పాదులచేత తూర్పుదిక్కు మొదలు నాలుగు దిక్కులను నామ పూజచేసి:—

నామాని॥

శ్లో॥ అథాథర్వ శిరోధీశ శ్శశి పుత్రః కళానిధిః।
అత్రిగోత్ర సముత్పన్న ఇత్యేతై ర్నామభిః క్రమాత్।
సంపూజ్య ధూపదీపది క్షీర మిశ్రాన్న కైరపి।
తతో బ్రాహ్మణ మాహూయ పీతవస్త్రాదికైరపి।
అభ్యర్చ్య దద్యాత్తత్పాత్రం మంత్ర మేతం పఠన్నరం॥

తా. అథర్వశిరోధీశ, శశిపుత్ర, కళానిధిః, అత్రిగోత్ర సముత్పన్నః మొదలగు నామములతోడ క్రమముగాపూజించి దూపదీపాదులను నైవేద్యమును సమర్పించి అటుపిమ్మటబ్రాహ్మణునకు ఆవాహనాది షోడశోపచార పూజలుచేసి పీతవస్త్రమును ధరింపచేసి పిమ్మట స్వర్ణపాత్ర దానమిచ్చుటకుగాను మంత్ర పఠన చేయవలెయును.

మంత్రం॥

శ్లో॥ ముద్గబీజో పరిగత ప్రాతస్థం చంద్రపుత్రకం।
దదామాయుష్య సిధ్యర్థం బుధదోషాప నుత్తయే।
ఇతిదత్వా విధానేన దద్యాద్భక్త్యాచ దక్షిణాం।
అనేన విధినాయస్తు దానమే తత్సమాచరేత్।
సర్వదోష వినిర్ముక్త స్సర్వబాధా వివర్జితః।
రూపసౌభాగ్య సంపన్నో జీవేచ్చ శరదాంశతం।
ఇతియామళతంత్రే బుధప్రీతికర స్వర్ణపాత్ర దానవిధిః॥

తా. పైనచెప్పిన దానమంత్రమును పఠించి విధిననుసరించి యథాశక్తి దక్షిణాతోడను, విశేష భక్తితోడను స్వర్ణపాత్ర దానము చేయవలెయును. అటుపిమ్మట సకలపాపములు నివారణమై, సర్వబాధలు తొలగి, రూపసౌభాగ్య సంపన్నుడును, పూర్ణాయువు గలవాడును, యగును. ఈప్రకారముగా యామళతంత్రమునందు బుధ ప్రీతికరముగా స్వర్ణపాత్ర దానవిధి చెప్పబడియున్నది.

—{ బుధదశాయాం బుధభుక్తౌ బుధప్రీతికర లక్ష్మీనారాయణదానం. }—

శ్లో॥ బుధస్యాంతర్గతే సౌమ్యే రిప్ఫ షష్ఠాష్ట రాశిగే।
క్రూరాంశే క్రూరసంయుక్తే ద్వితీయ ద్యూనరాశిగే।
తద్భుక్తౌ జ్వరపీడాస్యా అర్థనాశో మనోవ్యథా।
కారాగృహ ప్రవేశశ్చ బంధుద్వేష స్తథైవచ।
అపమృత్యు భయంచైవ హ్యథవా బంధునాశనం।
తద్దోష పరిహారార్థం విష్ణు సాహస్రకం జపేత్।
లక్ష్మీనారాయణం దానం సర్వసంపత్ప్రదాయకం।
యామళోక్త ప్రకారేణ విధిం విధినాచర।
చంద్రదశాయాం బుధభుక్తివత్॥ 134

తా. బుధదశలో స్వభుక్తియందు బుధుడు 6-8-12 రాసులయందున్నను క్రూరాంశయందున్నను, క్రూరగ్రహములతోడ కలిసియున్నను, ద్వితీయసప్తమరాసుల యందున్నను, ఆభుక్తియందు జ్వరపీడయు, అర్థనాశమును, మనోవ్యథయును, కారాగృహ ప్రవేశమును బంధుద్వేషమును అపమృత్యుభయమును, బంధునాశనమును, కలుగును. ఆదోష పరిహారార్థమై విష్ణు సహస్రనామజపము చేయవలెయును. లక్ష్మీనారా

యఃణదానము చేసినయెడల సకలవిధ సంపదలను లభించును. యామళోక్త ప్రకారముగా చంద్రదశా బుధభుక్తియందు చెప్పినవిధి ననుసరించి దానమియ్యవలెయును.

[బుధదశాయాం కేతుభుక్తౌ కేతుప్రీతికర మహిషీదానం.]

శ్లో॥ బుధస్యాంతర్గతే కేతౌ షష్ఠాష్ట వ్యయరాశిగే ।
ద్యూనేవాధనగేవాపి క్రూరగ్రహ నిరీక్షితే ।
తద్భుక్తౌ వాతరోగేణ శిరోభ్రమణమావిశేత్ ।
జ్వరగండం పశుఘాతం గురుద్వేషం ధనవ్యయం ।
స్థానభ్రంశం మానభంగ మపకీర్తి భయంతథా ।
తద్దోష పరిహారార్థం మహిషీ దాన మాచరేత్ ।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ।
రవిదశాయాం రాహుభుక్తివత్ ॥ 185

తా. బుధదశలో కేతుభుక్తియందు కేతువు 6-8-12 రాసుల యందున్నను, ద్వితీయ సప్తమముల యందున్నను, క్రూరగ్రహముల చేత చూడబడినను ఆభుక్తియందు వాత రోగమును, బుద్ధిభ్రంశమును, జ్వరగండమును, తనపశువువారికి కీడును, గురుద్వేషమును, ధనవ్యయమును, స్థానభ్రంశమును, మానభంగమును, అపకీర్తిభయమును, కలుగును. ఆదోష పరిహారార్థమై మహిషిదాన మియ్యవలెయును. యామళోక్త ప్రకారముగా రవిదశలో రాహుభుక్తియందు చెప్పిన విధి ననుసరించి దానమియ్యవలయును.

—[ బుధదశాయాం శుక్రభుక్తౌ శ్వేతగోదానం. ]—

శ్లో॥ బుధస్యాంతర్గతే శుక్రే నీచేవాస్తం గతేపివా ।
పాపగ్రహేణ సంయుక్తే ద్వితీయ ద్యూనరిప్ఫగే ।
అష్టమస్థాధిపయుతే ధూమాదిగ్రహ సంయుతే ।

తద్భుక్తౌ రోగపీడాస్య దపమృత్యుభయం భవేత్ ।
దారనాశం మానభంగ మశ్వనాశం ధనవ్యయం ।
స్త్రీద్వేషం బంధుకలహం మిత్రప్రభువిరోధకృత్ ।
తద్దోష పరిహారార్థం శ్వేతగోదాన మాచరేత్ ।
యామళోక్త ప్రకారేణవిధిం విధివదాచర ।
రవిదశాయాం చంద్రభుక్తివత్ ॥ 136

తా. బుధదశలో శుక్రభుక్తియందు శుక్రుడు నీచుడైనను అస్తంగతుడైనను పాపగ్రహములతో కలిసియున్నను, ద్వితీయసప్తమములయందున్నను, ద్వాదశిరాశి యందున్నను షష్ఠాష్టమాధిపతులతోడ కలిసియున్నను ధూమాదిగ్రహములతోడ కూడియున్నను ఆభుక్తియందు రోగపీడయు, అపమృత్యుభయమును, భార్యావియోగంబును, మానభంగమును, అశ్వనాశమును, ధనవ్యయమును, స్త్రీలతోడ ద్వేషమును, బంధువులతోడ కలహమును, మిత్రప్రభు విరోధమును, కలుగును. ఆదోషపరిహారార్థమై తెల్లనిగోవును దానమియ్యవలెయును. యామళోక్త ప్రకారముగా సూర్యదశలో చంద్రభుక్తియందు చెప్పిన విధిననుసరించి దానమియ్యవలెయును.

[ బుధదశాయాం రవిభుక్తౌ రవిప్రీతికర సూర్యప్రతిమాదానం. ]

దైవాజ్ఞభరణే॥

శ్లో॥ బుధస్యాంతర్గతే భానౌ షష్ఠాష్టవ్యయరాశిగే ।
ధనేద్యూనే నీచసంస్థే ధూమాది గ్రహసంయుతే ।
శన్యారఫణి సంయుక్తే పాపదృష్టే థవాయది ।
దేహవ్రణోమనస్తాపః కార్యహాని ర్భవిష్యతి ।
శత్రుభిః పీడితోనిత్యం కలహాశ్చ ధనక్షయః ।
పితృబంధు వినాశశ్చ నానామూలా ద్ధనవ్యయః ।

బంధనం ఋణబాధాచ పైత్యక్షయ సముద్భవః ।
తద్దోషపరిహారార్థం సూర్య ప్రీతికరం భవేత్ ॥ 137

తా. బుధదశలో సూర్యభుక్తియందు సూర్యుడు 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తమస్థానములయందున్నను, నీచరాశియం దున్నను, ధూమాదిగ్రహములతోడ కలిసియున్నను, శని రాహువులతోడ కూడియున్నను, పాప గ్రహములచేత చూడబడినను, ఆభుక్తియందు దేహము వ్రణ బాధయు, మనస్తాపమును, కార్యహానియు, శత్రుపీడయు, సదా కలహమును, ధనక్షయమును పితృవినాశమును, బంధుహానియు, నానామూలకముగా ధనవ్యయమును, బంధనప్రాప్తియు, ఋణ బాధయు, పైత్యరోగమును, క్షయసంభవమును, కలుగును. ఆదోషపరిహారార్థమై సూర్యప్రీతికరముగా సూర్యప్రతిమా దాన మియ్యవలెయును.

హేమాద్రౌ।

సూర్యప్రతిమాదానరచనా.

శ్లో॥ రామం సూర్య కులోత్తంసం సంచిత్య హృదయాంబుజే ।
సూర్యమూర్తి ప్రదానంచ విధిం వక్ష్యే యథామతి ।
ఏతద్దానం చికీర్షు రయనాదిపుణ్యకాలేషు ।
దేవాలయాది పుణ్యదేశేషు గోమయాను లేపిత ।
రంగవల్ల్యాది రచిత భూభాగోపరి పలాష్ట కమితం ।
తామ్రపాత్రం విన్యస్య తత్ర నిష్కత్రయా మితేన ।
నిష్కద్వయమితేనవా సువర్ణేన సప్తాశ్వ రథస్థితాం ।
పద్మోపేతద్విహస్తాం సూర్యమూర్తిం కారయిత్వా ।
పంచామృతానా సంశోధ్య రక్తవస్త్రేణ సంవేష్ట్య ।
కుంకుమరక్త చందన రక్తమాల్యాద్యై రలంకృత్య ।

తస్మిన్ తామ్రపాత్రే నిధాయ ఏవం రచయిత్వా కర్తా దాన
సంకల్పం కుర్యాత్ ॥ 138

తా. సూర్యమూర్తి దానమిచ్చుటయం దిచ్ఛ గల పురుషుడు అయనాది పుణ్యకాలములయందును, దేవాలయాది పుణ్యదేశములయందును, గోమయముచే నలికి రంగవల్ల్యాదులు రచించిన భూభాగముమీద తాంబ్రపాత్రమునుంచి రెండు అథవా మూడునిష్కములను, ఏడుగుఱ్ఱములు కట్టిన బంగారు రథముతో గూడిన సూర్యమూర్తి ప్రతిమనుయుంచి పంచామృతాది స్నానములను చేయించి రక్తవస్త్రమును ధరింపచేసి, కుంకుమ, రక్తచందన మాల్యాదులతోడ అలంకారముచేసి ఆతామ్రపాత్రమునం దుంచి దానమిచ్చెడికర్త దానసంకల్పము చేయవలెయును.

ఏవం గుణేత్యాది—మమ ఇహజన్మని జన్మాంతరేషు సంభావితానాం - ఔషధాదిప్రయోగేణ నానాజనభ్రమణ కరణాదీనాం - భ్రమణరోగనిదాన భూతానాం సర్వేషాం పాపానాం - నివృత్తిద్వారా శరీరే వర్తమానభ్రమణ రోగ సంక్షయార్థం - సర్వరోగనివారణార్థం సర్వమంగళా వాప్త్యర్థం - దృఢదేహతయా శతవర్షజీవిత్వ సిద్ధ్యర్థం - సకలాభీష్ట ప్రదాయక శ్రీసూర్యనారాయణ ప్రీత్యర్థం - గౌతమోక్త ప్రకారేణ సూర్యమూర్తి దానంకరిష్యే - ఇతి సంకల్ప్య ॥

తా. నాకు ఈజన్మమందును, జన్మాంతరమందును సంభవించిన ఔషధాదిప్రయోగములవల్ల గలిగిన భ్రమణరోగ నివారణార్థము కొఱకును, సర్వపాపక్షయార్థము కొఱకును, శరీరమందు యిపుడు కలిగిన భ్రమణరోగ సంరక్షయార్థము కొఱకును, సర్వరోగనివారణార్థము కొఱకును, సర్వమంగళము

సిద్ధించుట కొఱకును, దృఢదేహముపొంది పూర్ణాయువు కలుగుట కొఱకును, సకలాభీష్టముల నిచ్చువాడగు శ్రీసూర్య నారాయణ ప్రీతికొఱకై గౌతమోక్త ప్రకారముగా సూర్య మూర్తి దానమిచ్చుటకుగాను సంకల్పము చేయవలెయును.

సూర్యమూర్తిం ధ్యాయేత్ ॥

శ్లో॥ సప్తాశ్వరథమారూఢాం పద్మహస్తాం స్వలంకృతాం ।
కుంకుమేనానులిప్తాంగీం రక్తవస్త్ర యుగావృతాం ।
హారకేయూర కటకకుండలాది విభూషితాం ।
ధ్యాయామిసూర్యమూర్తింతాం సర్వకామఫలప్రదాం ।
ఏవంవిధాం సూర్యమూర్తిం ధ్యాత్వా ।
ఆకృష్ణేనేతి మంత్రేణ సర్వంకృత్వా పునరగ్నేః ।
ప్రత్యగాసీనపాత్రా సాదనాద్యాజ్య భాగాంతం ।
పూర్వతంత్రం నిర్వృత్య - చిత్రదేవానామితిమంత్రేణ ।
అర్కసమిద్ధోమం తచ్చక్షురితిమంత్రేణ ఆజ్యహోమం ।
ఉదుత్యంజాదవేదసమితిమంత్రేణ తిలహోమంచ ।
ప్రత్యేకమష్టోత్తర శతసంఖ్యయా కృత్వా ।
స్విష్టకృదాద్య పరిషాంతంతతో ।
మధుమిశ్రలాజైరాకృష్ణేనేతి హుత్వా ।

అనంతరం కుష్టరోగాది దేవతాయై దుర్గాయై సమిచ్చర్వాజ్యైః ప్రత్యేకమష్టోత్తర శతాహుతి సంఖ్యయా హోమశేషం సమాప్య సంపాతాజ్యం పాత్రేణాదాయ యజమానం భద్రపీఠే ఉపవిశ్య తేన సంపాతాజ్యేన- అక్షిభ్యామితిసూక్తేన- యథాలింగం యజమానావయవాన్ అనులిప్యతం లలాటదేశే స్పృశన్ శన్నో దేవ్యనువాకం జపేత్ ॥ 140

తా. పైనచెప్పిన ప్రకారముగా ధ్యానమంత్రములచేత

సూర్యమూర్తిని ధ్యానించి ఆజ్య తిలహోమాదులను సలిపి ప్రత్యేకముగా అష్టోత్తరశతనామపూజచేసి అటుపిమ్మట యజమానుడు భద్రపీఠముమీద కూర్చుండి యథాలింగమును లలాటదేశమునందు స్పృశించి జపము చేయవలెయును.

శ్లో॥ అనంతరం యజమానః ఉదఙ్ముఖో భూత్వాతం ।
సూర్యంస్వర్ణ కదలీంచ షోడశోపచారైః ।
స్సంపూజ్యతమాచార్య - ముదఙ్ముఖ ముపవిశ్య ।
వస్త్రాంగుళీయ కర్ణాభరణాద్యై రభ్యర్చ్య ।
దద్యాద్దానమంత్రః ॥ 141

తా. అటుపిమ్మట యజమానుడు ఉత్తరాభి ముఖుడై సూర్యుని, బంగారు అరటిచెట్టును షోడశోపచారముల చేత పూజించి అటుపిమ్మట ఆచార్యుని ఉత్తరాభి ముఖముగా కూర్చుండబెట్టి వస్త్రములను, అంగుళీయములను. కర్ణాభరణములను యిచ్చి పిమ్మట:—

ఆదిత్య సూర్య ద్యుమణేతి దానమంత్రః ॥

అథకదళీదానమంత్రః

శ్లో॥ కదళిత్వంహి దేవానాం పితౄణాం దేవి శర్మదే ।
లక్ష్మ్యాశ్చశచ్యా పార్వత్యా దేవక్యాదిభిరేచ ।
సావిత్ర్యా రంభయాచైవ కార్యార్థం పూజితాపురా ।
అంగప్రత్యంగజం సర్వం కష్టం జాతమపాకురు ॥

ఇతికదళీ దానమంత్రః ॥ 142

తా. దేవతులవల్లను, పితృవులవల్లను, లక్ష్మీదేవి, శచీదేవి, పార్వతిదేవి, దేవకిదేవి, సావిత్రి, రంభ మొదలగు వారి వల్ల పూర్వకాలమందు కార్యార్థమై పూజింపబడిన కదళీ వృక్షమునా, అంగములయందును, ప్రత్యంగముల యందును

పుట్టిన సర్వకష్టమును నివారణ యగుటకై దానమంత్రము పఠించి,

శ్లో॥ అస్మైఅహం ఇమాం గోమయాను లేపిత రంగవల్ల్యాది।
భూభాగో పరిద్రోణ పరిమాణ తండులరాశ్యా పరిస్థిత।
రజిత రథారూఢాః పలాది పరిమిత స్వర్ణనిర్మితాం।
రక్తవస్త్ర వేష్టితాం సర్వలక్షణ లక్షితాం।
స్వర్చితా మర్ధపల పరిమిత స్వర్ణనిర్మిత।
శ్వేతవస్త్ర వేష్టిత పత్రపుష్ప ఫలాన్విత రంభో।
పేతాంసూర్య ప్రతిమాంతుభ్యపూర్వోక్త ననుమేతిదత్వా।
దానసాద్గుణ్యార్థం దేయద్రవ్య తృతీయాంశం।
దక్షిణాందత్వా బ్రాహ్మణాన్ భోజయిత్వా।
స్వయంచపుత్రమిత్రాదిభి సహాభుంజీత।
ఇతివృద్ధ గౌతమోక్త సూర్యమూర్తి దానపద్ధతిః ॥ 148

తా. గోమయముతో నలుకబడి రంగవల్ల్యాదులు రచించిన భూభాగము మీద అర్ధతూముడు బియ్యపురాశిని పోసి వెండి రథము నెక్కిన మూడుతులముల బంగారుతో చేయబడిన ప్రతిమనుయుంచి రక్తవస్త్రమును ధరింపజేసి అటుపిమ్మట పూజచేసి సర్వలక్షణ లక్షితుడైన సూర్యప్రతిమను, శ్వేతవస్త్రమును, ఫలపుష్పాదులను పూర్వోక్తప్రకారముగా దానమిచ్చి దానముసఫలమునొందుటకై దానద్రవ్యమూల్యములో మూడింట నొకభాగము దక్షిణయిచ్చి బ్రాహ్మణులకు భోజనము పెట్టి శేషభాగమును తాను, పుత్రమిత్రులతోడ భుజించవలెయును. ఈప్రకారముగా వృద్ధ గౌతమోక్తప్రకారముగా సూర్యమూర్తిదాన పద్ధతి చెప్పబడియున్నది.

[ బుధదశాయాం చంద్రభుక్తౌ చంద్రప్రీతికర రజితదానం. ]

శ్లో॥ బుధస్యాంతర్గతే చంద్రే క్షీణేవా నీచరాశిగే।
క్రూరగ్రహేణ సంయుక్తే రిప్పుషష్ఠాష్టరాశిగే।
ద్వితీయద్యూనగేవాథ జాయతే సర్వతోభయం।
శీతరోగ భయం మృత్యుభయ మర్థవినాశనం।
బంధుద్వేషం కార్యహానిః బుద్ధిభ్రంశ స్తథైవచ।
తస్మాత్తద్దోషశమనం రజితం దానముత్తమం॥ 144

తా. బుధదశలో చంద్రభుక్తియందు చంద్రుడు క్షీణు డైనను నీచరాశియందున్నను, క్రూరగ్రహములతో కలిసి యున్నను, 6-8-12 రాసులయందున్నను, ద్వితీయసప్తముల యందున్నను, ఆభుక్తియందు ఎల్లచోట్లను భయమును, శీత రోగోపద్రవమును, మృత్యుభయమును, అర్థనాశమును, బంధు ద్వేషమును, కార్యహానియు, బుద్ధి భ్రంశమును కలుగును. ఆదోష పరిహారార్థమై దానములన్నిటిలోను యుత్తమ మైన టువంటి వెండిదానము చేసినయెడల శాంతియగును.

హేమాద్రౌ.

శ్లో॥ ఏతద్దానం చికీర్షుః పురుషః।
అయనాది పుణ్యదేశేషు - గోమయానులేపిత।
రంగంల్యాది రచితభూభాగో పరిశ్వేత వస్త్రంప్రసార్య।
తత్రమాష మారభ్య పలపర్యతం।
స్వశక్తిసంపాదితరజితం తద్వస్త్రే విధాయ।
ఏవంరచియిత్వా కర్తాదాన సంకల్పం కుర్యాత్॥ 145

తా. ఈదానమిచ్చుటయం దిచ్ఛగల పురుషుడు అయ నాది పుణ్యకాలముల యందును, పుణ్యదేశముల యందును గోమయముతో నలుకబడి రంగవల్ల్యాదులను రచియింపబడిన

భూప్రదేశము మీద తెల్లని వస్త్రమును పరచి అందు ఐదుగు రిగింజలు మొదలు—మూడుతులములవరకు తూనిక గలిగి తనశక్తివల్ల స్వీయముగా సంపాదింపబడిన వెండిని ఆవస్త్ర మునందుంచి అటుపిమ్మ దానమిచ్చునట్టి కర్త దానసంకల్ప ము చేయవలెయును.

శ్లో॥ ఏవంగుణేత్యాది మమ ఇహ జన్మని జన్మాంతరేషు సం భావిత సకలపాపక్షయార్థం సర్వరోగ నివృత్త్యర్థం రూపకాంతి సుఖసౌభాగ్య సమృద్ధ్యర్థం తత్ర చిరకాల జీవిత్వ సిద్ధ్యర్థం సోమలోకనివాస సిద్ధ్యర్థం సోమాత్మక శ్రీమహా విష్ణుప్రీతిం కామయమానః స్కాంధపురాణోక్త ప్రకారేణ
రజితదానంకరిష్య ఇతిసంకల్ప్య॥

శ్లో॥ తత్రరజితే సోమమావాహ్య - ఓం సోమాయానమః।
ఇతిమంత్రేణ షోడశోపచార పూజాంకృత్వా।
బ్రాహ్మణం సోమస్వరూపం।
వస్త్రాద్యైరభ్యర్చ్య - దద్యాద్దానమంత్రః॥ 146

తా. ఏవంగుణ విశేషేణ విశిష్టాయాం శుభతిథౌ మొదలగు గాగల మంత్రములతోడ తాను ఈజన్మమందును, జన్మాంతరమందు చేసినట్టి సకలపాపములు తొలగుటకొఱకును సకలవిధరోగములు నివర్తిౖమై, రూపము, దేహకాంతి సుఖము సౌభాగ్యములభించుట కొఱకును దీర్ఘాయున్సు కలిగి జీవించుట కొఱకును, చంద్రలోక వాసప్రాప్తి సిద్ధించుట కొఱకును, సోమాత్మక స్వరూపుడైనటువంటి శ్రీమహావిష్ణు ప్రీతికొఱ కై స్కాందపురాణోక్త ప్రకారముగా రజితదానము ఇచ్చుట కు గాను సంకల్పముచేసి అచ్చట వెండితో చంద్రభగవానుని ఆవాహనచేసి— ఓం సోమాయనమః— మొదలగు మంత్ర

ములచేత షోడశోపచార పూజలుచేసి చంద్రస్వరూపుడైన నటు వంటి బ్రాహ్మణునకు వస్త్రాదులను సమర్పించి పిమ్మట దాన మంత్రములను.

శ్లో॥ పితౄణాం వల్లభంయస్మాద్ధరిం ద్బ్రహ్మశివస్యచ।
రజితం పాహిన స్తస్మా ద్దుఃఖ సంసార సాగరాత్।
స్కాందే సోమ దానమంత్రః॥
రుద్ర నేత్ర సముద్భూతం రజితం పితృవల్లభం।
తస్మాదస్య ప్రదానేన అతిశ్శాంతి ప్రయచ్ఛమే।
అస్మై బ్రాహ్మణాయ సోమస్వరూపాయ।
సోమప్రీత్యర్థం అహంపలాది పరిమిత।
రజితపూర్వోక్త ఫల కామయమానస్తుభ్యమిదం।
సంప్రదదేనమ మేతిదద్యాత్।
యథాశక్తి సువర్ణదక్షిణాం దద్యాత్।
ఇతిస్కంద పురాణోక్త రజితదాన పద్ధతిః॥ 147

తా. పైన చెప్పినప్రకారముగా పఠించి చంద్ర ప్రీత్యర్థముగా చంద్ర స్వరూపుడగు బ్రాహ్మణునకు పూర్వోక్త ఫలములు సిద్ధించుటకొఱకై యథాశక్తి సువర్ణదక్షిణతో కూడ వెండి దానము యియ్యవలెయును. ఈప్రకారముగా స్కంద పురాణమునందు రజితదాన పద్ధతి చెప్పబడియున్నది.

—[ బుధదశాయాం కుజభుక్తౌ అనడ్వాహదానం. ]—

శ్లో॥ బుధస్యాంతర్గతేభౌమే షష్ఠాష్ట వ్యయరాశిగే।
నీచారిక్షేత్రగేవాపి ధూమాది గ్రహసంయుతే।
పాపద్రేక్కాణ సంయుక్తే ద్వితీయ ద్యూన సంస్థితే।
తద్భుక్తౌ భ్రాతృమరణం వైరం బంధుజనస్యచ।
తాపజ్వరేణ భీతిస్స్యా ద్విషశస్త్రాగ్నిజంభయం।

సమానజన విద్వేషో దాయాది కలహా స్తథా ।
తద్దోష పరిహారార్థ మనడ్వాహం ప్రదాపయేత్ ।
యామళోక్త ప్రకారేణ విధింవిధి వదాచర ।
రవిదశాయాం కుజభుక్తివత్ ॥ 148

తా. బుధదశలో కుజభుక్తియందుకుజుడు 6-8-12రాను లయందున్నను, నీచరాశియందున్నను, శత్రు క్షేత్రమందున్న ను, ధూమాది గ్రహములతో గూడియున్నను, పాపద్రేక్కా ణమందున్నను, ద్వితీయసప్తమ రానులయందున్నను ఆభుక్తి యందు సహోదరమరణంబును, బంధుజనులతోడవిరోధమును, తాపజ్వర భయమును. విషపీడయు, శస్త్రభీతియు, అగ్నిభయ మును, సమానజనులతోడ ద్వేషమును, దాయాదులతోడ కలహమును కలుగును. ఆదోష పరిహారార్థమై వృషభదాన మియ్యవలెయును యామళోక్త ప్రకారముగా సూర్యదశలో కుజభుక్తియందు చెప్పినవిధిననుసరించి దానమియ్యవలెయును.

—[ బుధదశాయాం రాహుభుక్తౌ ఛాగదానం. ]—

శ్లో॥ బుధస్యాంతర్గ తేరాహౌ కేంద్రకోణ స్థితేపివా ।
లగ్నాత్ షష్ఠాష్ట రాశిస్థే వ్యయేవా నీచరాశిగే ।
నీచాంశే నీచసంయుక్తే క్రూరగ్రహయుతేపివా ।
విషచోరాగ్ని భీతిశ్చచారాణ్మే శోభవిష్యతి ।
వ్యాధిపీడా మృత్యుభయం స్థానాదిచ్యుతికారకః ।
కుళీరసింహ కుంభాది స్థానస్థే కలహోభవేత్ ।
తద్దోష పరిహారార్థం రుద్ర సాహస్రకంజపేత్ ।
ఛాగదానం ప్రకుర్వీత సర్వసం పత్ర దాయకం ।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ।
రవిదశాయాం శనిభుక్తివత్ ॥ 149

తా. బుధదశలో రాహు భుక్తియందు రాహువు కేంద్రకోణముల యందున్నను, 6-8-12 రాసులయందున్నను, నీచరాశియందున్నను, నీచాంశయందున్నను, నీచగ్రహ సంబంధము కలిగియున్నను, క్రూరగ్రహములతో కూడియున్నను, ఆభుక్తియందు విషభీతియు, చోరబాధయు, అగ్నిభయమును, శీఘ్రముగానే కలుగును. గాకను వ్యాధిపీడయు, మృత్యుభయమును, స్థానచలనమును, కర్కాటక, సింహ, కుంభరాసులయందున్నయెడల కలహమును కలుగును. ఆదోష పరిహారార్థమై సహస్ర రుద్రజపము చేయువలెయును. ఛాగదానము చేసిన పిమ్మట సకలవిధసంపదలు లభించును. యామళోక్త ప్రకారముగా సూర్యదశా శనిభుక్తియందు చెప్పిన విధి ననుసరించి దానమియ్యవలెయును.

—[బుధదశాయాం గురుభుక్తౌ కాంచన ప్రతిమాదానం.]—

శ్లో॥ బుధస్యాంతర్గతే జీవే నీచేవా పాపసంయుతే।
క్రూరద్రేక్కాణ సంయుక్తే షష్ఠాష్ట వ్యయరాశిగే।
ద్వితీయ ద్యూన పయుతే దేహబాధా భవిష్యతి।
శన్యార ఫణి సంయుక్తే కలహో బంధునాశనం।
చోరా ద్రాజ్ఞో భయం క్లేశః పితృమాతృ వినాశనం।
జ్వరవ్రణాగ్నిభీతిశ్చ జీవగోభూమి నాశనం।
తద్దోష పరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
కాంచన ప్రతిమాదానం గురుప్రీతి కరంతథా।
యామళోక్త ప్రకారేణ విధిం విదివదాచర।
గురుదశా ప్రకారవత్॥ 150

తా. బుధదశాగురుభుక్తియందు గురువు నీచరాశియందున్నను, పాపగ్రహముతో కలిసియున్నను, క్రూరద్రేక్కా

ణమందున్నను, 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్త మాధిపతులతోడ కలిసియున్నను, ఆభుక్తియందు దేహబాధయు, శని, రవి, రాహువులతో కలిసియున్నయెడల కలహమును,బంధు నాశనమును, చోరభయమును, రాజబాధయు, దుఃఖమును, మాతాపితృవినాశంబును, జ్వరపీడయు, వ్రణబాధయు, అగ్నిభయమును, పశ్వాదినాశమును, భూమినాశమును, కలుగును. ఈదోషపరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవలెయును. బంగారు ప్రతిమాదానము గురుప్రీతికరముగా చేయవలెయును. యామళోక్త ప్రకారముగా గురుదశలో చెప్పియున్నవిధి ననుసరించి దానము చేయవలెయును.

—[ బుధదశాయాం శనిభుక్తౌ మహిషీదానం. ]—

శ్లో॥ బుధస్యాంతర్గతేమందే షష్ఠాష్టవ్యయరాశిగే ।
నీచేవాపాపసంయుక్తే క్రూరషష్ట్యంశ గేపివా ।
ద్వితీయ ద్యూనపయుతే ధూమాదిగ్రహసంయుతే ।
దేశాద్దేశాంతరం యాతి స్వగ్రామే స్థితినాశనం ।
స్వాధికారవినాశంచ యుద్ధేభయ మవాప్నుయాత్ ।
వాతరోగాద్భయం కించిచ్ఛూలరోగాది సంభవం ।
తద్దోష పరిహారార్థం మహిషీదానమాచరేత్ ।
యామళోక్త ప్రకారేణవిధిం వదాచర ।
రవిదశాయాం రాహుభుక్తివత్ ॥ 151

తా. బుధదశలో శనిభుక్తియందు శని 6-8-12 రాసులయందున్నను, నీచరాశియందున్నను, పాపగ్రహముతో కలిసియున్నను, క్రూరషష్ట్యంశ యందున్నను, ద్వితీయ సప్తమాధిపతులతోడ కూడియున్నను, ధూమాదిగ్రహ సంబంధముకలిగియున్నను, ఆభుక్తియందు విదేశవాసమును, స్వగ్రా

మమునందు స్థితినాశనమును, అధికారభంగమును, యుద్ధమం దపజయమును, వాతరోగ భయమును, శూలరోగ ప్రాప్తియు కలుగును. ఆదోష పరిహారార్థమై మహిషీదానము చేయవలె యును, యామళోక్త ప్రకారముగా రవిదశా రాహుభుక్తి యందు చెప్పినవిధి ననుసరించి దానమియ్యవలెయును.

[కేతుదశాయాం కేతుప్రీతికర రజత లోహ పాత్రదానం.]

యామళే॥

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి కేతుప్రీతి కరంపరం।
రజతేన కృతందేవం మానాష్ట పలసంయుతం।
లోహపాత్రేతి విఖ్యాతం సర్వదోష ప్రణాశనం।
దుష్టస్థానస్థితః కేతుః కురుతే సర్వతో భయం।
మహారోగ భయంమృత్యు భయంబంధు వినాశనం।
ధాన్యార్థ పశుకృష్యాది హానిం కేతుం భయం తథా।
తస్మాత్తద్దోషశాంత్యర్థ మాయురారోగ్య సిద్ధయే।
దానమేతత్ప్రకర్తవ్యం భానుభౌమార్క వాసరే।
దేవాలయేగృహేవాపి గోమయా లేపితేస్థలే।
కుళుత్థైరాఢకమితైః రాశింకృత్వాథ తత్రతు।
ధ్వజకారం లోహపాత్రే ప్రతిమాం వేష్ట్యవాససా।
నీలేననీలగంధాద్యైః పూజయే ద్ధ్యానపూర్వకం॥ 152

తా. కేతుప్రీతికొఱకై యామళోక్త ప్రకారముగా దానవిధి చెప్పుచున్నాడు. కేతుదశయందు కేతుప్రీతికరముగా వెండిప్రతిమను లోహపాత్రయం దుంచి దానమియ్యవలె యును. అట్లు చేసినయెడల సకలవిధదోషములును నశించును, దుష్టస్థానములయం దున్న కేతువు అన్నిచోట్ల భయమును, విశేషరోగభీతిని, మృత్యుభయమును, బంధువినాశంబును.

ధాన్యార్థహానియు, పశునష్టమును, కలిగించును. ఆదోషశాంతి కొఱకును, ఆయురారోగ్య సిద్ధికొఱకును, దానమియ్యవలెయును. భాను, మంగళ, శనివారములయందు దేవాలయమునందుగాని లేక యింటియందుగాని గోమయముచే నలికి శుద్ధి చేయబడిన స్థలమందు ఉలవలు, నూనె, బ్యాడలు మొదలగు పదార్థములు రాశిచేసి లోహపాత్రమందు కేతుప్రతిమను యుంచి నీలగంధాదులచేత పూజించి ధ్యానించవలెయును.

ధ్యానం॥

శ్లో॥ ధూమ్రా ద్విబాహవస్సర్వే గదినో వికృతాననాః।
గృధ్రాసన గతానిత్యం కేతువస్స్యుర్వరప్రదా।
కేతుంకృష్ణ్వా న్వితియేతిపూజయే దుపచారకైః।
పాయసం లవణోపేతం మధుమిశ్రం నివేదయేత్।
తతోబ్రాహ్మణమావాహాయ దద్యాన్మంత్రపురస్సరం॥ 153

తా. పైచెప్పబడిన మంత్రములచేత ధ్యానించి. షోడశోపచారపూజలను సలిపి ధూపదీపనైవేద్యాదుల నొసంగి మంత్రపురస్కరముగా బ్రాహ్మణునకు దానమిచ్చుటకొఱకై క్రిందచెప్పబడియుండు ధ్యానమంత్రమును.

ధ్యానమంత్రః॥

శ్లో॥ కుళుత్థధాన్యరాశిస్థం లోహపాత్రే స్థితం విభుం।
కేతురూపం ప్రదాస్యామి సర్వారిష్ట ప్రశాంతయే।
ఇతిదత్వా దక్షిణాంచ దద్యాద్విత్తాను సారతః।
అనేనవిధినాయస్తు లోహపాత్రం దదాతివై।
సర్వదోషవినిర్ముక్త స్సుఖీభవతిమానవః॥
ఇతియామళే కేతుప్రీతికర రజిత లోహదానవిధిః. 154

తా. పఠించి కేతుస్వరూపమై నటువంటి వెండిప్రతిమను

లోహపాత్రమం దుంచి యథాశక్తి ననుసరించి దక్షిణతోడ విధిప్రకారముగా సర్వారిష్ట శాంతిగొఱకై బ్రాహ్మణునకుదాన మిచ్చినయెడల మానవుడు సర్వదోషములనుండి విముక్తుడై సుఖము ననుభవించును. ఈప్రకారముగా యామళమునందు కేతు ప్రీతికరంబగు రజత లోహదానవిధి చెప్పబడియున్నది.

—[ కేతుదశాయాం కేతుభుక్తౌ ఉమామహేశ్వరదానం.]—

జ్యోతిషార్ణవే॥

శ్లో॥ ధ్వజస్యాంతర్గతే కేతౌ రిష్ఫషష్ఠాష్టసంయుతే।
క్రూరగ్రహేణసంయుక్తే ద్వితీయ ద్యూనరాశిగే।
క్రూరషష్ట్యంశసంయుతే ధూమాదిగ్రహసంయుతే।
తద్భుక్తౌ ధననాశస్స్యా ద్ధాన్యనాశ స్తథైవచ।
మాతాపితృవియోగస్స్యా ద్బంధుద్వేషో మనోవ్యథా।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
ఉమామహేశ్వరం దానం కుర్యా దాయుష్య వర్ధనం॥

తా. కేతుదశలో స్వభుక్తియందు కేతువు 6-8-12 స్థానములయం దున్నను, లేక ఆస్థానాధిపతులతోడ కలిసియున్నను, క్రూరగ్రహసంబంధము కలిగియున్నను, ద్వితీయ సప్తమరాసులయందున్నను, క్రూరషష్ట్యంశాధిపతులతో చేరియున్నను, ధూమాదిగ్రహసంయోగము కలిగియున్నను, ఆభుక్తియందు ధననాశంబును, ధాన్యనాశంబును, మాతాపితృవియోగంబును, బంధుద్వేషమును, మనోవ్యథయును, కలుగచేయును. ఆదోషపరిహారార్థమై మృత్యుంజయజపము చేయవలెయును. ఉమామహేశ్వర దానముకూడ చేయవలెయును. అందువల్ల ఆయుష్యాభివృద్ధి కలుగును.

హేమాద్రౌ॥

శ్లో॥ ఏతద్దానంచికీర్షు రయనాది పుణ్యకాలేషు ।
దేవాలయాది పుణ్యదేశేషు గోమయానులేపిత ।
రంగవల్ల్యాది రచిత భూభాగోపరి ।
ద్రోణపరిమిత తండులరాశిం విన్యస్య ।
వస్త్రేణాచ్ఛాద్య తదుపరియథాశక్తి ।
రజితేన ఘంటామాలావృతం వృషభం ।
కారయిత్వా తదుపరి యథాశక్తి ।
సువర్ణనిర్మితాం ఉమామహేశ్వర ప్రతిమాం ।
నిధాయ కౌశేయ వస్త్రమావేష్ట్య ।
ఏవం రచయిత్వా దానసంకల్పం కుర్యాత్ ।
ఏవంగుణేత్యాది మమఇహజన్మని జన్మాంతరేషు ।
సంభావితానాం బ్రాహ్మణాంగ హింసాదీనాం ।
దద్రురోగ నిదాన భూతానాం అపనోదనార్థం ।
శతవర్షం జీవిత్వసిద్ధ్యర్థం ఉమామహేశ్వర ।
దానం కరిష్య ఇతిసంకల్ప్య ।
ఆదౌ పుణ్యాహం కారయిత్వా । 156

తా. ఈదానము చేయుటయం దిచ్ఛగల పురుషుడు అయనాది పుణ్యకాలములయందును, దేవాలయాది పుణ్యదేశములయందును, గోమయముచే నలుకబడి రంగవల్ల్యాదులచే నలంకరింపబడిన భూభాగమందు బియ్యపురాశిమీద యథాశక్తి రజిత ఘంటములతోగూడిన వృషభమును అందుమీద యథాశక్తి బంగారుతో చేయబడిన ఉమామహేశ్వర ప్రతిమ యుంచి, కౌశేయవస్త్రమును ధరించి దానమిచ్చుటకొఱకై సంకల్పముచేసి అటుపిమ్మట.

తతఃధ్యానం॥

శ్లో॥ పంచవక్త్రోవృషారూఢః ప్రతివక్త్రం త్రిలోచనః ।
కపాలశూలఖట్వాంగీ చంద్రమౌళి స్సదాశివః ॥

ఏవంధ్యాత్వా॥

అని ఈప్రకారముగా ధ్యానముచేసి అటుపిమ్మట.

కద్రుద్రాయేతిమంత్రేణ గంధాద్యైష్షోడశోపచారపూజాం కృత్వా । తదుత్తరభాగేధాన్యోపరితీర్థపూరితకలశం ప్రతిష్ఠాప్య కలశారాధనోక్త ప్రకారేణ సంపూజ్య । తస్మిన్ వరుణమావాహ్య షోడశోపచారై రభ్యర్చ్య పునరగ్నేః ప్రత్యగాసీనః అగ్నింధ్యాత్వా । పరిస్తీర్య అలంకృత్య పాత్రాసాదనాద్యాజ్యభాగాంతం కృత్వా । కద్రుద్రాయేతి సూక్తేన సమిచ్చరుణాజ్యేన అష్టోత్తరశతసంఖ్యయాజుహుయాత్ । తతఃవరుణ కలశోదకేన ఆపోహిష్ఠేతిమంత్రేణ స్నాత్వాధౌత వస్త్రాణి ధృత్వాపునఃపూజాం కృత్వా। తదనంతరమాచార్యం వస్త్రాంగుళీయ కర్ణాభరణాద్యై రభ్యర్చ్య దద్యాద్దాన మంత్రః॥

పంచవక్త్రో వృషారూఢః పార్వతీ రమణప్రభో ।
శివత్వద్రూపదానేన మమాస్తు విఫలంఫలం ।

అస్మై అహం ఇమాం భూభాగోపరిద్రోణ పరిమిత తండులరాశౌ వృషభసహిత సువర్ణనిర్మిత సర్వలక్షణలక్షితాం వస్త్రవేష్టితాం గంధపుష్పాద్యర్చితాం ఉమామహేశ్వర ప్రతిమాం మమపూర్వోక్త ఫలకామస్తుభ్యం సంప్రదదేన మమేతి దత్వాస్వశక్త్యాసువర్ణదక్షిణాం దద్యాత్ ॥

ఇతి ఉమామహేశ్వర దానవిధిః ॥ 157

తా. పైనచెప్పిన విధముగా ధ్యానముచేసి కలశస్థాపన చేసి షోడశోపచారములతోడ హోమాది పూజలను చేసిన

పిమ్మట ఉమామహేశ్వర సువర్ణప్రతిమా సహితముగా సువర్ణ దక్షిణతోడ కలశమును బ్రాహ్మణునకు దానమిచ్చిన పిమ్మట కేతు దోష పరిహారమగును.

—[ కేతుదశాయాం శుక్రభుక్తౌ దుర్గాదానం. ]—

శ్లో॥ కేతోరంతర్గతేశుక్రే నీచేమూఢే పరాజితే।
ద్వితీయద్యూనపయుతే షష్ఠాష్టవ్యయరాశిగే।
క్రూరాంశే క్రూరసంయుక్తే।
తద్భుక్తౌ మృత్యుయాప్నుయాత్।
కళత్రకలహాశ్చైవ బంధుద్వేష స్తథైవచ।
అన్యస్థలప్రవాసస్స్యా ద్యత్నకార్య వినాశనం।
అజీర్ణం గుల్మరోగశ్చ కుక్షిశూలాది రోగకః।
తద్దోషపరిహారార్థం దుర్గాదానం చకారయేత్।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర॥
చంద్రదశాయాం గురుభుక్తివత్. 158

తా. కేతు మహర్దశలో శుక్రభుక్తియందు శుక్రుడు తన నీచరాశియం దున్నను, అస్తంగతుడైనను, అపజయము నొంది యున్నను, ద్వితీయ సప్తమరాశ్యాధిపతులతోడ కలిసి యున్నను, 6-8-12 రాసులయం దున్నను, క్రూరాంశయం దున్నను, క్రూరగ్రహసంబంధము కలిగియున్నను, ఆభుక్తి యందు మృత్యువు సంభవించును. కళత్రకలహమును, బంధు ద్వేషమును, అన్యస్థలవాసంబును, యత్నకార్య వినాశంబును, అజీర్ణమును, గుల్మరోగ ప్రాప్తియు, కుక్షిశూలాది రోగభయ మును, కలుగును. ఆదోషపరిహారార్థమై యామళోక్త ప్రకార ముగా చంద్రదశలో గురుభుక్తియందు చెప్పియున్నరీతి దుర్గా దానము చేయవలెయును.

—[ కేతుదశా రవిభుక్తౌ శివజపవిధిః. ]—

శ్లో॥ కేతోరంతర్గతే సూర్యే నీచేవా క్రూరరాశిగే।
రిప్ఫషష్ఠాష్టమగతే ద్వితీయే మృత్యురాశిగే।
పాపగ్రహాయుతేవాపి సమానస్య మృతిం వదేత్।
అకస్మాత్స్థానచలన మాప్తవర్గా ద్భయం వదేత్।
సర్వత్ర కలహం చైవ సర్వాకార్య వినాశనం।
తద్దోషపరిహారార్థం శివసాహస్రకం జపేత్।
కపిలం వృషభందద్యా చ్ఛాంతిహోమం చకారయేత్।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర॥
రవిదశాయాం కుజభుక్తివత్. 159

తా. కేతుదశలో సూర్యభుక్తియందు సూర్యుడు నీచస్థానమును పొందియున్నను, క్రూరరాశియం దున్నను, 6-8-12 స్థానములయం దున్నను, ద్వితీయసప్తమరాసులయం దున్నను, పాపగ్రహసంబంధము కలిగియున్నను, పితృసమానజనుల మరణము కలుగును గాకను అకస్మాత్తుగా స్థాననాశంబున్, ఆప్తవర్గపువారికి కీడును, సకలచోట్లను, సర్వజనులతోడను కలహమును, ఎల్లకార్యములయందు భంగమును కలుగును. ఆదోషపరిహారార్థమై శివసహస్రజపము చేయవలెయును. కపిలవర్ణముగల వృషభదానమును, ఇచ్చి శాంతిహోమముకూడ చేయవలెను. యామళోక్త ప్రకారముగా రవిదశలో కుజభుక్తియందు చెప్పినట్లు విధిననుసరించ వలెయును.

—[ కేతుదశాయాం చంద్రభుక్తౌ రజతాశ్వదానం. ]—

శ్లో॥ కేతోరంతర్గతే చంద్రే నీచేవా పాపసంయుతే।
షష్ఠాష్టమ వ్యయాధీశ సంయుతే పాపరాశిగే।
తద్భుక్తౌమాతృ మరణం విషరోగాది సంభవః।

ఆప్తబంధు వియోగశ్చ క్షేత్రధాన్య వినాశనం ।
స్త్రీవివాదశ్చ కలహః నృపబాధా భవిష్యతి ।
యత్నకార్య వినాశశ్చ శిరోరోగ స్తథైవచ ।
తద్దోష పరిహారార్థం దుర్గాసాహస్రకం జపేత్ ।
రజతాశ్వ ప్రదానేన హ్యాయు రారోగ్యవర్ధనం ॥ 160

తా. కేతుదశలో చంద్రభుక్తియందు చంద్రుడు. నీచ రాశి యందున్నను పాపగ్రహ సంబంధము కలిగియున్నను, 6-8-12 రాశ్యాధిపతులతోడ కలిసియున్నను, పాపరాశి యందున్నను ఆభుక్తియందు మాతృమరణమును, విషరోగాది సంభవమును, ఆప్తులయొక్కయు, బంధుజనులయొక్కయు వియోగంబును క్షేత్రనాశనమును ధాన్యనష్టమును, స్త్రీవివాదమును, కలహమును, రాజబాధయు, యత్నకార్య భంగమును, శిరోరోగమును, కలుగును. ఆదోష పరిహారార్థమై దుర్గాసాహస్ర జపము చేయవలెయును. గాకను వెండితో చేయబడిన గుఱ్ఱమును దానమిచ్చుట వలన ఆయురారోగ్యాభివృద్ధి కలుగును.

హేమాద్రౌ॥

శ్లో॥ రజతేన వినిర్మాయ తురగం సూర్యవాహనం ।
ప్రయచ్ఛామి ద్విజశ్రేష్ఠ ప్రియతాన్మిహిరోమమ । ఇతిద
ద్యాత్ ॥ యథావిధ్యుక్త అశ్వదానవత్ జ్ఞేయః । కుజదశా
యాం బుధభుక్తివత్ ॥ 161

తా. వెండితో చేయబడిన సూర్యవాహనమై నటువంటి అశ్వమును భక్తితోడ శ్రేష్ఠమైన బ్రాహ్మణునకు కుజదశలో బుధభుక్తియందుచెప్పి విధిననుసరించి దానమియ్యవలెయును.

—[ కేతుదశాయాం కుజభుక్తౌ తైలకుంభదానం.]—

శ్లో॥ కేతోరంతర్గతే భౌమేరిష్ఫ షష్ఠాష్టద్యూనగే ।

ద్వితీయే సప్తమేవాపి పాపసంయుక్తే నీచారిక్షేత్రరాశిగే ।
తద్భుక్తౌ భ్రాతృమరణం భూనాశం ధననాశనం ।
భృత్యవర్గవిరోధశ్చ రాజచోరాగ్ని పీడనం ।
అతిసారాదిరోగశ్చ క్షయాపస్మార సంభవః ।
తద్దోషపరిహారార్థం సుబ్రహ్మణ్య జపంచరేత్ ।
తైలకుంభ ప్రదానేన సుఖమారోగ్యమేష్యతి ॥ 162

తా. కేతుదశలో కుజభుక్తియందు కుజుడు 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తమరాసుల యందున్నను, పాపగ్రహములతో కలిసియున్నను, నీచక్షేత్రమందున్నను, శత్రురాశి యందున్నను, ఆభుక్తియందు సహోదరమరణంబును, భూనాశనమును, ధననాశనమును, భృత్యవర్గవిరోధమును, రాజబాధయు, దొంగలవల్ల భయమును, అగ్నిభీతియు, అతిసారాది రోగభయమును, క్షయాపస్మారసంభవమును కలుగును. ఆదోష పరిహారార్థమై సుబ్రహ్మణ్యజపము చేయవలెయును. తైలకుంభము దానమిచ్చుటవలన సుఖమును ఆరోగ్యమును కలుగును.

ఇతియామళే॥

శ్లో॥ అథవక్ష్యే విశేషేణ దానం తైల ఘటాహ్వయం ।
యత్కృత్వామానవోనిత్యం యమదోషాత్ప్రముచ్యతే।
అష్టమ్యాం వాచతుర్దశ్యాం రిక్తాం కష్టదినేష్వపి ।
భానుభౌమ శనేర్వారే గృహే దేవాలయేపివా ।
గోమయేలేపితా దేశేతిలరాశిం వినిక్షిపేత్ ।
ద్రోణంద్రోణార్థకం వాపి హ్యభావే ప్రస్థమాత్రకం ।
ఆయసేన వినిర్దిష్టం కుంభంతత్ర వినిక్షిపేత్ ।
పూరయేత్తిలతైలేన నీలవస్త్రేణ వేష్టయేత్ ।
పలస్వర్ణ వినిర్దిష్టం సూర్యపుత్రం వినిక్షిపేత్ ।

సూర్యపుత్ర మితియమ ఇత్యర్థ్యః ॥
మహిషస్థం చతుర్బాహుం త్రిశూల వరహ స్తకః ।
త్రాసబాణ ధనుర్హ స్తం కిరీటాదివిభూషితం ।
ఏవంరూపం యమంకృత్వా వాహయేత్ప్రతిమోపరి ।
ఏహిసూర్యసుతః క్రూరహ్యూగ్ర దేహ కృశోదర ।
ఇష్టార్థ ఫలదానాయ ప్రతిమాయాం సమావిశ ।
ఇత్యావాహ్య వినిక్షిప్య కుంభేధ్యాయే ద్యమంశుభం ॥

తా. కేతుదశా కుజభుక్తియందు సంభవించు నటు వంటి మృత్యుగండ పరిహారము కొఱకై సుబ్రహ్మణ్య జపమును. సూనెగడిగెయు, దానమియ్య వలెయును. అష్టమియందైనను, చతుర్దశి యందైనను రిక్తతిథుల యందైనను, క్రూర దినముల యందైనను, భాను, మంగళ, శనివారములయందైనను గృహముపందుగాని దేవాలయమునందుగాని గోమయముచేత శుద్ధిచేయబడిన భూప్రదేశమునందు నూగులరాశిని పోసి అయః కుంభములోనించి మూడుతులముల బంగారు యమప్రతిమను చతుర్భుజ మహిషవాహన శూలవరాభయ ధనురాయుధములను ధరించిన మూర్తిని చేయించి ఆవాహన చేసి అటుపిమ్మట.

ధ్యానం॥

శ్లో॥ ఇంద్రనీలద్యుతి శ్శూలీ వరదోమహిషాసనః ।
చాపబాణ ధరస్రగ్వీ ధ్యేయోర్క తనయస్సదా ।
ధ్యాత్వైవం పూజయేత్పశ్చా చ్ఛన్నోదేవీతి మంత్రకః ।
తతఃపుష్పాం జలిందద్యా ద్యమ ద్వాదశనామభిః ।
ఏభిఃపుష్పాం జలింకృత్వా కృసరాన్నం నివేద్యచ ।
తతో బ్రాహ్మణ మాహూయ నీలగంధాక్షతాదిభిః ।

సంపూజ్య వక్ష్యమాణేన దద్యాన్మంత్రేణ తద్ఘటం॥ 164

తా. మంత్రములచేత ధ్యానించి పిమ్మట యమద్వాదశ నామపూజచేసి పుష్పాంజలిచే ధూపదీపనై వేద్యాదులను సమర్పించి అదేప్రకారముగా బ్రాహ్మణుని నీలగంధాక్షతాదులతోడ పూజించి మంత్రపూర్వకముగా ఘటదానము యిచ్చుట కొఱకై.

మంత్ర॥

శ్లో॥ క్రూరానలోకనవశా ద్భువనం।
వినాశయతియో గ్రహోరిష్టః।
తుష్టోధనకనకసమృద్ధిం దదాతిసోస్మాక శనైశ్చరః పాతు।
తైలంపుష్టికరంనిత్యం తైలమాయుష్య వర్ధనం।
అమంగల్య హారంనిత్యం దానాత్ప్రీతి కరోభవేత్।
ఇతిదత్వాతతఃకుంభం దక్షిణాం నిష్కపంచకం।
దద్యాద్దానప్రతిష్టార్థం యమదోష ప్రశాంతయే।
ఏవంయఃకురుతే భక్త్యా తైలకుంభ విధిం నరః।
ఇతియామళే తైలఘటన దానపద్ధతిః॥ 165

తా. బ్రాహ్మణునకు నీలవస్త్రాద్యలంకారములనిచ్చి ఐదు బంగారు వరహాలకు తక్కువలేకుండ దక్షిణయిచ్చి యమదోష శాంతికొఱకై అన్నిటికి దానము చేయవలెయును. ఈప్రకారముగా శ్రద్ధాభక్తులతోడ విధిననుసరించి తైలకుంభ దానమియ్యవలెయు నని యామళమునందు చెప్పబడియున్నది.

—[ కేతుదశాయాం రాహుభుక్తౌ మహాకూశ్మాండదానం.]—

శ్లో॥ కేతోరంతర్గతేరాహౌ కేంద్రకోణ స్థితోపివా।
ద్విసప్తమాధిపయుతే పాపగ్రహాయుతేబలీ।
నీచాంశే నీచరాశిస్థే షష్టాష్టవ్యయరాశిగే।

తద్భుక్తౌ పితృపీడాస్యా ద్బ్రహ్మరాక్షస పీడనం ।
అపస్మార భయం చైవ భూతావేశ జ్వరాద్భయం ।
విధవా కలహం చైవ ఋణదారిద్ర్య పీడనం ।
నీచసేవా మానభంగో స్వ స్త్రీవ్యాధి ప్రపీడనం ।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపం చరేత్ ।
మహాకూశ్మాండదానేన హ్యాయురారోగ్య వర్ధనం ॥ 166

తా. కేతుదశలో రాహుభుక్తియందు రాహువు కేంద్రత్రికోణములయం దున్నను, ద్వితీయ సప్తమరాశ్యాధిపతుల తోడ కలిసియున్నను, బలము గల పాపగ్రహసంబంధము కలిసియున్నను, నీచాంశను పొందియున్నను, నీచరాశియం దున్నను, 6-8-12 స్థానములయం దున్నను, ఆభుక్తియందు తండ్రికి పీడయు, బ్రహ్మరాక్షస భయమును, అపస్మారభీతియు, భూతావేశమును, జ్వరపీడయు, విధవస్త్రీకలహమును, ఋణబాధయు, దారిద్ర్యపీడయు, నీచసేవయు, మానభంగమును, తనభార్యకు రోగబాధయు, కలుగును. ఆదోషపరిహారార్థమై మృత్యుంజయ జపము చేయవలెయును. మహాకూశ్మాండ దానము చేసినయెడల ఆయురారోగ్యాభివృద్ధికలుగును.

రుద్రయామళే॥

—[ పితామహఉవాచ. ]—

శ్లో ॥ అథదానం ప్రవక్ష్యామి కూశ్మాండ ఫలసంజ్ఞికం ।
భ్రూణహత్యాదిపాపానాం రహస్యే మహతామపి ।
తత్సం సర్గాదిపాపానాం సమాన ముత పాపినాం ।
సద్యస్సంశోధనంపుణ్యం పుత్రసంతాన వర్ధనం ।
సంక్రాంతౌరథస ప్తమ్యాం పాతివైధృతి జన్మభే ।
గ్రహణద్వితయేమాయాం శయనైకాదశీదినే ।

దానమేతత్తు కర్తవ్యం విధినా శ్రద్ధయాముదా ।
మహోచ్ఛేవ్రతం శతందద్యా త్పాదోన మతిపాతకే ।
దద్యాత్సమేషు పంచాశత్త్రిం శతంచోపపాతకే ।
వింశతింసంకరాద్యేషు దశోనం నక్వచిత్స్మృతం ।
కూశ్మాండాని సమానీయ్య దృఢస్థూలా వ్రణానిచ ।
సువర్ణేన సువర్ణేన పుష్పంతస్య ప్రకారయేత్ ।
ఫలంచ కంధాక స్వావృత్తమేకైక మర్పయేత్ ।
తిలద్రోణేనసంఛాద్య రక్తవస్త్రేణ వేష్టయేత్ ।
అభ్యర్చ్య బ్రాహ్మణాన్ భక్త్యా పంచాభరణవస్త్రకైః ।
లక్ష్మీనారాయణప్రీత్యై దద్యాదేకైకశఃఫలం । 167

తా. బ్రూణహత్యాది పాపములును, తత్సమానపాపములును, పరిహరించుటకొఱకును, సంతాన వృద్ధికొఱకును, సంక్రాంతియందుగాని, రథసప్తమి యందుగాని, వ్యతీపాత వైధృతిమొదలగు యోగములయందుగాని, గ్రహణకాలముల యందుగాని, శయనైకాదశీ దినములయందుగాని శ్రద్ధతోడ విధిప్రకారముగా లక్ష్మీనారాయణ ప్రీతికొఱకై పదికి తక్కువ లేకను నూటఎనిమిదికి ఎక్కువలేకను యుండునట్లు పెద్దగుమ్మడి కాయలను తెచ్చి ప్రతియొక్కటియందును ఒక్కొక్కవిష్ణు ప్రతిమనుయుంచి ఒక్కొకవస్త్రసహితముగా అధికదక్షిణతోగూడ.

ధానమంత్రః॥

శ్లో॥ బ్రహ్మహత్యాపనోదార్థం బ్రహ్మణా నిర్మితంపురా ।
కూశ్మాండం బహుబీజాఢ్య మతశ్శాంతి ప్రయచ్ఛతి ।
దశపంచా పివానిష్కాన్ దక్షిణాంసంప్రదాపయేత్ ।
నిష్కత్రయమథైకంవా విత్తశాఠ్యే వివర్జితః ।
ఏవంకృత్వా విధానేన సర్వపాపైః ప్రముచ్యతే ।

పుత్రాన్నాయుష్మతో లబ్ధ్వా విష్ణులోకం సగచ్ఛతి।
ఇతి బ్రహ్మాండ పురాణే మహాకూశ్మాండ దానవిధిః ॥ 138

తా. దానమంత్రోచ్చరణ చేసి బ్రాహ్మణునకు దాన మిచ్చినయెడల సర్వపాపములును నశించి పూర్ణాయుర్దాయము గల పుత్రోత్పత్తిని పొంది విష్ణులోకము చేరువాడగును. ఈప్రకారముగా బ్రహ్మాండ పురాణమునందు మహాకూశ్మాండ దానవిధి చెప్పబడియున్నది.

—[ కేతుదశాయాం గురుభుక్తౌ తిలదానం. ]—

శ్లో॥ కేతోరంతర్గతే జీవే షష్ఠాష్టవ్యయరాశిగే।
మూర్ఖేవాధనగేవాపి పాపగ్రహయుతేపివా।
నీచాంశేనీచసంయుక్తే క్రూరగ్రహయుతేపివా।
తద్భుక్తౌతు మనఃఖేదో హ్యపకీర్తి భయంభవేత్।
గురుద్వేషః స్థాననాశః పితృవంశవినాశనం।
బంధుభిః కలహశ్చ స్యాద్దేహోపద్రవ సంభవః।
పుత్రదారాది కలహాస్త స్మాలాద్ద్రవ్యనాశనం।
తద్దోష పరిహారార్థం తిలదానం ప్రకల్పయేత్।
యథాశ్లోక్త ప్రకారేణవిధిం విధివదాచర।
శనిదశాయాం శనిభుక్తివత్ ॥ 139

తా. కేతుదశలో గురుభుక్తియందు గురువు 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తమరాసుల యందున్నను, పాపగ్రహములతో కలిసియున్నను, నీచాంశయందున్నను, నీచగ్రహసంబంధము కలిగియున్నను, క్రూరగ్రహములతో కలిసియున్నను ఆభుక్తియందు మనోదుఃఖమును అపకీర్తిభయము ను, గురువిరోధమును, స్థాననాశమును, పితృవర్గపుజనులకు నాశనమును, బంధువులతోడ కలహమును, దేహమునందు

ఉపద్రవమును, భార్యాపుత్రులతోడ కలహంబును, ఆమూల కముగా ద్రవ్యనాశంబును, కలుగును. ఆదోష పరిహారార్థమై తిలదానము చేయవలెయును. యామళోక్త ప్రకారముగా శని దశలో శనిభుక్తియందు చెప్పినవిధి ననుసరించి దానమియ్య వలెయును.

—[ కేతుర్యాదశాం శనిభుక్తౌ యమదానం. ]—

శ్లో॥ కేతోరంతర్గతే మందే నీచారిక్షేత్రరాశిగే।
ద్వితీయద్యూనపయుతే షష్ఠాష్టవ్యయరాశిగే।
క్రూరగ్రహేణ సంయుక్తే తద్భుక్తౌమరణంధ్రువం।
బంధుభిః కలహశ్చైవ భ్రాతౄణాం నాశనం తథా।
సమానజననాశశ్చ హ్యాప్తబంధు వినాశనం।
ఋణరోగని వృద్ధిస్స్యా న్నానారోగాద్భయంతథా।
తద్దోష పరిహారార్థం యమదానం ప్రదాపయేత్ ॥ 170

తా. కేతుదశలో శనిభుక్తియందు శని నీచక్షేత్రమందు న్నను, శత్రురాశియందున్నను, ద్వితీయసప్తమాధిపతులతోడ కలిసియున్నను 6-8-12 రాసులయందున్నను, క్రూరగ్రహ ములతోడ కలిసియున్నను ఆభుక్తియందు నిశ్చయముగా మర ణము సంభవించును. గాకను బంధువులతోడ కలహమును, సహోదరనాశంబును, సమానజనహానియు, ఆప్తబంధువినాశ మును, ఋణబాధయు, రోగపీడయు, నానావిధరోగ భయ మును, కలుగును. ఆదోష పరిహారార్థమై యమదానము చేయ వలెయును.

హేమద్రా॥

శ్లో॥ ఏతద్దానం చికీర్షుః కృష్ణాష్టమ్యాం చతుర్దశ్యా మస్మిన్ పుణ్యకాలేవా గోమయాను లేపిత రంగవల్ల్యాది రచిత

భూభాగే పరిలోహపాత్రం నిధాయ తదంతరే కాంసపాత్రం తదంతరే రజతపద్మం తస్మిన్నిధాయ తత్పద్మే పరియథాశక్తి సువర్ణేన మహిషవాహనం యమం కారయిత్వా నిధాయతస్య పరితః క్రమాత్ ।

తామ్ర కాంస్య పిత్తళ నిర్మితాన్ పురుషకారాన్ కాలదూతాన్ ఖడ్గఛురికా ప్రాస తోమరాయుధానిచ విన్యస్య యమం నీలవస్త్రేణసంవేష్ట్య ప్రత్యేకం మహిషీపృష్ఠేనిధాయ। ఏవంరచయిత్వా కర్తాదాన సంకల్పంకుర్యాత్ ।

మమఇహజన్మని జన్మాంతరేషు సంభావితసమస్త పాపక్షయద్వారా యమపాశభయనివృత్త్యర్థం సకలాభీష్టఫలప్రదాయక శ్రీయమధర్మరాజప్రీత్యర్థం మృత్యుంజయప్రోక్త ప్రకారేణ యమదానం కరిష్యే ఇతి సంకల్ప్య ॥ 171

తా. ఈదానము నివ్వగోరు పురుషుడు కృష్ణపక్షపు అష్టమియందుగాని, చతుర్దశి యందుగాని, పుణ్యకాలముల యందుగాని గోమయముతో నలుకబడిన రంగవల్ల్యాదులను రచించినట్టి భూప్రదేశమునందు లోహపాత్రముంచి అటు పిమ్మట కాంసపాత్రమును, అట్లే వెండిపద్మమును యుంచి ఆ పద్మము పైభాగమున తనశక్తికి తగినట్లుగా బంగారుతో చేయబడిన ఎనుము వాహనముమీద యమప్రతిమను యుంచి, లోహములచేత చేయబడిన యమదూతప్రతిమలను, ఆయుధ సహితముగా చేయించి ఎనుముమీద పెట్టి నీలవస్త్రమునుచుట్టి దానమిచ్చు నటువంటికర్త ప్రత్యేకమహిషముయొక్క పృష్ఠభాగమునందు నిలుచుండాని, ఈజన్మమునందు పూర్వజన్మముల యందును చేయబడిన సమస్తపాపక్షయము కొఱకును, యమపాశమువల్ల కలిగెడు భయనివారణ కొఱకును, సకలాభీష్టఫల

ముల నిచ్చువాడైన శ్రీయమధర్మరాజుయొక్క ప్రీతినిసంపా దించుటకొఱకై మృత్యుంజయప్రోక్త ప్రకారముగా యమ దానము నిచ్చుటకుగాను సంకల్పము చేయవలెయును. అటు పిమ్మట:—

ధ్యాయేత్॥

శ్లో॥ పాశదండధరంభీమం యమం మహిషవాహనం।
కాలమేఘసమానాభం కరాళవదనాన్వితం।
భయదాస్త్రైస్సదోపేతం కాలధూత్రైర్భయంకరైః।
భయంకరంతుపాపానాం సౌమ్యం సుకృతినాం సదా।
చింతయామాయురారోగ్యం సంపదర్థం సుఖాయచ।
ఏవంధ్యాత్వాయమాయ సోమగ్ం సునుతేతిరుచానామ
మంత్రేణ నీలగంధాద్యైః సంపూజ్యబ్రాహ్మణం పాత్ర
భూతం నీలవస్త్రాద్యై రభ్యర్చ్య దద్యాద్దానమంత్రః॥ 172

పైనచెప్పిన శ్లోకపఠనచేతధ్యానించి నామమంత్రముల తోడ పూజించి నీలగంధాక్షత పుష్పాదులను సమర్పించి బ్రాహ్మణునకు దానమిచ్చుటకొఱకై దానమంత్రము చెప్ప వలసినది.

శ్లో॥ మహిషీపృష్ఠ దేశస్థం లోహపాత్ర ప్రతిష్ఠితం। కాంస్యపాత్రే ప్రవిన్యస్తం రూప్యపద్మోపరిస్థితం। దండపాశ ధరంభీమం భీమదూత్రైస్సమావృతం। ప్రాసాసికుంత పరిఘ తోమరాద్యా యుధాన్వితం। దదామితవ విప్రేంద్ర యమం మృత్యుభయార్దితః। అస్మైఅహం ఇమాం గోమయానులేపిత రంగవల్యాది రచితభూభాగో పరిస్థిత ప్రత్యక్షమహిషీ పృష్ఠో పరివిన్యస్థ లోహపాత్ర మధ్యస్థిత కాంస్యపాత్రో పరిప్రతి ష్ఠిత రజితపద్మో పరిసంస్థితం - యథాశక్తి సువర్ణనిర్మితం మహి

మవాహనం దండపాశకరం ద్విభుజం - భయదాత్ర్య నమస్వి
తిం త్రిలోహమయకాల దూతాఖ్య పురమత్ర యానిష్టితం
సర్వాలక్షణలక్షితం సర్వైకంయుతం - పూర్వోక్త ఫలకామస్తు
భ్యమహం సంప్రదదేనమమేతిదత్వా -

దాన సాద్గుణ్యార్థం ఘృతం ఘటం దక్షిణాత్వేన
దద్యాత్ - సువర్ణం వా దద్యాత్ - అత్రప్రత్యక్ష మహిషీం
కేచిన్నాంగీ కృత్యలోహ మహిషీం కారయంతి - యథారు
చ్యారమణీయం - ఇతియమదాన పద్ధతిః ॥ 173

తా. ఈప్రకారముగా దానమంత్రోచ్చరణ చేసి
హోమముచేసి ఇనుముపాత్ర సహితముగాగోమయము పూయ
బడిన ప్రతిమా సహితముగా మహిషదానమును యథాశక్తి
మహాదక్షిణతోడ బ్రాహ్మణునకు దానమిచ్చి లోహమహిష
దానమును నేతితో నిండియున్న కుండను దానము చేసి
సువర్ణదానము కూడచేసి అటుపిమ్మట బ్రాహ్మణ సంతర్పణ
చేసినయెడల దోషశాంతి కలిగి సకలాభీష్టములు సిద్ధించును.
ఇట్లుయమదానపద్ధతి చెప్పబడియున్నది.

—[ కేతుదశాయాం బుధభుక్తౌ మృగదానం. ]—

శ్లో॥ కేతోరంతర్గతే సౌమ్యేరిప్ఫ షష్టాష్టరాశిగేపివా ।
నీచేవాస్తంగతేవాపి క్రూరద్రేక్కాణసంయుతే ।
పాపగ్రహేణ సంయుక్తే మూలకస్థానసంయుతే ।
తద్భుక్తౌ పిత్తరోగస్స్యాన్మాతృ వంశవినాశనం ।
శిరోరోగాదిబాధాచ సంతాపకలహాస్తథా ।
స్వస్థాన చలనంచైవ మిత్రబంధు విరోధితా ।
తద్దోష పరిహారార్థం మృగదానేన శామ్యతి ॥ 174

తా. కేతుదశలో బుధభుక్తియందు బుధుడు 6-8-12

రాసులయం దున్నను, నీచరాశియం దున్నను, అస్తంగతుడై నను, క్రూరద్రేక్కాణమం దున్నను, పాపగ్రహములతోడ కూడియున్నను, మారక రాసులయందున్నను, ఆభుక్తియందు పిత్తరోగమును మాతృవంశపు వారికి వినాశంబును, శిరోరోగ మును, సంతాపమును, కలహమును, స్థానచలనమును, స్నేహ జనవిరోధంబును, బంధుద్వేషమును, కలుగును. ఆదోష పరి హారము కొఱకై మృగదానము చేయవలెను. అటుపిమ్మట శాంతికలుగును.

రుద్రయామళే॥

శ్లో॥ వాతరోగ ప్రతీకారం ప్రవక్ష్యామి సమాసతః ।
పూర్వకర్మవిపాకేన నానాదోషానుసారతః ।
వాతరోగిభవేన్నౄణాం బహుధా భిన్నభేదతః ।
తస్మాత్తద్రోగ నాశాయ తద్విధానం బ్రవీమి తే ।
నవదుర్యోగ కాలేచ పక్షచ్ఛిద్రదినేపిచ ।
ద్రోణతండులదానంచ శుద్ధదేశే ప్రకల్పయేత్ ।
నవవస్త్రం ప్రసార్యాథ కృష్ణసారం మృగంక్షిపేత్ ।
పలత్రయ సువర్ణేన తదర్ధే నాథవాకృతం ।
ఉక్తలక్షణవచ్చారు సాక్షాన్మృగ వదాచరేత్ ।
నాసాయాంచైవ వైడూర్యం నేత్రయోర్మౌక్తికేన్యసేత్ ।
పుచ్ఛంతురాజతేనైవ ఖురంవై తామ్రనిర్మితం ।
ఆనోనియుద్భిర్మంత్రేణ నైవేద్యాంతం ప్రకల్పయేత్ ।
తతో బ్రాహ్మణ మభ్యర్చ్య కులీనంచ కుటుంబినం ।
వస్త్రాభరణ గంధాద్యైర్యథా విత్తానుసారతః ।
పూర్వకర్మవిపాకోద్ధ వాతరోగేనపీడితం ।
మాంత్రాహిమృగదానేన వాతరోగం హరస్వమే ।

సువర్ణదక్షిణాం దద్యా ద్వృథా విత్తాను సారతః ।
బహుధా వాతరోగాద్యై ర్వీముక్త స్సుఖభాగ్భవేత్ ।
ఇతి శ్రీరుద్రయామళే వాతరోగహర మృగదానవిధిః ॥

తా. పూర్వకర్మయందు చేయబడిన నానావిధదోష ములననుసరించి పుట్టెడి వాతరోగాది బాధలను నివర్తిచేసు కొనుటకొఱకై మృగదానము చేయవలెయును దానివిధాన మెట్లనిన, యోగకాలముల యందు పక్షఛిద్ర దినములయం దును బియ్యపుదానమును, మృగదానమును చేయుటకొఱకై శుద్ధ భూప్రదేశమునందు ఆవాహనాది షోడశోపచారముల చేత మంత్రపూర్వకముగా మృగమును పూజించి దానిముక్కు నందునైడూర్యమును, నేత్రములయందు ముత్యములను వెండి తోకయు, తాంబ్రపుగొరిసెయువేసి అటుపిమ్మట బ్రాహ్మణు నకు పూజచేసి సువర్ణదక్షిణ సహితముగా మృగదానముచేసిన యెడల పూర్వకర్మమువల్ల కలిగిన వాతరోగాది బాధలు నివ ర్తియై పురుషునకు సుఖము లభించును. ఈప్రకారముగా రుద్ర యామిళమునందు వాతరోగ నివారణార్థమై మృగదాన విధి చెప్పబడియున్నది.

—[శుక్రదశాయాం శుక్రప్రీతిక రజత పాత్రదానం.]—

యామళే॥

శ్లో॥ అథదానం ప్రవక్ష్యామి శుక్రప్రీతికరంపరం ।
నామ్నారజత పాత్రంతు దానాన ముత్తమోత్తమం ।
బలహీనోయదాశుక్ర స్సర్వబంధుకలహప్రదః ।
దారాపుత్రాది హానిశ్చ కురుతే భ్రాంతిమేవచ ।
బహుమూత్రాను యంచైవ ద్రవ్యసంక్షయ మేవచ ।
తథాపీనసరోగంచ తస్మాత్తద్దోషశాంతయే ॥

సర్వసామ్రాజ్య సిద్ధ్యర్థం పుత్రపౌత్రాభివృద్ధయే ।
దానమేతత్తు కర్తవ్యం శుక్రప్రీతికరంపరం ।
జన్మర్క్షేప్యథవా నామనక్షత్రే శుక్రవాసరే ।
గ్రహయోగే విశేషేణ పుణ్యకాలేథవాక్వచిత్ ।
దేవాలయే గృహేవాపి శుద్ధదేశే సమాంగణే ।
చతురాఢక నిష్పావరాశిం సమ్యక్ప్రకల్ప్యచ ।
తత్రంపాత్రం వినిక్షిప్య పంచకౌణంతు రాజితం ।
పలాష్టక కృతంశ్వేత వస్త్రేణా వేష్ట్యచాముణా ।
తత్రశుక్రసమావాహ్య ధ్యాయేద్దైత్య గురుంశుభం ॥

తా. దానములన్నిటిలోను యుక్తనుమైనటువంటి వెండి పాత్రదానము శుక్ర ప్రీతికరముగా నియ్యవలెయును. శుక్రుడు బలహీనుడై యున్నయెడల స్వంతబంధువులతోడ కలహంబును భార్యాపుత్రాది నాశనమును, మనోభ్రాంతియు, బహుమూత్రరోగంబును, ద్రవ్యనాశనమును, పీనసరోగంబును, సంభవించును. ఆదోషశాంతి కొఱకును, సర్వసామ్రాజ్య సిద్ధికొఱకును, పుత్రపౌత్రాభివృద్ధి కొఱకును శుక్ర ప్రీతికరముగా వెండిపాత్రను దానము చేయవలెయును. జన్మనక్షత్రము నందైనను నామనక్షత్రము నందైనను, శుక్రవారమునందును, గ్రహయోగకాలముల యందును, విశేషపుణ్యకాలముల యందును, దేవాలయము నందుగాని లేక తనయింటి యందుగాని శుద్ధప్రదేశమందు అనుములతో నింపిన వెండిపాత్రను యుంచి ఆవాహనాది షోడషోపచార పూజచేత దైత్యగురుడగు శుక్రుని పూజించి క్రింద చెప్పెడిరీతిగా ధ్యానించవలెయును.

ధ్యానం॥

శ్లో॥ జటిలంచాక్ష సూత్రంచ వరదండకమండలం ।

శ్వేతవస్త్రావృతం వజ్ర రత్నాభరణ భూషితం ।
ఏవంధ్యాత్వా శుక్రమసీత్యే తన్మంత్రేణ పూజయేత్ ।
శ్వేతగంధాక్షతైః పుష్పైః తత్కోణేషు పూజయేత్ ।
నామభిః పంచభిః పంచస్వపి ప్రాగాదితః క్రమాత్ ॥

నామాని॥

శ్లో॥ దైత్యాచార్యో భార్గవశ్చ ఇంద్రాణీశః కవిస్తథా ।
తతోభృగు సుతశ్చేతి నామాన్యుక్తాని వై క్రమాత్ ।
ధూపదీపౌ తతోదత్వా ఘృత మిశ్రాన్నమేవచ ।
నివేద్యవిప్రమాహూయ శ్వేతమాల్యాంబరాదిభిః । 177
సంపూజ్యదద్యాత్తత్పాత్రం మంత్రమేతముదాహరన్ ॥

తా॥ పైనచెప్పిన ప్రకారముగా శుక్రుని ధ్యానించి మంత్రపూర్వకముగా పూజించి తెల్లని గంధ అక్షత, పుష్పాదులను భక్తితోడ సమర్పించి క్రమముగా నామపూజ చేసి పిమ్మట ధూపదీపనైవేద్యముల నొసగి తెల్లని వస్త్రాభరణ సహితముగా బ్రాహ్మణునకు యథామంత్రవిధి ననుసరించి పాత్రదానము చేయవలెయును.

మంత్రః॥

శ్లో॥ రాజతేన వినిర్మితం నిష్పావో పరిసంస్థితః ।
శుక్రాకారం ప్రదాస్యామి పీడాంహరతు మేభృగుః ।
ఇతిదత్వా విధానేన దద్యాద్భక్త్యాతు దక్షిణాం ।
మహాశాంతిం జపేత్పశ్చా ద్యజమాన స్సమాహితః ।
అనేనవిధినాయస్తు దానమేతత్సమాచరేత్ ।
శుక్రపీడా వినిర్ముక్త స్సర్వసంపత్సమన్వితః ।
రూపవాన్ ధనవాంశ్చైవ కీర్తిమాన్ జనవల్లభః ।

ఇహాభుక్త్వాఖిలాన్ భోగానంతే విష్ణుపదం వ్రజేత్ ॥
ఇతియామళే శుక్రప్రీతికర రజతపాత్రదానవిధిః॥ 178

తా. శుక్రప్రీతికరముగా అతిభక్తితోడ దక్షిణసహిత ముగను, మంత్రపూర్వకముగను రజతపాత్రదాన మొసంగిన నరునకు శుక్రపీడవల్ల కలిగెడి సర్వదోషములు నశించిపోవును గాకను సకలవిధ సంపదతో గూడినవాడును, రూపవంతుడును ధనవంతుడును, కీర్తివంతుడును, జనవల్లభుడును, ఇహలోక సుఖములను సంపూర్ణముగా ననుభవించువాడును యగును. భోగానంతరం విష్ణుపదమును చెందును. ఇట్లు యామిళగ్రంథ మందు శుక్రప్రీతికరంబగు రజతపాత్రదానవిధి చెప్పబడి యున్నది

—[ శుక్రదశాయాం శుక్రభుక్తౌ శ్వేతగోదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతేశుక్రే రిప్ఫషష్ఠాష్టశత్రుభే।
నీచేవా బః హీనేవా తద్భుక్తౌ ద్రవ్యనాశనం।
ఆప్తబంధుజనక్లేశం దారావర్గాది పీడనం।
వాహనానాం బరనాశంచ క్షేత్రధాన్య పశుక్షయాం।
స్థానభ్రంశమవాప్నోతి మానహాని ర్భవిష్యతి।
తద్దోషపరిహారార్థం శ్వేతగోదాన మాచరేత్।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర॥
రవిదశాయాం చంద్రభుక్తివత్. 179

తా శుక్రదశలో స్వభుక్తియందు శుక్రుడు 6-8-12 స్థానములను పొందియున్నను, శత్రుక్షేత్రమం దున్నను, నీచ రాశియం దున్నను, బలహీనుడైనను, ఆభుక్తియందు ద్రవ్య నాశనంబును, మిత్రక్లేశమును, బంధుజననాశనమును, భార్యా పుత్రాదిపీడయు, వాహనక్షయమును, వస్త్రనాశనమును, క్షేత్ర

హానియు, ధాన్యనష్టమును, పశుహానియు, స్థానభ్రంశమును మానహానియు కలుగును. ఆదోషపరిహారార్థమై యామళోక్త ప్రకారముగా రవిదశలో చంద్రభుక్తియందు చెప్పబడియున్న విధిననుసరించి తెల్లని ఆవును దానమియ్య వలెయును.

—[ శుక్రదశాయాం రవిభుక్తౌ ఛాయాదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతేసూర్యే నీచేవా శత్రురాశిగే।
ద్విసప్తమాధిపయుతే షష్ఠాష్టవ్యయరాశిగే।
తద్భుక్తౌ జ్వరబాధాస్యా త్పైత్యరోగాది సంభవః।
దాయాదివర్గకలహా స్స్వాధికార వినాశనం।
స్వదేహ పీడనం చైవ పుత్రదారాది నిగ్రహః।
తద్దోషపరిహారార్థం భాస్కర ప్రార్థనం చరేత్।
ఛాయాదానం ప్రకుర్వీత శాంతిమాప్నోత్యసంశయః॥

తా. శుక్రదశలో సూర్యభుక్తియందు సూర్యుడు తన నీచరాశియందుగాని లేక శత్రురాశియందుగాని యున్నను, ద్వితీయ సప్తమాధిపతులతోడ కలిసియున్నను, 6-8-12 రాసులయం దున్నను ఆభుక్తియందు జ్వరబాధయు, పైత్యరోగాది సంభవమును, దాయాదివర్గపువారితోడ కలహమును, స్వంత అధికారనాశనమును, దేహపీడయు, భార్యాపుత్రవియోగమును కలుగును. ఆదోషపరిహారార్థమై సూర్యప్రార్థన చేయవలెయును. గాకను ఛాయాపురుషదాన మిచ్చినపిమ్మట సంశయము లేకుండ శాంతికలుగును,

విష్ణుయామళే॥

శ్లో॥ ఛాయదానం ప్రవక్ష్యామి సర్వవ్యాధి వినాశనం।
అపమృత్యు హరంన్ఱాణాం సర్వోపద్రవనాశనం।
యత్కృత్వా సర్వపాపేభ్యో ముచ్యంతేమనుజాభువి।

బ్రహ్మహత్యా సురాపాన స్వర్ణస్తేయాయుతానిచ ।
మహాపాతక జాలాని ప్రశమం యాంతి పద్మజ ।
జన్మర్క్షే చాత్ర రుద్ధాను స్మరం నారాయణంహృది ।
కుర్యాదాశ్రయ కర్మాణి దంతధావన పూర్వకం ।
సమాప్యకర్మ స్వగృహం ప్రవిశ్య విజితేంద్రియః ।
శుచౌ దేశే సమాసీనో నిర్మలేతి మనోహరే ।
పంచారత్ని ప్రమాణేన చతురశ్రం సమంతతః ।
గోమయేనోపలిప్యోర్వీం నవేనసమార్జనిణా ।
తన్మధ్యే పంచభిః ప్రస్థైః నిర్మలైరసితైస్తిలైః ।
చతురశ్రం ప్రకీర్యాథ లిఖేత్పద్మం మనోహరం ।
కృష్ణేనాహతవస్త్రేణ కల్పయేదాసనంతతః ।
పూర్వమాసీన మభ్యర్చ్య తిలైరక్షత సంయుతైః ।
తత్రాంతరే సమావాహ్య యమరూపం భయంకరం ।
రక్తనేత్రం రక్తకేశం రక్తచందన లేపితం ।
ఉగ్రదంష్ట్రం మహాకాయం ఉగ్రనేత్ర భయంకరం ।
వ్యావృతాస్యం మహావీరం కాలంమహిషవాహనం ।
ఉద్యతేనైకహస్తేన భ్రామయంతం విభీషణం ।
జ్వాలావలి సమాయుక్తం కాలదండం భయంకరం ।
బిభ్రాణం వామహస్తేన పాశమృత్యుగ్రచేతసం ।
ఏవంరూపం సమావాహ్య హైమంయమముదీరయన్ ।
ఆవాహ్యచోపచారైశ్చ పూజాంకృత్వా విధానతః ।
కాలస్యపురతో భాగే గోమయేనానులిప్యచ ।
తత్రకుంభం స్థాపయిత్వా ధాన్యోపరి సమాహితః ।
కుంభోపకరణం సర్వం విధివత్పరి కల్పయేత్ ।
కాలమావాహ్య తన్మంత్రైః రూపధ్యాన పురస్సరం ।

షోడశైరుపచారైశ్చ పూజయిత్వా విశేషతః ।
కుంభస్య పశ్చిమే భాగే విధివజ్జాతవేదసం ।
స్థాపయిత్వాజ్యభాగాంతం హోమకర్మ సమాప్య చ ।
తతస్తు మూలమంత్రేణ ఘృతేన జుహుయాత్సుధీః ।
అష్టోత్తరశతం కుర్యాదష్టావింశతిమేవవా ।
యమాయేత్యాదిభిః పంచదశభిశ్చ హువేత్సుధీః ।
తిలైశ్చ సర్షపైశ్చైవ ప్రత్యేకం చాష్టవింశతిం ।
హోమశేషం సమాప్యాథ కృత్వా పూర్ణాహుతిం తతః ।
కాంస్యపాత్రం సమాదాయ త్రింశత్పలవినిర్మితం ।
ఘృతేనపూరయిత్వాథ పంచప్రస్థప్రమాణతః ।
నిష్కత్రయసువర్ణంచ ఘృతమధ్యే వినిక్షిపేత్ ।
కృష్ణవస్త్రేణసంవేష్ట్య కాలస్య పురతోన్యసేత్ ।
తథానిజాయుధంసర్వం ధారయన్ భూషణానిచ ।
కాలంసమర్చ్యయేద్భక్త్యా ధ్యాత్వారూపం స్వనామతః ।
యమాదినామభిశ్చైవ దద్యాత్పుష్పాంజలిం బుధః ॥ 1[illegible]1

తా. శుక్రదశా రవిభుక్తియందు రవి క్రూరుడైన యెడల కలిగెడి దేహపీడాదిదోషనివృత్తి కొఱకును, పాపపరిహారము కొఱకును, జన్మనక్షత్రాది పుణ్యకాలములయందు శుద్ధభూప్రదేశమున గోమయముచేత నలికి రంగవల్ల్యాదులచేత నలంకరింపబడిన స్థలమందు పదితూముల నూగులు రాశిచేసి ఆరాశిమీద పద్మమును వ్రాసి, నీలవస్త్రమును పరచి యమప్రతిమనుంచి తిలాక్షతులచేత పూజించి దానిముంభాగమునందు ధాన్యరాశియందు కలశస్థాపన పూజాదులను చేసి దానికిపశ్చిమ భాగమునందు అగ్నిప్రతిష్ఠ చేసి సంస్కరించి నూటయెనిమిది ఆజ్యాహుతులను, తిలహోమ సర్షపహోమ పూర్ణాహుతి

మొదలగు కర్మలనుచేసి కుండయందు ఐదుతూముల నేతిని నింపి దానియందు మూడువరహాలతూకము గల బంగారుప్రతి మనువేసి నల్లవస్త్రమునుచుట్టి, కాలపురుషకలశమునకు ముం దటనుంచి మహాపూజచేసి.

నామాని॥

శ్లో॥ యమాయ ధర్మరాజాయ మృత్యవేచాంతకాయచ।
వైవస్వతాయ కాలాయ సర్వభూతక్షయాయచ।
ఔదాంబరాయదధ్నాయ నీలాయ పరమేష్ఠినే।
వృకోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయచక్రమాత్।
దండపాశకరాయేతి కృత్వాపుష్పం జలింబుధః।
తత స్తస్మిన్ సమాలోక్య సర్వాంగం దృశ్య తేయథా।
బద్ధాంజలిపుటోభూత్వా మంత్రమిద్ధ ముదీరయేత్॥ 182

మంత్రః॥

శ్లో॥ జన్మాంతరేషు యత్పాపం మనోవాక్కాయకర్మజం।
జ్ఞానతోజ్ఞానతోవాపి యద్యత్పాపం కృతం మయాం।
తత్సర్వం మమదేహాచ్చ నిర్గమ్య ఘృతపూరితే।
పాత్రేకాంస్య మయేపాపం ఛాయారూపేణవర్తతే।
ఏవంవిధితయామర్త్యః త్రివారమవలోక్యచ।
తతో బ్రాహ్మణమాహూయ దద్యాన్మంత్రేణమంత్రవిత్।
యద్యత్పాపం కృతంపూర్వం వర్తతే మయిసర్వదా।
ఛాయరూపేన తత్సర్వం గృహాణత్వం ద్విజోత్తమ।
అపమృత్యు హారంయస్మాచ్ఛాయారూప మనుత్తమం।
తస్మాదస్య ప్రదానేన ప్రీతోభవతు ధర్మరాట్।
తతోదాన ప్రతిష్ఠార్థం దద్యాన్నిష్కంతు దక్షిణాం।
ఏవంయః కురుతేదానం కారయిష్యతి వానరః।

నచాగ్నేర్నాపి శస్త్రేభ్యోనజిరాభ్య స్సమంతతః ।
నజ్వరాన్నపిశాచేభ్యో తస్యభీతి కదాచన ।
జీవేచ్ఛర్ష శతంసాగ్ర మపమృత్యు వివర్జితః ।
మంత్రయంత్రాది కర్మాణి లూతాది స్ఫోటకా స్తథా ।
అభిచారాణి సర్వాణి స్థావరాణి విషాణిచ ।
నశ్యంతి సకలారోగ్య స్సత్యంకాల ప్రసాదతః ।
ఇతివిష్ణుయామళే ఛాయాదానవిధిః ॥  153

తా. పైనచెప్పిన ప్రకారముగా నామపూజచేసి మంత్ర సహితముగా ధ్యానముచేసి అటుపిమ్మట అజ్యావలోకనము చేసి కాంస్యపాత్రయందు కరిగిన నేతిలో ఛాయాపురుష దర్శనము చేసి అట్లు మూడుసారులు చూచినపిమ్మట శ్రోత్రియ బ్రాహ్మణుని యథావిధిగా సంపూజించి మహాదక్షిణ సహితముగాసర్వ మును దానమిచ్చిన యెడల సర్వానిష్టములు వీడలు రోగబాధలు తొలగి మృత్యు పరిహారమై సూర్యప్రీతి కలుగును. ఈ ప్రకారముగా విష్ణుయామిళమునందు ఛాయా దానవిధి చెప్పబడియున్నది.

—[ శుక్రదశాయాం చంద్రభుక్తౌ మృగదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతే చంద్రే రిష్ఫషష్ఠాష్టగేపివా ।
ద్వితీయద్యూనరాశిస్థే నీచేవా పాపసంయుతే ।
క్షీణేవావికలాంశస్థే తద్భుక్తౌ ద్రవ్యనాశనం ।
మాతృవంశ వినాశశ్చ స్త్రీవివాదో భవిష్యతి ।
శరీరేవాతరోగాద్యై రన్నద్వేషోహ్యరోచకః ।
సమానజనవిద్వేషః ఆత్మప్రభువశాద్భయం ।
తద్దోషపరిహారార్థం మృదానేన శామ్యతి ।

యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ।
కేతుదశాయాం బుధభుక్తివత్ ॥ 184

తా. శుక్రదశలో చంద్ర భుక్తియందు చంద్రుడు 6-8-12 స్థానములయందున్నను, ద్వితీయసప్తమ రాసులయందున్నను, నీచరాశియందున్నను, పాపగ్రహసంబంధము కలిగియున్నను, క్షీణుడైనను, వికలాంశను పొందియున్నను, ఆభుక్తియందు ద్రవ్యనాశనంబును, మాతృవర్గపువారికి వినాశమును, స్త్రీతోడకలహమును, దేహమందు వాతరోగాదిబాధయు, అన్నద్వేషమును, అజీర్ణాదిరోగ సంభవమును, సమానజన ద్వేషమును, తనప్రభువు మూలకముగా భయమును, కలుగును, ఆదోష పరిహారార్థమై మృగదానము చేసిన యెడల శాంతికలుగును. కేతుదశలో బుధభుక్తియందు చెప్పినవిధి ననుసరించి యామళోక్త ప్రకారముగా దానమియ్య వలెయును.

—[ శుక్రదశాయాం కుజభుక్తౌ అనడ్వాహదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతేభౌమే షష్ఠాష్టవ్యయరాశిగే ।
జామిత్రేధనరాశౌవా క్రూరద్రేక్కాణసంయుతే ।
పాపగ్రహయుతే దృష్టే నీచారిక్షేత్రరాశిగే ।
తద్భుక్తౌభృత్య నాశస్స్యాద్భ్రాతృనాశో మనోవ్యథా।
గృహక్షేత్ర వినాశశ్చ ధనధాన్య వినాశనం ।
దాయాది కలహశ్చైవ ఋణబాధా భవిష్యతి ।
విషశస్త్రాగ్ని బాధాచ బుద్ధిభ్రంశో మనోవ్యథా ।
సర్వత్రకలహశ్చైవస్ఫోటక జ్వరపీడనం ।
తద్దోష పరిహారార్థం స్కందపూజాం సమాచరేత్ ।
అనడ్వాహం ప్రకుర్వీత శాంతిమాప్నోత్య సంశయః ।

శాంతికర్మ విధానేన విధిం విధివదాచర ।
రవిదశాయాం కుజభుక్తివత్ ॥ 185

తా॥ శుక్రదశలో కుజభుక్తియందు కుజుడు 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తమరాసుల యందున్నను, క్రూరద్రేక్కాణ మందున్నను, పాపగ్రహములతోడ కలిసి యున్నను, లేక చూడబడినను, నీచరాశి యందున్నను, శత్రుక్షేత్ర మందున్నను, ఆభుక్తియందు సేవక జననాశనంబును, సహోదరుల నాశనంబును, మనోవ్యధయును, గృహనష్టమును, క్షేత్రనాశనమును, ధనహానియు, ధాన్యనష్టమును, దాయాదులతోడ కలహమును, ఋణబాధయు కలుగును. గాకను, విషభీతియు, శస్త్రభయమును, అగ్నిబాధయు, బుద్ధివికారమును, మనోవ్యథయు, ఎల్లచోట్లను కలహమును, స్ఫోటక పీడయు, జ్వరబాధయు, సంభవించును. ఆదోష పరిహారార్థమై స్కందపూజ చేయవలెయును. పిమ్మట వృషభదానము చేసిన యెడల నిస్సంశయముగా శాంతికలుగును. రవిదశలోకుజభుక్తియందు చెప్పిన రీతిగా శాంతి కర్మవిధి ననుసరించ వలెయును.

[ శుక్రదశాయాం రాహుభుక్తౌ మహాకూశ్మాండదానం. ]

శ్లో॥ శుక్రస్యాంతర్గతేరాహౌ నీచషష్ఠాష్టరిష్ఫగే ।
దుస్థానేవా ధనరాశిస్థే కేంద్రకోణ యుతేపివా ।
ఖలద్రేక్కాణ సంయుక్తే క్రూరషష్ట్యంశగేపివా ।
తద్భుక్తౌపంచమాసేషు వాతజ్వరమజీర్ణకృత్ ।
కార్యవిఘ్న మవాప్నోతి సంచారంచ మనోవ్యథాం ।
శిరోవ్యాధి భయంచైవ ధనం సర్వ వినాశనం ।
తద్దోష పరిహారార్థం దుర్గాదేవీ జపంచరేత్ ।
మహాకూశ్మాండ దానేన శాంతిమాప్నోత్య సంశయః ।

యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ।
కేతుదశాయాం రాహుభుక్తివత్ ॥ 186

తా. శుక్రదశలో రాహుభుక్తియందు రాహువు నీచ రాశి యందున్నను, 6-8-12 రాసులయందున్నను, ద్వితీయ సప్తముల యందున్నను, కేంద్రకోణములను పొందియున్నను, పాపద్రేక్కాణముల యందున్నను, క్రూరషష్ఠ్యంశముల యందున్నను, ఆభుక్తియందు ఐదుమాసములు వాతజ్వర భయమును, అజీర్ణరోగ సంప్రాప్తియు, కార్యవిఘ్నమును, సంచారమువల్ల మనోవ్యథయును, శిరోవ్యాధియు, ధననాశ మును, కలుగును. ఆదోష పరిహారార్థమై దుర్గాదేవి జపము చేయవలెయును. మహాకూశ్మాండ దానముచేసినయెడల నిస్సం శయముగా శాంతి కలుగును. కేతుదశలో రాహుభుక్తియందు చెప్పినవిధి ననుసరించి యామళోక్త ప్రకారముగా దాన మియ్యవలెయును.

[శుక్రదశాయాం గురుభుక్తౌ స్వర్ణగర్భిత కూశ్మాండదానం.]

శ్లో॥ శుక్రస్యాంతర్గతే జీవే నీచే మూఢపరాజితే ।
పాపగ్రహేణ సంయుక్తే దుష్టస్థానస్థితోపివా ।
తద్భుక్తౌ కార్యహానించ బ్రాహ్మణాద్భయ మావిశేత్ ।
నృపక్రోధం స్థాననాశం కలహాయాసమేవచ ॥
స్వగురోః కలహంచైవ జాతిభిః కలహంతథా ।
దారాపుత్రవియోగాది బుద్ధిభ్రంశం తథైవచ ।
తద్దోష పరిహారార్థం రుద్రజప్యం వినిర్దిశేత్ ।
స్వర్ణగర్భిత కూశ్మాండ దానేనారోగ్య మావిశేత్ ।
యామళోక్త విధానేనవిధిం విధివదాచర ।
శనిదశాయాం రవిభుక్తివత్ ॥ 187

తా. శుక్రదశలో గురుభుక్తియందు గురువు తన నీచ రాశియందున్నను, అస్తంగతుడైనను అపజయము నొంది యున్నను, పాపగ్రహములతోడ కలిసి యున్నను, దుష్టస్థానములయందున్నను, ఆభుక్తియందు కార్యహానియు, బ్రాహ్మణులవల్ల భయమును, రాజద్వేషమును, స్థాననాశమును, కలహమును, దేహాయాసమును. తనగురువుతోడ కలహమును, తనజాతివారితోడ కలహమును, భార్యాపుత్రాది వియోగంబును, బుద్ధిభ్రమణము, కలుగును. ఆదోష పరిహారార్థమై రుద్రజపము చేయవలెయును. స్వర్ణముతో నిండిన కూశ్మాండ దానము చేయుట వలన దేహారోగ్యము కలుగును. శనిదశలో రవిభుక్తియందు చెప్పినవిధి ప్రకారముగా యామళోక్త విధానముననుసరించి దానమియ్య వలెయును.

—[ శుక్రదశాయాం శనిభుక్తౌ మహిషిదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతే మందే లగ్న మష్టాష్టరిఫ్ఫగే ।
ద్యూనేవా ధన సంయుక్తే నీచక్షేత్ర గతోపివా ।
నీచాంశే నీచసంయుక్తే క్రూరగ్రహయుతేపివా ।
రాజకోపః కార్యనాశం ధనధాన్యవినాశనం ।
సమానజన శోకశ్చ చతుష్పాజ్జీవనాశనం ।
వాతజ్వరాతి సారేణ శూలపాండ్వాది రోగకృత్ ।
తద్దోష పరిహారార్థం మహిషీదాన మాచరేత్ ।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర ।
రవిదశాయాం రాహుభుక్తివత్ ॥ 188

తా. శుక్రదశలో శనిభుక్తియందు శనిలగ్నమందుగాని లేక 6-8-12 రాసులయందుగాని యున్నను, ద్వితీయసప్తమ

రాసులయందున్నను, నీచక్షేత్రగతుండైనను, నీచాంశయందు న్నను, నీచగ్రహ సంబంధము కలిగియున్నను, క్రూరగ్రహ ములతో కలిసియున్నను, ఆభుక్తియందు రాజకోపమును, కార్యనాశనమును, ధనహానియు, ధాన్యనష్టమును, సమానజన శోకమును, పశ్వాదుల నాశనమును, వాతజ్వర పీడయు, అతి సారాది రోగసంభవమును, శూలపాండు మొదలగు రోగభ యమును, కలుగును. ఆదోష పరిహారార్థమై యామళోక్త ప్రకారముగా రవిదశలో రాహుభుక్తియందు చెప్పినవిధిననుస రించి ఎనుము దానమియ్య వలెయును.

—[ శుక్రదశాయాం బుధబుక్తౌ లక్ష్మీనారాయణదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతే సౌమ్యే రిష్ఫ షష్టాష్టరాశిగే।
నీచేవా బలహీనేవా ధన ద్యూనగ తేపివా।
క్రూరాంశే క్రూరసంయుక్తే క్రూరషష్ఠ్యంశగేతథా।
బంధుభిః కలహశ్చైవ మాతులస్యవినాశనం।
అపకీర్తి భయంచైవ ధనధాన్య వినాశనం।
స్వాధికారవినాశశ్చ పైత్యరోగ భయంతథా।
జ్వరాతి సారకష్టాది మాతృవర్గ వినాశనం।
తద్దోష పరిహారార్థం విష్ణుపూజాం సమాచరేత్।
లక్ష్మీనారాయణం దానం కుర్యాత్తద్దోషశాంతయే।
యామళోక్త ప్రకారేణ శాంతికుర్యాద్యథా విధి॥
చంద్రదశాయాం బుధభుక్తివత్॥ 159

తా. శుక్రదశలో బుధభుక్తియందు బుధుడు 6-8-12 రాసులయందున్నను, నీచరాశియందున్నను, బలవిహీనుడైనను ద్వితీయసప్తమ రాసులయందున్నను, క్రూరాంశల యందు

న్నను, క్రూరగ్రహ సంబంధము కలిగియున్నను, క్రూర షష్ఠ్యంశములను పొందియున్నను, బంధువులతోడ కలహము ను, మేనమామలకు నాశనమును, అపకీర్తిభయమును, ధననా శమును, ధాన్యనష్టమును, స్వతంత్రాధికార భంగమును, పైత్యరోగభయమును, జ్వరపీడయు, అతిసారాది రోగసంభవ మును, మాతృవర్గపు వారికి హానియు, కలుగును. ఆదోష పరి హారార్థమై విష్ణుపూజ చేయవలెయును. గాకను లక్ష్మీనారా యణ దానము చేసిన పిమ్మట దోషశాంతి యగును. చంద్ర దశలో బుధభుక్తియందు చెప్పిన విధిననుసరించి యామళోక్త ప్రకారముగా దానమియ్య వలెయును.

—[ శుక్రదశాయాం కేతుభుక్తౌ ఛాగదానం. ]—

శ్లో॥ శుక్రస్యాంతర్గతే కేతౌ కేంద్ర కోణస్థితేపివా।
ద్యూనే షష్ఠాష్ట రిష్ఫస్థే పాపగ్రహయుతేతథా।
క్రూరద్రేక్కాణ సంయుక్తే క్రూరషష్ఠ్యంశసంయుతే।
అత్యంత కలహాశ్చైవ శత్రువృద్ధిర్భవిష్యతి।
విషశస్త్రాగ్నిభాధాస్యాత్ స్త్రీపుత్రాదివినాశనం।
పైత్యరోగవికారాది శిరోభ్రమణమేవచ।
స్వదేహపీడా కలహః స్థాననాశో మతిభ్రమః।
తద్దోషపరిహారార్థం మృత్యుంజయ జపంచరేత్।
ఛాగదానం ప్రకుర్వీత సర్వసంపత్ప్రిదాయకం।
యామళోక్త ప్రకారేణ విధిం విధివదాచర।
రవిదశాయాం శనిభుక్తివత్॥ 190

తా. శుక్రదశలో కేతుభుక్తియందు కేతువు కేంద్ర త్రికోణ స్థానముల యందున్నను, సప్తమరాశి యందున్నను,

6-8-12 స్థానముల యందున్నను, పాపగ్రహములతో కలిసి యున్నను, క్రూరద్రేక్కాణముల యందున్నను, క్రూర షష్ట్యంశముల యందున్నను ఆభుక్తియందు విశేషకలహమును శత్రువృద్ధియు విషభీతియు, శస్త్రబాధయు, అగ్నిభయమును, భార్యాపుత్రాది వినాశంబును, పైత్యరోగ వికారంబును,శిరో భ్రమణయు, స్వదేహపీడయు, కలహమును, స్థానచలనమును, బుద్ధివికారమును, కలుగును. ఆదోషపరిహారార్థమై మృత్యుం జయ జపముచేయవలెయును. ఛాగదానము చేసిన పిమ్మటసర్వ సంపదలులభించును. రవిదశా శనిభుక్తియందు చెప్పినవిధినను సరించి యామళోక్త ప్రకారముగా దాన మియ్యవలెయును.



శ్రీరస్తు.

# జాతక ఫల చింతామణిర్నామ హోరాశాస్త్రే

గ్రహరక్షావిధిర్నామ

పంచదశాప్రకరణ ప్రారభ్యతే.

---

## సూర్యగ్రహరక్ష.

మూ॥ సూర్యగ్రహ ప్రకోపేన యస్యరోగాది పీడనం।
తస్య శ్వేతార్క మూలేన రక్షాంబధ్నీత తంత్రవిత్।
మందవారే సమభ్యర్చ్య నామనిర్దేశపూర్వకం।
గ్రామతశ్చోద యీశానాం భాగస్థార్క తరుంభజేత్।
బధ్నీత రుద్రశాఖాయాం రోగిణో నామ లేఖితాం।
ఉషస్యుత్థాయ భానాతు మానేన శుచిరాప్లుతః।
పంచోపచారై స్సంపూజ్యధ్యాత్వా ద్వాదశనామభిః।
అర్కప్రదక్షిణం కృత్వాగృహీత్వో దత్తచంతతః।
భూమావ నుపవేశ్యాథ గృహమాగత్య రోగిణః।
బధ్నీయాత్కంకణంహస్తే కంఠేవాపి వలగ్నకే।
హరిద్రాధూప సంయుక్తం దూర్వాంభోమార్జనోపరి।
ఏవంకృతే సర్వరోగ పీడాస్తంభో భవిష్యతి।
అర్కరక్షా విధిస్త్వేష అశ్వినే తంత్ర యీరితః।
శ్వేతార్కజై స్సమిద్భిస్తు హోమస్సూర్యే ప్రసాదకృత్।
హవిహోపరమాన్నేన రక్తగంధాక్షతై స్సుమైః।

సూర్యప్రసాదో భవితా నమస్కారై ర్విశేషతః।
హోమస్సవితృగాయత్ర్యా సావిత్ర్యాష్టాక్షరేణచ।
త్రిచక్రత్వేన సారేణ మంత్రేణా రుణకేతుకైః।
ఆత్మధ్యానాదియోగేన సూర్యపీడానివర్తతే।
సూర్యస్య గ్రహరాజత్వా త్సర్వాత్మత్వవస్సృతః।
కాలాత్మకత్వాదపిచ చంద్రాద్యాకర్షకత్వతః।
సర్వగ్రహాణాం చారైస్తుయాయాః పీడాప్రకీర్తితా।
తత్తద్దశాభుక్తికాలే తత్తద్దోషోపశాంతయే।
తత్తద్గ్రహేణసంయుక్తం భానుమేవప్రపూజయేత్।
సూర్యోక్త రక్షాంకుర్వీత రక్షయాతద్గ్రహోక్తయా।
మిళిత్వాశాంతి మాప్నోతినాత్ర కార్యావిచారణా ॥ 1

తా. సూర్యగ్రహము యొక్క క్రూరదోషమువల్ల సంభవించునట్టి నానావిధములైన రోగాది పీడలయొక్క సంహారమునకై గ్రామముయొక్క ఈశాన్యోత్తర భాగముల యందున్న తెల్లని జిల్లెడి చెట్టు వద్దకుపోయి శనివారము నాడు దానిని పూజించి రోగియొక్క పేరును వ్రాసియుండు చీటిని ఆచెట్టుయొక్క ఉత్తరభాగమందున్న కొమ్మకు కట్టి వచ్చి, భానువారమునాడు ప్రాతఃకాలమునందు లేచి స్నానముగాను శుచిగాను పోయి సూర్యునియొక్క ద్వాదశనామముల చేత పంచోపచారములతోడ పూజచేసి ప్రదక్షిణ నమస్కారంబులు గావించి ఈశాన్యభాగమందున్న కొమ్మయొక్క నారునుతీసి పసుపుతో తడిపిన బట్టలో కట్టి నేలమీదనుంచక గంటువిడు వక యుండు నట్లుగా యింటికి దూర్వోదకముతోడ తెచ్చి రోగ పీడితునకు సూర్యనామములతోడ ప్రోక్షణ చేసి ధూపము వేసి

కుడిచేతికిగాని నడుమునకుగాని ప్రకృతోచితముగా కట్టి గంటు వేసి సూర్యప్రార్థన చేసినయెడల సూర్యదోషమువల్ల కలిగిన నానావిధములైన పీడలన్నియు తొలగి పోవును. ఈప్రకారము గా సూర్యరక్షావిధియు ఆశ్వినతంత్రమునందు చెప్పబడి యున్నది. పరమాన్నము ఘృతము తెల్లని జిల్లెడి చెట్టుయొక్క కొడును సమిదెలు మొదలగు వాటితోడను రక్తవర్ణము గల గంధము, అక్షింతలు, పువ్వులు మొదలగు వాటితోడను సూర్యమంత్రముల చేత హోమమున్ను గోధుమ ధాన్యదానం బును, ఏకభుక్తవ్రతంబును, త్రిచకల్పము, మహాసౌరము, ఆదిత్య హృదయమును, అరుణము మొదలగు మంత్రముల చేత స్తోత్రము ప్రార్థనము సూర్యప్రీతికరముగా చేసిన యెడల సర్వావిఘ్న శాంతికలుగును, సర్వశ్రేయస్కరము కలుగును. గాకను చంద్రాది సకలగ్రహములయొక్క చారమునకును సూర్యుడేకారముగా నున్నాడు. ఆకాశమందున్న గ్రహముల కన్నిటికిని సూర్యుడేరాజు. సూర్యుడేసర్వాత్మకుడు. సూర్యుడే కాలాత్మకుడు సూర్యుడే కర్మసాక్షి. అందువలన ఏయేదశా భుక్తి కాలములయందు ఆయాదోషములను శాంతిచేయుట కొఱకై ఆయాగ్రహముల వల్ల కలుగునట్టి విధవిధములగు పీడలను పరిహరించుటకు కూడాసూర్యునినే ఆరాదించి సూ ర్యోక్త రక్షావిధినే ప్రయోగించి ఆయాగ్రహమునకు చెప్పు నట్టి రక్షాతంత్రమును చేర్చి సర్వగ్రహముల శాంతియుచేయు టవలన సర్వపీడయు నివృత్తియగును.

## చంద్రగ్రహరక్ష.

మూ॥ ప్రాగ్వ్యాహినిమ్నగాతోయ పూరితే కలశేశుచౌ ।
అపూర్వశ్వేత దూర్వాగ్ర మంజరీం భాస్కరోగయే ।

ప్రత్యూషోర్ధ్వ ధన్తభాజాన పాపనక్షీర పూజితే।
రాజతే కలశే చంద్రమాపోహిష్ఠేతి మంత్రతః ।
ఆప్యాయస్వేత్యృక్చ చావాహ్య నమోదనయితీరయేత్ ।
సంపూజ్యచ తతస్తీర్థం పీత్వాకలశ దానతః ।
తండులానాంచదానేన ప్రీతోభవతి చంద్రమః ।
దద్యాద్ఘటోద్ధ్నిర్ధ వళాగా ద్విజేభ్యశ్చ భక్తితః।
వాసశ్చ ధవళందేయం శ్వేతపుష్పాణితండులాన్ ।
గావశ్చరక్త దోహిన్యో క్షీర దోహిన్యఏవహి ।
భవిష్యంతి నసందేహో నాన్యథా శివభాషితం ॥ 2

తా. పూర్వదిక్కునకు ప్రవహించునట్టి కాలువనీటిని శుచియైన వెండి కలశమునందునించి తెల్లని గరి కేకట్టతో కూడ సూర్యోదయ సమయమునందు మౌనముగా యింటికి తెచ్చి దానితో ఆవుయొక్క పొదుగును కడిగి ఆకలశమునందు పాలును పితికి దానియందు చంద్రుని ఆవాహనచేసి బియ్యపు రాశియందు పూజించి తీర్థమును తీసికొని బ్రాహ్మణునికి దానము యియ్యవలెయును. తెల్లని గోదానము, బియ్యపుదానము క్షీరదానము, తెల్లని వస్త్రదానము, అన్నదానము, మొదలగు వాటివల్ల చంద్రదోష శాంతియగును. రక్తమునే పితుకుచున్న ఆవుశుద్ధమగు పాలను యిచ్చును,

## అంగారక రక్షావిధిః.

మూ॥ భాండాన్నం రక్త వస్త్రేణ నాపితాయ వదాపయేత్ ।
నివాశ్యరోగిణాం దీప్తైః కుజపీడా వినశ్యతి ॥ 3

తా. క్రొత్తకుండయందు సపరికరముగా అన్నము వండి ఎఱ్ఱని వస్త్రమందు దీపసహితముగా రోగికి దృష్టితీసి కుక్కకు పెట్టిన యెడల కుజపీడ పరిహారమగును.

బుధగ్రహ రక్షావిధిః.

మూ॥ ధాన్యం ముద్గాతి కందేయం రోగిణసుల యాసమం।
విప్రాయవేద విదుషే బుధ పీడావినస్యతి।
అపమార్గస్య బీజానాం బీజయోగాం చ్ఛిరోరుజః।
శామ్యంతి తత్క్షణాదేవ బుధ పీడానముద్భవాః॥ 4

తా. రోగపీడితుని పెద్ద త్రాసుయందొక ప్రక్కనుంచి ఇంకొక ప్రక్కయందు పెసలు మొదలగు ధాన్యములను దక్షిణ సహితముగా వేదవిద్యాపారంగతులగు సద్బ్రాహ్మణులకు దానమిచ్చిన యెడల బుధపీడా నివృత్తియగును. బుధ దోషమువల్ల కలుగు నటువంటి శిరోబాధలన్నియు ఉత్తరేణిక బీజముల వల్ల చేయబడిన ఔషధము పుచ్చుకొనుటవల్ల గుణము కలుగును.

గురు ర క్షా వి ధిః.

మూ॥ సాలగ్రామం సువర్ణంచ తులసీం కమలస్రజం।
వేధాధ్యయన నిష్ఠాయ దద్యాద్వై బ్రహ్మచారిణే।
ఏకాదశ్యాం జీవవారే గృహీత్వాశ్వత్థ బధ్నితాం।
గృహారక్షా ప్రకుర్వీత గురుపీడా నివారిణీం॥ 5

తా. బంగారము, సాలగ్రామము, తులసి, తామర పుష్పముల దండ మొదలగునవి, వేదాధ్యయన సంపన్నుడగు బ్రహ్మచారికి దానమిచ్చి ఏకాదశీ గురువారమునాడు అశ్వత్థ

వృక్షపుకొమ్మను తెచ్చి యింటికి రక్షకట్టినయెడల గురుగ్రహ పీడ శాంతియగును.

శుక్రరక్షావిధిః.

మూ॥ ప్రథమర్తుమతీంనారీం వస్త్రాలంకార భోజనైః।
ఉత్సవై స్తోషయేద్వైశ్యా నర్తయే ద్దేవతాపురః।
పయోధద్యాచ్చ బాలేభ్యోగోభోషా సంప్రదాపయేత్।
గీతేనవాద్యఘోషేణ హరినామాని కీర్తయేత్।
బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్తద్వే దేవవసువాసినీః।
శుక్రప్రీతిర్భవేత్తేన సర్వేదుఃఖనివారిణీ॥ 6

తా. ఉత్తమ వర్ణమునకు చేరినయింటిలోనికన్యప్రథమ పుష్పవతియైన యెడల వస్త్రాలంకార భోజనాది యుత్సవముల కు ధనసహాయము చేయుటయు ఇష్టదేవతముందర వేశ్యాంగ నల వల్ల నాట్యమాడించుటయు ఆవులకు పచ్చి కనువుయిప్పిం చుటయు, బిడ్డలకు పాలు యిప్పించుటయు గీతవాద్యములతో గూడిన హరినామ భజనచేయుటయు, బ్రాహ్మణ భోజనము చేయించుటయు, మొదలగు కార్యముల వల్ల శుక్రప్రీతి కలిగి సర్వదుఃఖనాశన మగును.

శని రక్షావిధిః,

మూ॥ శమీమూలే బలిందద్యా త్తిలదాన సమాచరేత్।
భారతశ్రవణం కుర్యా దశ్వత్థస్య ప్రదక్షిణం।
శనిపీడానివృత్తిస్స్యా దభయం క్షేమమాప్నుయాత్॥ 7

తా. శమీవృక్షము యొక్క బుడమునందు బలియన్న ము పెట్టి అంత్యజులకు యిచ్చుట తిలపాత్రదానము చేయుట

అశ్వత్థ ప్రదక్షిణము చేయుట భారతశ్రవణము గోసేవ మొద
లగు వానిని చేయుటవలన శనిపీడా పరిహారమగును.

రాహుః క్షావిధిః.

మూ॥ త్వచంలావంగకీయేలాం సాజ్యసంపాత పిష్కరాం ।
ఓదనాద్యా ప్యృతింవద్యా ద్విధవాయై విశేషితః ।
మ్లేచ్ఛాయ చాథవాధూమ పతం రాహూపశాంతయే ।
అథవా గ్రామ చండాల త్వాప్తృం వాథప్రతోపయేత్ ।
రాహుపీడా నివృత్తి స్స్యాత్సాక్షా దేవమయోదితం॥ ౪

తా. లవంగపట్ట, ఏలకుక్కలు మొదలగు సంభారముల తోడను, నెయ్యి మొదలగు పదార్థముల తోడను వండబడిన భోజనమును విశేషముగా విధవకు యివ్వవలెయును, అథవా రాహుశాంతి కొఱకై మ్లేచ్ఛునకుగాని, గ్రామచండాలునకు గాని, స్వపచునకుగాని భంగియాకును దానమియ్యవలెయును. ఇందువలన రాహుపీడానివర్తియగునని మయుని చేత సాక్షాత్తుగా చెప్పబడి యున్నది.

కేతుర క్షావిధిః.

మూ॥ శివాలయే దీపదానం కుర్యాద్రుద్రాభిషేచనం ।
దర్భస్తంభ వ్రతంచైవ కేతుపీడా నివర్తయే ॥ ౫

తా. శివదేవస్థానమునందు మహాభిషేకదీపా రాధనలను గావించి దర్భస్తంభ వ్రతమనెడి వైదిక కర్మను బ్రాహ్మణుల చేత చేయించినయెడల కేతు పీడనివృత్తియగును. దర్భస్తంభ వ్రతమనగా శ్రావణకృష్ణ అమావాస్యయందు బ్రాహ్మణులు

విధిప్రకారముగా కుశగ్రహణము చేయునట్టి నియమిత కర్మమని తెలియదగినది.

మంగళా చరణం.

మూ॥ ఏషాపంచ దశాధ్యాయా హోరా శాస్త్రస్యసంహితా ।
ఫలచింతామణిర్నామ జీయాత్సూర్య ప్రసాదతః ॥ 10

తా. పదియేను అధ్యాయములుగల జాతకఫలచింతామణి యనెడి హోరాశాస్త్ర సంగ్రహ గ్రంథము సూర్యపరమాత్ముని యొక్క అనుగ్రహమువల్ల జయము పొందునుగాక.

ఇతి జాతకఫల చింతామణౌ.
గ్రహరత్నౌ విధిర్నామ
పంచదశా ప్రకరణం.
సమాప్తం.

శ్రీ. శ్రీ. శ్రీ.





శ్రీ ర స్తు.

# జాతక ఫల చింతామణి

## మొ ద టి అ ధ్యా య ము.



### సూర్యమహాదశ సంవత్సరములు ౬-కి నవగ్రహములకు అంతర్దశలు, విదశలు, సూక్ష్మదశలు, ప్రాణదశలు.

1—వ భాగము.

### సూర్యమహాదశలో సూర్యాంతరమునకు విదశలు, సూక్ష్మదశలు, ప్రాణదశలు.

1. సూర్యమహాదశ సంవత్సరములు 6-కి నవగ్రహములకు అంతర్దశలు.

| | నె | రో |
|---|---|---|
| ర | 3 | 18 |
| చం | 6 | 0 |
| కు | 4 | 6 |
| రా | 10 | 24 |
| గు | 9 | 18 |
| శ | 11 | 12 |
| బు | 10 | 6 |
| కే | 4 | 6 |
| శు | 12 | 0 |

2. సూర్య మహాదశలో సూర్యాంతరం నె 3 రో 18-కి విదశలు.

| | రో | ఘ. |
|---|---|---|
| ర | 5 | 24 |
| చ | 9 | 0 |
| కు | 6 | 18 |
| రా | 16 | 12 |
| గు | 14 | 24 |
| శ | 17 | 6 |
| బు | 15 | 18 |
| కే | 6 | 17 |
| శు | 18 | 0 |

3. సూర్యదశలో సూర్యాంతరములో సూర్యవిదశ-రో 5 ఘ 24-కి సూక్ష్మదశలు.

| | ఘ | వి |
|---|---|---|
| ర | 16 | 12 |
| చ | 27 | 0 |
| కు | 18 | 54 |
| రా | 48 | 36 |
| గు | 43 | 12 |
| శ | 51 | 18 |
| బు | 45 | 54 |
| కే | 18 | 54 |
| శు | 54 | 0 |

4. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో సూర్యసూక్ష్మదశ ఘ 16 వి 12 కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| ర | 0 | 48 | 36 |
| చ | 1 | 21 | 0 |
| కు | 0 | 56 | 42 |
| రా | 2 | 25 | 48 |
| గు | 2 | 9 | 36 |
| శ | 2 | 33 | 54 |
| బు | 2 | 17 | 42 |
| కే | 0 | 56 | 42 |
| శు | 2 | 42 | 0 |

5. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో చంద్రసూక్ష్మ దశ ఘ 27 కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| చ | 2 | 15 | 0 |
| కు | 1 | 34 | 30 |
| రా | 4 | 3 | 0 |
| గు | 3 | 36 | 0 |
| శ | 4 | 16 | 30 |
| బు | 3 | 49 | 30 |
| కే | 1 | 34 | 30 |
| శు | 4 | 30 | 0 |
| ర | 1 | 21 | 0 |

6. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో కుజసూక్ష్మ దశ ఘ 18 వి 54 కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| కు | 1 | 6 | 9 |
| రా | 2 | 50 | 6 |
| గు | 2 | 31 | 12 |
| శ | 2 | 59 | 33 |
| బు | 2 | 40 | 39 |
| కే | 1 | 6 | 9 |
| శు | 3 | 9 | 0 |
| ర | 0 | 56 | 42 |
| చ | 1 | 34 | 30 |

7. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో రాహుసూక్ష్మదశ ఘ 43 వి 36-కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| రా | 7 | 17 | 24 |
| గు | 6 | 28 | 48 |
| శ | 7 | 41 | 42 |
| బు | 6 | 53 | 6 |
| కే | 2 | 50 | 6 |
| శు | 8 | 6 | 0 |
| ర | 2 | 25 | 48 |
| చ | 4 | 3 | 0 |
| కు | 2 | 50 | 6 |

8. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో గురుసూక్ష్మదశ ఘ 43 వి 12-కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| గు | 5 | 45 | 36 |
| శ | 6 | 50 | 24 |
| బు | 6 | 7 | 12 |
| కే | 2 | 31 | 12 |

| | | | |
|---|---|---|---|
| శు | 7 | 12 | 0 |
| ర | 2 | 9 | 36 |
| చ | 3 | 36 | 0 |
| కు | 2 | 31 | 12 |
| రా | 6 | 23 | 43 |

9. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో శని సూక్ష్మదశ ఘ 51 వి 18-కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| శ | 8 | 7 | 21 |
| బు | 7 | 16 | 3 |
| కే | 2 | 59 | 33 |
| శు | 8 | 33 | 0 |
| ర | 2 | 33 | 54 |
| చ | 4 | 16 | 30 |
| కు | 2 | 59 | 33 |
| రా | 7 | 41 | 42 |
| గు | 6 | 50 | 24 |

10. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో బుధ సూక్ష్మ దశ ఘ 45 వి 54-కి ప్రాణదశలు

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| బు | 6 | 30 | 9 |
| కే | 2 | 40 | 39 |
| శు | 7 | 39 | 0 |
| ర | 2 | 17 | 42 |
| చ | 3 | 49 | 30 |
| కు | 2 | 40 | 39 |
| రా | 6 | 53 | 6 |
| గు | 6 | 7 | 12 |
| శ | 7 | 16 | 3 |

11. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో కేతుసూక్ష్మదశ ఘ 18 వి 54 కి ప్రాణదశలు.

6 - వ పదకము చూడుము.

12. సూర్యమహాదశలో సూర్యాంతరములో సూర్యవిదశలో శుక్రసూక్ష్మదశ ఘ- 54 కి ప్రాణదశలు.

| | ఘ | వి |
|---|---|---|
| శు | 9 | 0 |
| ర | 2 | 42 |
| చ | 4 | 30 |
| కు | 3 | 9 |
| రా | 8 | 6 |
| గు | 7 | 12 |
| శ | 8 | 33 |
| బు | 7 | 39 |
| కే | 3 | 9 |

13. సూర్యమహాదశలో సూర్యాంతరములో చంద్రవిదశరో 9కినవగ్రహముల కు సూక్ష్మదశలు.

| | రో | ఘ | వి |
|---|---|---|---|
| చ | 0 | 45 | 0 |
| కు | 0 | 31 | 30 |
| రా | 1 | 21 | 0 |
| గు | 1 | 12 | 0 |
| శ | 1 | 25 | 30 |
| బు | 1 | 16 | 30 |
| కే | 0 | 31 | 30 |
| శు | 1 | 30 | 0 |
| ర | 0 | 27 | 0 |

14. సూర్యమహాదశలో సూర్యాంతరములో చంద్రవిదశలో చంద్రసూక్ష్మదశ ఘ 45కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| చ | 3 | 45 | 0 |
| కు | 2 | 37 | 30 |
| రా | 6 | 45 | 0 |
| గు | 6 | 0 | 0 |
| శ | 7 | 7 | 30 |
| బు | 6 | 22 | 30 |
| కే | 2 | 37 | 30 |
| శు | 7 | 30 | 0 |
| ర | 2 | 15 | 0 |

15. సూర్యమహాదశలో సూర్యాంతరములో చంద్రవిదశలో కుజసూక్ష్మదశ ఘ 31 వి 30 కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| కు | 1 | 50 | 15 |
| రా | 4 | 43 | 30 |
| గు | 4 | 12 | 0 |
| శ | 4 | 59 | 15 |
| బు | 4 | 27 | 45 |
| కే | 1 | 50 | 15 |
| శు | 5 | 15 | 0 |
| ర | 1 | 34 | 30 |
| చ | 2 | 37 | 30 |

16. సూర్యమహాదశలో సూర్యాంతరములో చంద్రవిదశలో రాహుసూక్ష్మదశరో 1 ఘ 21కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| రా | 12 | 9 | 0 |
| గు | 10 | 48 | 0 |
| శ | 12 | 49 | 30 |
| బు | 11 | 28 | 30 |
| కే | 4 | 43 | 30 |
| శు | 13 | 30 | 0 |
| ర | 4 | 3 | 0 |
| చ | 6 | 45 | 0 |
| కు | 4 | 43 | 30 |

17. సూర్యమహాదశలో సూర్యాంతరములో చంద్రవిదశలో గురుసూక్ష్మదశరో 1 ఘ 12 కి ప్రాణదశలు.

| | ఘ | వి |
|---|---|---|
| గు | 9 | 36 |
| శ | 11 | 24 |
| బు | 10 | 12 |
| కే | 4 | 12 |
| శు | 12 | 0 |
| ర | 3 | 36 |
| చ | 6 | 0 |
| కు | 4 | 12 |
| రా | 10 | 48 |

18. సూర్యమహాదశలో సూర్యాంతరములో చంద్రవిదశలో శనిసూక్ష్మదశ-రో 1-ఘ25 వి 30-కి ప్రాణదశలు.

| | ఘ | వి | ప |
|---|---|---|---|
| శ | 13 | 32 | 15 |
| బు | 12 | 6 | 45 |
| కే | 4 | 59 | 15 |
| శు | 14 | 15 | 0 |
| ర | 4 | 16 | 30 |

